# ఆంధ్రప్రదేశ్

## విషయ సూచిక



ముఖచిత్రం : వర్షవిరోధం.

వెనుక అట్ట : ప్రసిద్ధ తెలుగు సినిమాతారలంతా, జాతీయరక్షణనిధి సహాయార్థం 1963 మే 17 వ తేదీన హైద్రాబాదు ఫతేమైదానంలో బ్రహ్మాండమైన వినోద ప్రదర్శన లిచ్చారు. మే 16 వ తేదీన విజయవాడలో, మే 18 వ తేదీన కర్నూలులో కూడా వీరు యిటువంటి ప్రదర్శన లిచ్చారు.

రెండవ అట్ట : ఏకాగ్రతతో తనపనిలో నిమగ్నుడై వున్న ఒక వృత్తిపనివాడు.


సంవత్సర చందా : 3 రూపాయలు — విడి ప్రతి వెల : 25 నయాపైసలు

ప్రియమైన చదువరీ :

నేను ఢిల్లీలో మరోపదవి స్వీకరించడానికి రాష్ట్రాన్ని వదలి వెళ్తున్నట్లు ఇటీవల ఊహాగానాలు బయలుదేరాయి. రాష్ట్రంలోనే వుండాలని నేను ఉద్దేశిస్తున్నట్లు క్రిందటిసారి జరిగిన శాసనసభా సమావేశంలో నేను వెల్లడించడం జరిగింది. కాగా తరువాత ఈ విషయమై మళ్ళీ ప్రకటనలు చేయవలసిన అవసరమున్నట్లు నేను భావించలేదు. రాష్ట్ర ప్రయోజనాలకు హానికలిగించే తమ ప్రయత్నాలను ఏ పరిస్థితిలోనూ విరమించని కొందరు స్వార్థపరులు ఏదో విధంగా ఇంకా రాజకీయ పన్నుగడలు సాగిస్తూనే వున్నారు. అధికారం కట్టబెట్టగల ధీశాలులమని చెప్పుకునే వారి ఈ హేయకరమైన చేష్టలను నేను పూర్తిగా అలక్ష్యం చేయదగినవిగానే పరిగణిస్తాను. అయినా వదంతులు వ్యాపించినప్పుడు వాటిని ఖండించకుండా వదలివేసినట్లయితే వాటికి లేనిపోని ప్రాధాన్యత లభించడం సహజం. అందుచేత, ఈ సమయంలో నేను రాష్ట్రాన్ని వదలి వెళ్ళేప్రశ్న లేదని తప్పనిసరిగా మరోమారు చెప్పవలసి వచ్చింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు తమకు అయిదు సంవత్సరాలవరకూ సేవచేసే బాధ్యతను క్రిందటేడే నాకు అప్పగించారు. సమర్థంగా ఈ బాధ్యత నిర్వహించడానికి నేను సాయశక్తులా కృషిచేయ దలిచాను. నేను నా ప్రజలు ఇచ్చినదానికంటే ఉన్నతమైన గౌరవాలను వేటినీ పొందగోరడంలేదు. ప్రజలు ఆశించిన స్థాయి నందుకోవడానికే నేను ప్రయత్నిస్తాను. మనం చేయవలసినపని చాలా వుంది. నిస్పృహ చెందిన కొందరుచేసే శుష్క ప్రచారాలను గూర్చి యోచిస్తూ వృథాకాలయాపన చేయకుండా మనల నెదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించు కోవడానికి మనమంతా పూనుకోవాలి. నిర్మాణాత్మకమైన ఎట్టి కృషికైనా మొదట అవసరమైన వాటిలో సుస్థిరమైన పరిపాలన ఒకటి. నేడు మనరాష్ట్రంలో పరిపాలన సుస్థిరంగా వుంది. మాతృభూమికి ఏ విధంగానైనా ఉపయోగపడదలచినవారు నిజమైన సేవచేయడానికి ఈ పరిస్థితి ఎంతో అవకాశం కలిగిస్తుంది.

# ముఖ్యమంత్రి లేఖ

బావులు త్రవ్వడానికై సబ్సిడీతోపాటుగా ఋణంకూడా ఇవ్వబడవచ్చునని నేను క్రిందటినెల సూచించడం జరిగింది. ఈ విషయంలో ఇప్పుడు మేము ఒక నిశ్చయం తీసుకున్నామని తెలుపడానికి నాకు సంతోషంగావుంది. బావుల సబ్సిడీ పథకంక్రింద ఇప్పటి వరకూ బావుల త్రవ్వకానికై రైతులకు రూ. 750 లు ఇస్తున్నాము. అయితే బావిత్రవ్వుకోడానికి రైతుకు ఈ మొత్తమే చాలదనీ, సబ్సిడీమొత్తం పొందాక కూడా బావి త్రవ్వుకోగలగడానికి వీలుగా అతడు ఎక్కడైనా అప్పుచేయవలసి వుంటుందనీ అనుభవంవల్ల తెలిసింది. ఇప్పుడు ఈ మొత్తాన్ని రూ. 2,000/- లకు పెంచాము. దీనిలోనుండి రూ. 750/- లను సబ్సిడీగా, మిగతా మొత్తాన్ని అప్పుగా ఇస్తారు. ఈ పద్ధతివల్ల మరెక్కడైనా అప్పుచేయవలసిన అవసరం రైతుకు తప్పుతుంది. సబ్సిడీ మంజూరు చేయడానికి రెండు ముఖ్య సూత్రాలను పాటిస్తారు. అవేమంటే, సబ్సిడీ పొందే వ్యక్తులు గ్రామంలోని పూర్తిగా బీద తరగతికి చెందిన వారై వుండాలి. మరేదైనా ఆధారం సులభంగా పొందగలవారెవ్వరికీ వీటిని ఇవ్వరు. ఈ పథకం క్రింద ఒక కుటుంబానికి ఒక సబ్సిడీకంటే ఎక్కువ ఇవ్వరు. ఈ విషయంలో "ప్రతి కుటుంబానికీ ఒక బావి"అన్నదే మా నినాదం. అద్యతనభావిలో ప్రాజెక్టులేవీ వచ్చే అవకాశం లేని ప్రాంతాలలోనే చాలా వరకు ఈ పథకాన్ని అమలు పరుస్తారు.

ఈ సూత్రాల మేరకు నీటి పారుదలవల్ల చేకూరే ప్రయోజనాలు చాలావరకు అంతటా సమంగా సమకూరగలవని ఆశిస్తున్నాము.

అయినా మనకు ఎంత నీరయినా అవసరమే. ధవళేశ్వరంవద్ద గోదావరికి అడ్డంగా బ్యారేజ్‌ను, శబరివద్ద రిజర్వాయరును నిర్మించే అవకాశాన్ని గూర్చిన ఆలోచనలు కొంతకాలంగా నా మనస్సులో మెదుల్తూ వున్నది. వీటివల్ల అదనంగా తయిదు లక్షల ఎకరాలు సాగు క్రిందికి వస్తాయి. గోదావరి ఆనకట్ట పురాతనమైనది. నీటి పారుదలను బాగా క్రమబద్ధం చేయడానికై ఎప్పుడో ఒకప్పుడు దీనికి బదులు మరో ఆనకట్టను నిర్మించవలసి వుంటుంది. కొంత

కాలం క్రితం నేను ఒక బహిరంగ సభలో మాట్లాడుతూ ఈ సంగతి ప్రస్తావించి దీనిని ప్రజల ప్రాజెక్టుగా పేర్కొన్నాను. దీనిని ప్రజల ప్రాజెక్టు అని ఎందుకు అన్నానంటే దీనిని మన ప్రణాళికలలో చేర్చలేము. కాగా సాధారణ పరిస్థితిలో దీనిని ప్రణాళికలో చేర్పించే అవకాశం చాలా తక్కువగా వుండవచ్చు.

అందుచేత ఈ ప్రాజెక్టుకొరకు ధనం సమకూర్చుకోవడానికి ప్రజలే స్వయంగా ఏర్పాట్లు చేసుకోవాలి. మనం ఇందుకు ఋణం సేకరించ వచ్చునేమోకూడా. ఈ ఋణానికి ఈ ప్రాంతపు ప్రజలేగాక రాష్ట్రమంతటికీ చెందిన ప్రజలుకూడా పెట్టుబడి పెట్టవచ్చు. దీని వల్ల మనరాష్ట్రంలోనేకాక దేశంలోని ఇతర ప్రాంతాలలోకూడా ఇటువంటి పనులపట్ల ఉత్సాహం ఏర్పడుతుంది. తమ అవసరాలకు అనుగుణ్యంగా ప్రజానీకం స్వయంగా నిర్మించుకున్న బృహత్తరమైన "స్వయం సహాయక" ప్రాజెక్టుగాకూడా ఇది రూపొందగలుగుతుంది. ప్రజలనుంచి తగినంతగా ప్రోత్సాహం లభించినట్లయితే ఈ విషయాన్నిగూర్చి వివరంగా ఆలోచించవచ్చు.

అత్యవసర పరిస్థితిమూలంగా ఏర్పడిన ఉత్సాహం కొంత సన్నగిల్లినట్లు కనిపిస్తున్నప్పటికీ ఇప్పుడది హెచ్చు తగ్గులులేని ఒక సమానస్థాయిని పొందినదని చెప్పవచ్చునుకుంటాను. ఇది ప్రజానీకంలో దేశభక్తిపట్ల అభినివేశాన్ని పెంపొందింప జేసింది. దేశభక్తిని చాటే అమోఘ సంఘటనలను మనం ఎల్లెడలా చూస్తున్నాం.

ఈ సందర్భంలో, ఆల్విన్. సిర్పూర్, సర్ సిల్కుల వంటి మన పరిశ్రమలలో కార్మికులు, యజమానులు కుదుర్చుకున్న అయిదు సంవత్సరాల శాంతి ఒడంబడిక విషయమై ప్రస్తావిస్తున్నాను.

దీనివల్ల పారిశ్రామికోత్పత్తి అభివృద్ధికి తమ కృషిని కేంద్రీకరింప జేయడానికి వారికి వీలుకలుగుతుంది. ఈ విధంగా ఒప్పందం కుదుర్చుకున్నందుకు కార్మికులు, యజమానులు ఉభయులూ అభినందనీయులు.

దేశమాతపిలుపు నందుకొని తక్షణమే తమ కర్తవ్య నిర్వహణకు ఉపక్రమించినందుకూ తమ విభేదాలన్నింటినీ త్రోసిపుచ్చినందుకూ, తమకున్న స్వల్పమాత్రపు సాధన సంపత్తిలోనుంచే జాతీయరక్షణనిధికి ఉదారంగా విరాళాలిచ్చినందుకు నేను కార్మికులకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలపవలసివుంది.

కార్మికులు ఇచ్చిన విరాళాలకు ఎంతో ప్రాముఖ్యత వుంది. వారు పెద్దపెద్ద మొత్తాలను సైతం సమర్పించారు. కాబట్టి ఉత్సాహం దృష్ట్యానే కాకుండా వస్తువిషయికంగా కూడా వారి విరాళాలకు ప్రాధాన్యత వుంది.

దేశమాత పిలుపు నందుకోవడంలో కార్మిక ప్రజలు ఇంత ఉత్సాహం ఎందుకు ప్రదర్శిస్తున్నారు? వారి దేశభక్తి ఇందుకు ఒక కారణమే. అయితే వారికీ లౌకికమైన చింతన వుంది. వారు తమ ప్రయోజనాలను గురించి తెలియనివారుకూడా కాదు. కాబట్టి వారు చూపిన ఈ ఉత్సాహాన్ని సామ్యవాద ఆర్థిక వ్యవస్థను నిర్మించాలన్న మన లక్ష్యానికి మరొక నిరూపణగా పరిగణించవచ్చు.

అందరికీ సమానావకాశాలు కల్పించడం, ప్రతి ఒక్కరికీ అత్యవసర జీవితావసరాలను సమకూర్చడమే ఈ లక్ష్యం ఆశయం.

దీని సాధనకు మనదేశం ప్రణాళికలద్వారా తీవ్రంగా కృషి చేస్తున్నది ఈ గమ్యం వైపుకు మనం సాగిస్తున్న ప్రయాణంలో దేనినీకూడా విదేశ దురాక్రమణ సైతం — అడ్డంకుగా వుండనివ్వరాదు. కార్మిక ప్రజలకు ఈ విషయం తెలుసు. మన లక్ష్యమైన ప్రణాళికాబద్ధమైన అభివృద్ధికి అత్యావశ్యకమైన ప్రాతిపదికగా మన స్వాతంత్ర్య పరిరక్షణకు తమ శక్తికొలది వారు పాటుపడదలిచారు.

కార్మిక తరగతులవారు తమను ఎదుర్కొంటున్న ప్రత్యేకమైన ఆర్థిక, సాంఘిక పరిస్థితులవల్ల కొన్ని అవరోధాలకు గురికావల్సి వస్తుంది. వారికి మంచిగా విద్య గరిపి, సంస్కారవంతమైన అలవాట్లను వారిలో పెంపొందించినట్లయితే మన ప్రజాస్వామ్యంలో నాయకత్వం వహించగల దక్షులు అవశ్యం కాగలుగుతారు.

తమ అభివృద్ధికై సమైక్యకృషి సాగించడమే ఈ అవరోధాలను అధిగమించడానికి వారు అనుసరించవలసిన ఏకైకమార్గం ఇప్పుడు. చాలామంది పారిశ్రామిక కార్మికులకు సంఘాలున్నాయి. ప్రస్తుతానికి వీటికన్నింటికీకూడా సరైన నాయకత్వం వున్నదనలేము. వ్యవసాయ కార్మికులు బాగా సంఘటితం కాలేదు. ఇంతేగాక వీరి ఆర్థిక స్థితిగతులుకూడా పారిశ్రామిక కార్మికుల కంటేఅధ్వాన్నంగా వున్నాయి. కార్మిక సంఘాలకు మార్గదర్శకత్వం వహించే బాధ్యత స్వీకరించేవారు, ఈ పనికి సంబంధించినంతవరకు దీనిని ఒకపవిత్ర కార్యంగా భావించి తమ రాజకీయ విషయాలను మరిచిపోగలిగినట్లయితే వారు అన్ని తరగతుల కార్మికులను సక్రమ మార్గంలో సంఘటితం చేయకలగడమేగాక సాంఘికంగా, విద్యావిషయకంగా వారు ఎదుర్కొంటున్న అవరోధాలను తొలిగించడానికి కూడా తోడ్పడ గలుగుతారు. ఈ విషయంలో ప్రభుత్వం సాధ్యమైనదల్లా చేస్తున్నది. బీదవారి పిల్లలకు స్కాలర్ షిప్పులు ఇస్తున్నాము. హరిజనులలో విద్యావ్యాప్తికై ప్రతి విద్యార్థికీ నెలకు రూ. 15/— ల చొప్పున బోర్డింగ్ గ్రాంట్లు లభింపజేయడం జరుగుతున్నది.

కార్మికుల మనోల్లాసానికి కార్మిక శాఖ వివిధ సౌకర్యాలు చేకూరుస్తున్నది. ఉద్యోగ కాలంలో తను విజ్ఞానం పెంపొందించుకోవడానికి ఉజ్వల అవకాశాలు పొందడానికీకూడా వారికి సదుపాయాలున్నాయి. ఇలాంటి అభివృద్ధికరమైన సదుపాయాలు కల్పించడానికీ, కార్మికులను త్రాగుడువంటి దురభ్యాసాలనుంచి మాన్పించడానికీ కార్మిక సంఘాలు, కార్మిక నాయకులుకూడా నిరంతరం కృషిచేయాలి.

—జైహింద్ ।

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి

# అవురా !

—సి. వి. సుబ్బన్న

రమణీయ రత్నములు నూ
త్న మహౌషధులుఁ బృథునాజ్ఞ ధరణీ గోష్ఠీ
రములన్ గల్పించిన మా
హిమాచలముఁదేరి చూడ నెవ్వఁడ వవురా !

సుమనోమిథున మిథః కే
ళి మధుర గంధవహ జాల లీలా విహృతి
ప్రముదిత దరీముఖము మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

ఉమపూలు పండ్లు నిడి శం
భు మూఁడు ప్రొద్దులును భక్తిఁ బూజించి వివా
హము జేసికొన్న యది మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

తుమ పుట్టె నెప్పు డప్పుడె
అమల తపోవృత్తియై గృహస్థతఁ గను పూ
ర్వ మునీశ్వర స్థలము మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

దమియై భగీరథుఁడు సం
యమియై గంగఁ గొనివచ్చె నవనికి, మణి సా
ను మయంపుఁ ద్రోవలను ; మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

అమరాధిప సేనాధిపుఁ
గుమారు నొక ఱెల్లుగడ్డి కొడుకుగఁ బడసెన్
గమనింప నెయ్యెడన్, మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

రమఁ గూడి సువ్రత స్థితి
సమల్ నడిపి పదియు రెండు, చక్రాయుధ సి
ద్ధి ముకుందుఁ డిందు గనె, మా
హిమాచలముఁ దేరి మూడ నెవ్వఁడ వవురా !

తమ తమ బాహుబలము జూ
పు ముచ్చటల అమ్ము దూసిపోఁగొట్టిరి క్రొం
చము జోదు లిద్ద రట, మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

అమృతాంధసులే చేసిరి
సుమీ ! యిచటి హద్దులెల్ల సుప్రథిత పురా
ణ ముఖమ్ముల నింకను మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

భ్రమపడితివో ! మతి చెడితివో !
క్రమ మెఱుఁగక మాటలాడఁ గడగితివో! యథా
ర్థము త్రవ్వి చూడకే- మా
హిమాచలముఁ దేఱి చూడ నెవ్వఁడ వవురా !

అమరులును జక్రవర్తులు
నుమా మహేశ్వరులు నీదునుర్వరఁ గలరా ?
అమరునె నీవాదము ? మా
హిమాచలముఁ దేరి చూడ నెవ్వఁడ వవురా !

# విశేషాలు-వ్యాఖ్యలు

పి.వి.నరసింహారావు

## చైనాపై టిటో అభిప్రాయాలు

బెల్గ్రేడ్‌లో ఇటీవల జరిగిన యుగోస్లావ్ కమ్యూనిస్టు సమాఖ్య సర్వసభ్య సమావేశంలో తాను సమర్పించిన నివేదికలో ప్రెసిడెంట్ టిటో, కమ్యూనిస్టు చైనాను గూర్చి కొన్ని గమనార్హమైన విషయాలు పేర్కొన్నారు. చైనా అనుసరించే విధానాలు ప్రపంచ యుద్ధానికి మాత్రమే దారి తీస్తాయనీ, చైనా నాయకులు అనుసరించే విధానాలను ప్రపంచంలోని అభ్యుదయ శక్తులేవీ ఆమోదించజాలవనీ ఆయన తన స్వాభావికమైన యదార్థవాదధోరణిలో విశదంచేశారు. చైనాలోగల అసంఖ్యాకమైన జనాభానుగూర్చి ఆ దేశనాయకులకు సుప్రసిద్ధమైన అభిప్రాయాలున్నాయనీ కనుకనే అణుయుద్ధంవల్ల కలిగే దుష్ఫలితాలను సైతం వారు ఖాతరుచేయని స్థితిలో వున్నారనీ ఆయనతెలియజేశారు. ప్రెసిడెంట్ టిటో తెలిపిన అంశాలను కమ్యూనిస్టు సిద్ధాంతాల విషయంలో వచ్చిన అంతఃకలహాల కారణంగా చేసిన విమర్శగా ఎంచి త్రోసివేయడానికి వీలులేదు. ఇందుకు రెండు కారణాలు కూడా వున్నాయి. మొదటిది ప్రపంచ రాజకీయ అభిజ్ఞులందరూ పూర్తిగా ఇట్టి అభిప్రాయాలనే కలిగివున్నారు. రెండవది చైనావారి దురహంకారానికీ, దుస్సహానికీ ఇంతకంటే సహేతుకమైన వివరణ మనముందు లేదు. తమ దేశం ఇతర దేశాలన్నింటికంటే ఆధిక్యత కలిగినదనే భావం చైనా వారికి అనాదినుంచే వున్నదన్న సత్యాన్ని చరిత్ర ఋజువుపరుస్తుంది. సామ్రాజ్యవాద రాజ్యంగావున్నా లేదా ఇప్పటిమాదిరి కమ్యూనిస్టు దేశంగావున్నా మొత్తానికి ఏ వేషంలో వున్నప్పటికీ జాత్యహంకారమే వారికి ప్రేరణగా వుంటున్నది. కనుక చైనా, సరిహద్దులలో కేవలం కొన్ని వేల చదరపుమైళ్ళ భూభాగాలను—అవెంత ముఖ్యమైనవైనప్పటికీ—పొందడానికి మాత్రమే ప్రయత్నించడంలేదు. కాగా ప్రపంచంలో ఆధిక్యత సంపాదించాలన్నదే దాని తాపత్రయం. ఆ లక్ష్యసాధనకై సాగించే తీవ్రయత్నంలో వారు ఎట్టి మార్గాలనైనా అవలంబించడానికి వెనుదీయరు. పెట్టుబడిదారీ విధానానికీ, కమ్యూనిస్టు సిద్ధాంతాలకూ సంఘర్షణ అనివార్యమని నిర్దేశించిన మార్క్సు సూత్రానికీ, చైనా వారి ఈ ఆలోచనా సరళికి బాగా పొందిక కుదురుతుంది. “బ్రహ్మాండమైన అగ్నిజ్వాలలు’’ ప్రజ్వలిల్లినప్పుడు అణ్వాయుధాలుగల అగ్రరాజ్యాలు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకొనిపోయి ఒక్క చైనావారు మాత్రమే తగినంత సంఖ్యాబలంతో మిగిలి వుంటారనీ, వారు చైనాకు ప్రపంచనాయకత్వం కట్టబెడతారనీ ఆ ఉన్నతగౌరవం ఇదివరకే తాము ఆశించినట్టుగా తమకు నిర్దేశింపబడివుందనీ వారిభావం. సిద్ధాంతరీత్యా అనివార్యమని చెప్పబడే సంఘర్షణ వేగిరమే రావాలనీ, అందుకు ప్రపంచరాజ్యాలు కూటాలుగా ఏర్పడి విరివిగా ఆయుధసామగ్రిని సమకూర్చుకొని సన్నద్ధంగా వుండాలనీ చైనా వాంఛించడానికి ఇవే ప్రబల కారణాలు. ఇవి భయానకమైనవి. ఈ కారణాలవల్లనే చైనా, పశ్చిమ కూటానికి చెందిన రాజ్యాలకన్నా కూడా అలీన విధానాల నవలంబించే దేశాలను ఎక్కువగా ద్వేషిస్తుంది. ప్రతిదేశం కూడా ఏదో ఒక కూటమిలో చేరిపోవాలనీ, అలా జరిగినప్పుడే తాను ఆశించిన గొప్ప ఉపద్రవం సంభవిస్తుందనీ చైనా అనుకుంటుంది. నేడు చైనీయుల ఆలోచనా సరళి ఇంతటి కిరాతక స్థాయి నందుకున్నది.

ఈలోగా నికితా కృశ్చేవ్, క్యూబా నాయకుడు ఫెడల్‌కాస్ట్రో ఇటీవల చేసిన సంయుక్త ప్రకటనలో ఇతర విషయాలతోపాటు, “యుద్ధం అనివార్యంకాదు” అంటూ తమ విశ్వాసాన్ని పునరుద్ఘాటించారు. దీనితో సిద్ధాంతరంగంలో చైనా ఇతర దేశాలనుండి విడివడడం పూర్తిఅయినట్లే.

## మానవుడు-అంతరిక్షం

అమెరికన్ అంతరిక్ష యాత్రికుడు గార్డన్ కూపర్ ‘ఫెయిత్_7’ అనే అంతరిక్ష నౌకలో 22 సార్లు విజయవంతంగా భూప్రదక్షిణ చేసి రావడం మానవుడు అంతరిక్షాన్ని జయించే ప్రయత్నాలలో మరొక మైలురాయివంటిది. అంతరిక్షనౌకలోని ఆటోమేటిక్ కంట్రోల్ యంత్రం పనిచేయడం ఆగిపోవడం మూలంగా ఏర్పడిన వింత పరిస్థితివల్ల ఈ ప్రయాణంఆశ్చర్య సంభ్రమాలుకలిగించింది. అంతరిక్ష యాత్రికుడు సురక్షితంగా తిరిగి రావడంకోసం ప్రపంచమంతా ఆత్రుతతో ఎదురుచూచింది.

ఈ ప్రయాణంతో కలుపుకొని ఇప్పటి వరకు జరిగినమొత్త [illegible] ఏది. వీటిలో అమెరికావారు చేసినవి ఆరు. రష్యావారు చేసినవి నాలుగు. ఇదివరలో అంతరిక్షయాత్ర చేసినవారు వీరు: (1) రష్యాకు చెందిన మేజర్ యూరీగగారిన్; (2) అమెరికా నౌకాదళ కమాండర్ అలన్ షెప్పర్డ్; (3) అమెరికా విమానదళ కెప్టెన్ విర్జిల్‌గ్రిస్సం; (4) రష్యాకుచెందిన మేజర్ ఘెర్మన్ టిటోవ్; (5) అమెరికా నౌకాదళం లెఫ్టినెంట్ కమాండర్ మాల్కోం స్కాట్ కార్పెంటర్; (7) రష్యాకుచెందిన మేజర్ ఎండ్రియన్‌నికొలయేవ్; (8) రష్యా సైనిక కల్నల్ పావెల్ పోపోవిచ్; (9) అమెరికా నౌకాదళ కమాండరు వాల్టర్‌శ్చిరా.

అంతరిక్షాధికారం ఇప్పుడు మానవజాతికి వారసత్వపు హక్కు అయింది. తొలి "స్పుట్నిక్" నౌక "ఒక జీవన విధానం" మరొకదానికంటె ఆధిక్యత కలిగినదనడానికి దృష్టాంతమైనట్లు కొందరు భావించి ఆనందించినా ఇప్పుడా దృక్పథంలో మార్పు రావడం గమనించ దగినవిషయం. ఒకరు సాధించే అంతరిక్ష విజయాలను మరొకరు శ్లాఘిస్తూ సందేశాలు పంపుకునే పరిస్థితిలోనే క్రుశ్చేవ్, కెన్నెడీలు వున్నారు.

## ఆఫ్రికా జాగృతి

ఇటీవల అడిస్‌అబాబాలో జరిగిన ఆఫ్రికా స్వతంత్ర రాజ్యాధినేతల సమావేశం ఇప్పటివరకు "చీకటిఖండం" గా పిలువబడు తున్న ఆఫ్రికాకేగాక యావత్ప్రపంచానికే మరోముఖ్యమైన సంఘటన. రాబోయే యుగాన్ని ఆఫ్రేషియా యుగమని పిలువ వచ్చు. ఈ యుగంలో పునరుత్థానం పొందిన ఆఫ్రికాదేశాలు తమ అపారమైన జన సంపదతో, ప్రకృతిసంపదతో ఎంతో ప్రముఖ పాత్రవహించడం తథ్యం. ఈ సమావేశంలో వెలడించబడిన కొన్ని అభిప్రాయాలనుబట్టి [illegible] అ[illegible] త్వరితంగా [illegible] ఆశించడానికి వీలున్నది. సామ్రాజ్యవాదులు అభివృద్ధినిరోధకులచే నిర్మింపబడిన ప్రభు త్వాలను బహిష్కరించడానికీ, సామ్రాజ్య వాదులు తమదేశాలనుండి నిష్క్రమించేం దుకు గడువు నిర్ణయించడానికీ వారుచేసిన నిర్ణయాలనుబట్టి నేడు ఆఫ్రికా ప్రజలలో నవ్యోత్తేజం ఎంతగా పరువళ్లు త్రొక్కు తున్నదో గ్రహించవచ్చు.

ఇదే ఇటువంటి మొట్టమొదటి సమా వేశం కాబట్టి నిర్దిష్టమైన ఫలితాలను ఇది సాధించలేక పోవచ్చు. అయినా ఈ సమా వేశం జరపడమే పెద్ద కార్యాన్ని సాధించడ మని ఎవరుకాదనగలరు? దీనివల్ల దక్షిణాఫ్రికా, పోర్చుగల్ పాలకులు అమెరికాలోని క్లుక్లుక్స్‌క్లాన్ అనే సంఘం వారు (నల్లజాతి అంటేనే మంటలు గ్రక్కే శ్వేత జాతీయుల సంఘం) తమ పన్ను గడలను పట్టుదలతో అమలు పరచడం క్రమేణా కష్టతరం కావచ్చు. వారు న్యాయానికి, ప్రజాస్వామ్యానికి, దాదాపు మొత్తం మానవ జాతికి వ్యతిరేకంగా వున్నారు.

## ఆర్థికంగా వెనుకబడిన వారి సహాయానికి నూతన చర్యలు

వార్షికాదాయం రూ. 1000/- లకు తక్కువ గల వారందరి పిల్లలకూ విశ్వవిద్యాలయ విద్యతో సహా ఉచిత విద్యాసౌకర్యాలు కల్పించడానికి ఇటీవల పంజాబు ప్రభుత్వం నిశ్చయించింది. ఈ నిర్ణయం అభినందనీయ మైనది నిజానికి ఆర్థికంగా వెనుకబడిన వారికి సహాయం అందజేసేందుకు ఇది కొత్త మార్గం. వెనుకబడిన తనాన్ని నిర్వ చించడంలో ఇంకా సయుక్తికమైన ప్రాతి పదికను అవలంబించడాన్ని ఇది ఉద్దేశిస్తున్నది. కాగా వెనుకబడిన వర్గాలుగా [illegible] వారు ఇదివరకు మంచి పొందుతున్న విద్యా రాయతీలను ఇకమీదట కూడా పొందడానికి ఈ నిర్ణయం అడ్డురాదు. ఇట్టి చర్యలను దేశమంతటా కూడా అమలు పరచడం అవసరం. చాలా కాలం క్రిందటనే ఇది జరగవలసింది

## నిర్బంధ పొదుపు

రక్షణ కృషికి కావల్సిన సాధన సంపత్తిని సేకరించడానికి కేంద్ర ప్రభుత్వం అదనపు పన్నుల విధింపుకు తోడు నిర్బంధ పొదుపు పథకాన్ని అమల్లోకి తెచ్చింది. ఇప్పటివరకు ప్రజలు స్వచ్ఛందంగా పొదుపు చేసి అనేక మార్గాల్లో మదుపు పెట్టిన మొత్తాలే దేశాభివృద్ధి కృషిలో చాలావరకు ప్రముఖపాత్ర వహించగలిగాయి. జాతీయ రక్షణావసరాలు పెరిగిన కారణంగా ఈ నూతన పథకం అవసరమని భావించబడింది. పన్ను విధింపు వలెనే నిర్బంధ పొదుపు పథకంకూడా ప్రజలు డబ్బు ఖర్చుచేసే అల వాట్లను పరిమితంచేస్తుంది. వారిలో పొదుపు చేసే అలవాటు కలిగిస్తుంది. ఈ పొదుపు ధనం మీద వారికి సంవత్సరానికి 40 శాతం వడ్డీ లభిస్తుంది. ఈ డబ్బును అయిదు సంవత్సరాల వరకు వాపసు తీసుకోడానికి వీలుండదు కాబట్టి ఈ పూర్తి కాలానికి వడ్డీ వస్తుంది.

ఈ పొదుపు పథకం వివిధ తరగతుల ప్రజలకు వివిధ పరిమాణాల ననుసరించి కొన్ని గరిష్ఠ పరిమితులకు లోబడి వర్తింప జేయబడుతుంది. వ్యవసాయదార్లకు 1959-60 వ సంవత్సరంలో చెల్లించిన ప్రాతిపదిక భూమి శిస్తులో సగం, పట్టణ ప్రాంతాల్లో ఆస్తులు వున్నవారికి సంవత్స రంలో ఆ ఆస్తులపై వారికివచ్చే ఆదాయంలో 3 శాతం, సంవత్సరానికి రూ. 1500/-

లకుపైగా సంపాదిస్తూ రాబడిపన్ను చెల్లించనవసరంలేని ఉద్యోగస్థులకు వేతనంలో 3 శాతం చొప్పున పొదుపు చేయాల్సి ఫుంటుంది వృత్తిపనులు చేసుకునేవారు, ఇతర తరగతులవారు వారివారి ఆదాయాలకు అనుగుణ్యంగా పొదుపు చేయాల్సివుంటుంది. రాబడిపన్ను చెల్లించేవారు దానిని చెల్లించిన తరువాత వారి నికరాదాయం రూ. 6000/- లకు మించినట్లయితే నికరాదాయంలో 3 శాతం, ఇంతకంటే ఎక్కువ నికరాదాయం గలవారు ఆ మొత్తంలో 2 శాతం చొప్పున పొదుపు చేయాల్సివుంటుంది. ఈ రెండవ తరగతికి చెందినవారు 2 శాతం చొప్పున జమచేసిన తరువాత వారు అదనపు రాబడి పన్ను సర్‌చార్జిగా చెల్లించవలసిన మొత్తంనుండి ఈ డబ్బు మినహాయించబడుతుంది. ఈ పథకం వర్తించే వ్యక్తులు మొత్తాలు డిపాజిటు చేయనిపక్షంలో శిక్షార్హులవుతారు. ఈ పథకంవల్ల రూ. 40/- కోట్లు సమకూడవచ్చని అంచనా.

ఈ బిల్లుపై చర్చ జరిగే సందర్భంలో పార్లమెంటు ఉభయ సభల్లోనూ కొందరు సభ్యులు బిల్లు రాజ్యాంగరీత్యా చెల్లనేరదని వాదించారు. అటార్నీ జనరల్ అభిప్రాయం కోసం చాలామంది సభ్యులు వత్తిడిచేశారు. వారు కోరినప్రకారం అటార్నీ జనరల్ పార్లమెంటులో హాజరై ఈ బిల్లును ప్రవేశపెట్టే అధికారం పార్లమెంటుకు వుందనీ, రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులకు ఇది వ్యతిరేకంగా ఏమీ లేదని వివరించారు. పొదుపుకు మార్గాల నవలంబించడం మన ఆర్థిక, సాంఘిక ప్రణాళికలలో చాలా ముఖ్యమైన భాగమనీ కాగా ఈ విషయంలో శాసనాలు చేసే అధికారం పార్లమెంటుకు వుందనీ ఆయన వెల్లడించారు. పార్లమెంటు శాసనం చేయకూడనివిగా రాజ్యాంగంలో స్పష్టంగా ఉదహరించబడిన విషయాలు మినహా మరే విషయాలలోనైనా పార్లమెంటు శాసనం చేయవచ్చు. ఎక్కువగా ఆసి. ఆదాయాలుగల వారికి మాత్రమే ఈ పథకం వర్తిస్తుందనీ అంతేగాక పరిమిత కాలంవరకే ఇది అమలు పరచబడుతుందనీ ఆయన తెలిపారు.

ఈ పథకం జనరంజకం కావడం దానిని అమలుపరచే పద్ధతులపైననే చాలావరకు ఆధారపడివుంటుంది. చిన్నమొత్తాల పొదుపు పథకంలో అనేక లోపాలు కనిపించాయి. వాటివల్లనే ఆ పథకాన్ని సమర్థంగానూ, ఉపయోగకరంగానూ అమలు పరచలేకపోవడం జరిగింది. దిగువ స్థాయిలోని ప్రభుత్వ యంత్రాంగం ఎంత సమర్థవంతంగా పనిచేస్తుందో దానిపైననే ఈ పథకం విజయంకావడం ఆధారపడివుంది. ఎన్నో ఉపయోగకరమైన పథకాలు సాధారణంగా పరిపాలనా యంత్రాంగంలోని క్రిందిస్థాయి ఉద్యోగుల సోమరితనంవల్లా, పనులను శక్తివంతంగా నిర్వహించకపోవడంవల్లా విఫలంకావడం చూస్తున్నాం. నిర్బంధ పొదుపు పథకం ఇట్టి దుస్థితికి గురికాకుండా వుండడానికి తగిన చర్యలు తీసుకోబడతాయని ఆశిద్దాం.

## రాజ్యాంగ సవరణలు

పార్లమెంటు ఇటీవల రాజ్యాంగంలో రెండు సవరణలు చేసింది. రాజ్యాంగ బిల్లు (15 వ సవరణ) అనే మొదటి సవరణ, హైకోర్టు న్యాయమూర్తుల ఉద్యోగ విరమణ వయస్సు 62 సంవత్సరాలకు పెంచడాన్నీ, ప్రభుత్వోద్యోగులపై క్రమశిక్షణ చర్య తీసుకోవడానికి సంబంధించిన నిబంధనను సవరించడాన్నీ ఉద్దేశిస్తున్నది. న్యాయమూర్తుల వయస్సుకు సంబంధించిన వివాదాలను భారత ప్రధాన న్యాయమూర్తితో సంప్రదించి రాష్ట్రపతి పరిష్కరించడానికి కూడా ఇది అధికారం సంక్రమింపజేస్తున్నది. 311 వ సూత్రాన్ని సవరించడంద్వారా ఈ బిల్లు ప్రభుత్వోద్యోగులకు వారిపై క్రమశిక్షణ చర్య తీసుకొనబడినప్పుడు ఆ విషయంలో పై వారికి విజ్ఞాపన చేసుకోవడానికి రెండు పర్యాయాలు అవకాశం లభింపజేస్తున్నది.

రాజ్యాంగ (16 వ సవరణ) బిల్లు అనబడే రెండవ బిల్లు, విడివడే ధోరణులను అరికట్టడానికి అవసరమైన అధికారాలను ప్రభుత్వానికి సంక్రమింపజేస్తుంది పార్లమెంటుకుగానీ లేదా రాష్ట్ర శాసనసభలకుగానీ ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థులు దేశ సార్వభౌమాధికారం; దేశ సమగ్రతకు ప్రమాణ స్వీకారం చేయడాన్ని కూడా ఈ బిల్లు ఉద్దేశిస్తున్నది. విడివడే హక్కును రాజ్యాంగం అంగీకరించదు. భారతదేశ ప్రాదేశిక సమగ్రతను ప్రశ్నించడాన్ని ఇది నిషేధిస్తుంది. "విడివడడాన్ని లేదా విభజనను లక్షించే కార్యకలాపాలన్నింటినీ శిక్షార్హం చేసే ఇచ్చితమైన శాసనాలను అమల్లోకి తెచ్చేందుకు" గాను నిబంధనలను మరింత సుస్పష్టం చేయడానికి రాజ్యాంగాన్ని సవరించే నిమిత్తం జాతీయ సమైక్యతా సంఘం సూచించినందున పార్లమెంటు ఈ సవరణను ఆమోదించింది. దేశాన్ని విభజించే ప్రయత్నంతో మద్రాసులోని డి.ఎం.కె. వారు, నాగా విద్రోహులు సాగిస్తున్న కార్యకలాపాలదృష్ట్యా ఆ బిలు అవసరమైంది. ఒక్క డి.ఎం. కె. వారే ఈ బిల్లును వ్యతిరేకించడం గమనార్హం.

విడివడే ఉద్దేశంతో సాగించే ప్రయత్నాలను చట్ట విరుద్ధంగా ప్రకటించడంతో ఇటువంటి ధోరణులు సమసిపోతాయని ఎవ్వరూ అనుకోరు. దేశవ్యాప్తంగా సమైక్యతా భావాన్ని కలిగించడానికి దోహదం చేసే

చర్యల ద్వారానే ఇటువంటి ధోరణులను అరికట్టడం సాధ్యమవుతుంది. ఈ చర్యలను స్పష్టీకరించడం ఇప్పుడు చాలా అవసరం.

విడివడే ధోరణికి సాధారణంగా దారి తీసే కొన్ని ముఖ్యాంశాలు ఇవి:- (1) భాష, (2) మతం, కులం, (3) ప్రాంతం, (4) అంతర్రాష్ట్రీయ నదులు మొదలైన వాటి వల్ల కలిగే ప్రయోజనాలు, (5) ప్రభుత్వోద్యోగాలకు గల అవకాశాలు, (6) కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలు ఇతర సంస్థలు మొదలైన వాటి ఉనికి. వీటిలో ఏ ఒక్క అంశమైనా గానీ లేదా ఇలాంటి మరేవైనా అంశాలు కానీ చిత్తశుద్ధితో వ్యవహరించినట్లయితే అసాధ్యమైన సమస్య లేమీ కావు. ముఖ్యంగా మన దేశానికి బాహ్యంగా ఏర్పడిన ప్రమాదం దృష్ట్యా దేశంలో అనైక్యతా ధోరణులను సహించడానికి వీలు లేదు. రాజ్యాంగానికి ప్రస్తుతం చేసిన ఈ సవరణను శుభారంభంగా పరిగణించాలి. అనైక్యతా ధోరణులను తుదిముట్టించడంలో ఇది ఆరంభం మాత్రమే.

## బొకారో ఉక్కు కర్మాగారం

బొకారోలో 1504 మిలియన్ డాలర్ల ఖర్చుతో నెలకొల్పబడగల ఉక్కు కర్మాగారానికి అమెరికా ఆర్థికసహాయం లభించవచ్చు. ప్రెసిడెంట్ కెన్నెడీ ఇటీవల, కాంగ్రెస్ సభ్యులుకొందరు వ్యతిరేకించినప్పటికీ ఈ ప్రాజెక్టుకు తాము సహాయం చేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు. ఈ ప్రాజెక్టుకు అమెరికా సహాయానికి సంబంధించిన సమస్య ఇటీవల కొన్ని అపోహలకు గురి అయింది. అమెరికా పర్యవేక్షణక్రింద ఉక్కు కర్మాగారం స్థాపన జరిగిన తరువాత దానిని నిర్వహించే నిమిత్తం ప్రైవేటు కంపెనీని కానీ లేదా కార్పొరేషన్ను కానీ నెలకొల్పాలని అమెరికా పట్టుబట్టడం వల్ల ఈ అపోహలకు ఆస్కారం కలిగింది. భారత ప్రభుత్వం ఈ ప్రతిపాదనను ఆమోదించలేదు. ప్రభుత్వ రంగంలోనే దీనిని నెలకొల్పాలని ఇండియా ప్రభుత్వం కోరుతున్నది. ఈ ప్రతిపాదిత కర్మాగారాన్ని ప్రభుత్వరంగంలో నెలకొల్పినప్పటికీ, భారతదేశ సత్వరాభివృద్ధికి ఉక్కు అత్యావశ్యకం కాబట్టి దీనికి సహాయం నిలిపివేయకూడదని ప్రెసిడెంట్ కెన్నెడీ ప్రకటించారు. ఈ సహాయాన్ని మంజూరు చేసే అధికారం అమెరికా కాంగ్రెసుకే వున్నప్పటికీ శ్రీ కెన్నెడీ సహాయం చేయాలని గట్టిగా కోరుతున్నకారణంగా కాంగ్రెసు ఈ సహాయాన్ని నిలిపివేయకపోవచ్చు. ఈసహాయం కేటాయింపును వచ్చే జూలైలో అమెరికా కాంగ్రెసులో ప్రవేశపెట్టబడే విదేశ సహాయ బిల్లులో చేర్చబడవచ్చని భారత దేశంలోని అమెరికా రాయబారి సూచించారు. వడ్డీరేటు పూర్వంకంటే ఇప్పుడు తక్కువ వుండవచ్చని, సొమ్ము తిరిగి చెల్లించేగడువును 20 సంవత్సరాల నుంచి 40 సంవత్సరాలకు పెంచవచ్చని కూడా ఆయన తెలియజేశారు.

బొకారో ఉక్కు కర్మాగారంపై అధ్వర్యం వహించే నిమిత్తం ప్రత్యేకంగా ఒక కంపెనీని నెలకొల్పడానికి భారతదేశం నిశ్చయించడం వల్ల ఇప్పుడు పైన తెలిపిన ఇబ్బంది తొలగిపోయింది. స్వదేశ లేదా విదేశాలకు చెందిన ప్రైవేటు పెట్టుబడి దార్లు ఇందులో పాల్గొనడానికి అవకాశం వుండదు. ప్రభుత్వ రంగంలోని సంస్థల సాధారణ నిర్వహణకంటే దీని నిర్వహణ భిన్నంగా వుంటుంది. ముమ్మందు అనేక వివరాలను తయారు చేయవలసివుంది. ముఖ్యమైన ఈ ప్రాజెక్టుకు అమెరికా సహాయం చేసే విషయంలో ఇప్పుడు అవరోధాలేవీ వుండవనుకోవడం సమంజసంగా కనిపిస్తున్నది.

## ఎవరెస్టు విజయం

ప్రపంచంలోకెల్లా ఉన్నతమైన ఎవరెస్టు శిఖరాగ్రంపైకి మే నెలలో మూడు బృందాల వారు ఎక్కగలిగారు. ఈ మూడు పర్వతారోహక బృందాలూ అమెరికాకు చెందినవే. శ్రీ జేమ్స్ డబ్ల్యు. విట్టకెల్, టెన్సింగ్‌నార్కే బంధువు అయిన షెర్పా న్వాంగ్ గొంబు మే 1 వ తేదీన శిఖరంపైకి చేరుకున్నారు. వారు అచ్చట అరగంటసేపు గడిపారు. కొంతకాలంక్రితం ఉత్తరదిశనుంచి శిఖరం పైకి చేరుకున్నట్లు చెప్పుకున్న చైనా బృందం జాడలేవీ వారికి అచ్చట కనిపించ లేదు. పర్వతారోహణలో తమకు కలిగిన ఇబ్బందులన్నింటినీ తట్టుకుంటూ తమ ప్రయత్నాలు కొనసాగించి వీరు కడకు విజయం సాధించారు. ఈ బృందం సభ్యుడు ఒకరు పెద్ద మంచుగడ్డ ఒకటి కప్పివేయడంవల్ల మరణించారు. కొందరు సభ్యులు మంచు కొరకడంవల్ల, ఇతర కారణాలవల్ల జబ్బుపడ్డారు. అయినప్పటికీ వారి ధైర్యం సడలలేదు. విజయకాంక్షతో ముందుకు సాగిపోయారు.

మే 22 వ తేదీన మళ్ళీ రెండు అమెరికా బృందాలు విడివిడిగా రెండువైపులనుంచి ఎవరెస్టు శిఖరాగ్రంపైకి చేరుకోవాలనే కోర్కెతో పర్వతారోహణ చేసాయి. ఈ బృందం సాధించిన విజయం ప్రత్యేకత ఏమంటే శ్రీయుతులు విలియం ఎఫ్. అన్సూల్డ్, థామస్ ఎఫ్. హర్నబీన్లు ఇప్పటి వరకు ఎవ్వరూ పర్వతారోహణ చేయనట్టి పశ్చిమ పర్వతశ్రేణిగుండా శిఖరాగ్రం చేరుకున్నారు. ఈ మార్గం పర్వతారోహణకు అనువైనది కాదనే అభిప్రాయం ఇంతకాలంగా వుంది. మరో బృందంలోనివారైన శ్రీయుతులు హర్రే సి. బిషప్, లూథర్ జి. జెర్‌స్టడ్‌లు దక్షిణంగా సంప్రదాయిక

మైన మార్గంగుండా శిఖరంపైకి చేరుకున్నారు.

1953 వ సంవత్సరంలో సర్ జాన్ హంట్ నాయకత్వాన బయలుదేరిన పర్వతారోహక బృందం ప్రపథమంగా ఎవరెస్టు శిఖరాగ్రంపైకి చేరుకొనగలిగింది. మరో స్విస్ బృందంకూడా విజయం సాధించింది. క్రిందటి సంవత్సరం ఎవరెస్టు విజయానికి ఉపక్రమించిన భారత పర్వతారోహక బృందం ప్రతికూల వాతావరణ పరిస్థితుల్లో చివరిఘట్టంలో తమ ప్రయత్నం విరమించుకోవలసివచ్చింది.

### పదిలక్షల రూపాయల ఉత్సవం

తెలుగు సినీతారల ఉత్సవం మేనెలలో జరిగిన ఒక ముఖ్య సంఘటన. ఈ ఉత్సవ కార్యక్రమాలు విజయవాడ, హైద్రాబాదు, కర్నూలులో వరసగా మూడు రోజులపాటు జరిగాయి. రొక్క రూపంలోనూ జాతీయ రక్షణ సర్టిఫికెట్ల అమ్మకం వల్లనూ మొత్తం 10 లక్షల రూపాయలు. ఈ ఉత్సవకార్యక్రమాలద్వారా జాతీయ రక్షణ నిధికి సమకూరాయి. 25 మంది సుప్రసిద్ధ సినీ కళాకారులు చక్కగా రూపొందించిన ఉత్సవ కార్య క్రమంలో పాల్గొన్నారు. ఈ మూడు ప్రదేశాలలోనూ అశేష ప్రజానీకం కార్యక్రమాలను తిలకించి ఆనందించారు. రాష్ట్ర ప్రజారక్షణ సంఘం అధ్వర్యంలోనేగాక బహుశా భారత దేశంలోనే మరెచ్చటాకూడా జాతీయ రక్షణనిధి సహాయార్థం ఇంతటి అద్భుతమైన కార్యక్రమం జరిగివుండదు. ఇందుకు తెలుగు సినీ కళాకారులు, చలనచిత్ర పరిశ్రమవారు ప్రశంసార్హులు. ఈ ఉత్సవ కార్యక్రమంవల్ల వీరు తమ సాధారణ కార్య క్రమాలను చెప్పుకోదగినంత కాలంవరకు నిలిపివేయ వలసివచ్చింది. వ్యక్తిగతంగా కూడా వారు త్యాగాలు చేశారు. ఉత్సవం విజయవంతం కావడానికి రక్షణసంఘం అనధికార సభ్యులు, వివిధ ప్రభుత్వశాఖల సమన్విత కృషి ఎంతో తోడ్పడింది.

రక్షణనిధికి డబ్బు సేకరించడానికి తోడ్పడంతోపాటు దేశరక్షణ సందేశంతో కూడిన అంశాలనే చాలావరకు ప్రదర్శించారు కాబట్టి ఈ ఉత్సవానికి ఒక ప్రత్యేకత వుంది.

### సైనిక సహాయం

భారత సరిహద్దులలో చైనా వచ్చి దురాక్రమణ జరిపిన తొలిరోజులలో బ్రిటన్ ఆయుధాలను ఇతర సాధన సామాగ్రిని అరువు పద్ధతిమీద శీఘ్రంగా మనకు అందజేసింది. ఏకపక్షనిర్ణయంగా చైనా యుద్ధ విరమణను ప్రకటించిన తరువాత కూడా బ్రిటన్ ఈ విషయంలో శ్రద్ధ చూపింది. దీర్ఘకాలిక ప్రాతిపదికపై ఆయుధసాహాయం చేసే విషయంలో చర్చలుజరిపే నిమిత్తం ఈ రెండు దేశాలకుచెందిన వివిధ ప్రతినిధి వర్గాలు పర్యటనలు జరిపాయి.

భారత నౌకాదళం నిమిత్తం జలాంతర్గాములను ఉత్పత్తి చేయడంలో బ్రిటన్ ఇండియాతో సహకరించే అవకాశంవుంది.

దురాక్రమణను ఎదుర్కోడంలో భారత దేశానికి సహాయపడడానికి ఇతర కామన్వెల్తు దేశాలుకూడా ముందుకు వచ్చాయి. ఆస్ట్రేలియా మనకు బ్లాంకెట్లను, ఇతర సైనిక సాధన సామాగ్రిని భారీ ఎత్తున పంపించింది. కెనడా రెండు కారిబౌ రవాణా విమానాలు పంపింది. పర్వతప్రాంతాలలో సరుకులు రవాణా చేయడానికి అనువైన ఈ విమానాల మరికొన్నింటిని భారతదేశం కొనవచ్చు. ఇలాంటి విమానాలను [illegible] శిక్షణయివ్వడానికి కెనడా సంసిద్ధత తెలిపింది. కాన్పూర్‌లోని విమానాల ఫ్యాక్టరీలో ఇటువంటి విమానాలను తయారు చేయడానికికూడా భారతదేశం యోచిస్తున్నది.

సరిహద్దులలోని సాయుధదళాలకు సరఫరాలను అందజేసే నిమిత్తం అమెరికా పెక్కు రవాణా విమానాలను, ఆ విమానాలు నడిపే సిబ్బందిని పంపించింది.

భారత దేశంలో మిగ్ విమానాలను తయారు చేయడానికై ఇక్కడ ఒక ఫ్యాక్టరీ నెలకొల్పేందుకు మన ప్రభుత్వం రష్యా ప్రభుత్వంతో ఒడంబడిక కుదుర్చుకుంది. ఇది పూర్తికావడానికి మూడు సంవత్సరాలు లేదా అంతకంటే ఎక్కువ కాలం పట్టవచ్చు.

భారత విమాన దళాన్ని పటిష్ఠం చేసే విషయంలో భారత ప్రభుత్వంతో చర్చలు జరిపే నిమిత్తం కొంతకాలం క్రితం అమెరికా — కామన్వెల్తు విమానదళ సంయుక్త ప్రతినిధివర్గం భారత దేశానికి వచ్చింది.

మన దేశానికి దీర్ఘకాలిక ప్రాతిపదికపై సైనిక సహాయం చేసే విషయంలో సాంకేతిక వివరాలను గూర్చి చర్చించే నిమిత్తం శ్రీ భూతలింగం నాయకత్వంలో ఒక ప్రతినిధి వర్గాన్ని పశ్చిమ దేశాలకు పంపించారు. వచ్చే మూడు సంవత్సరాలలోగా అమలు పరిచేందుకై రక్షణ కార్యక్రమాన్నొక దానిని ఈ ప్రతినిధివర్గం అందజేసింది. ఈ కార్యక్రమంక్రింద ఆరు ఆయుధోత్పత్తి కర్మాగారాలను నెలకొల్పడానికీ, కొన్ని సూపర్‌సానిక్ జెట్ విమానాలను, రాడార్ కంట్రోల్ సాధన సామగ్రిని కొనడానికి ఉద్దేశించబడింది.

పశ్చిమరాజ్యాలు ఆయుధసహాయం చేసే విషయంలో ఆదేశాల అధికార్లకు కొన్నిభయ సందేహాలు వున్నట్లు కనిపిస్తున్నది. పశ్చిమ రాజ్యాలుచేసే ఈ సహాయాన్ని పాకిస్తాన్‌పై దాడి జరపడానికి ఉపయోగించబోమని

భారతప్రభుత్వం స్పష్టీకరించింది. ఇలాంటి భయసందేహాలను నివృత్తిచేయడం కూడా బహుశా శ్రీ టి. టి. కృష్ణమాచారి పర్యటనోద్దేశాలలో ఒకటైవుంటుంది. పాకిస్తాన్‌తో నిర్యుద్ధ ఒడంబడిక కుదుర్చుకోవడానికికూడా భారతదేశం సిద్ధపడింది. కాని పాకిస్తానే దీనిని ఆరవదఫా చర్చలలో నిరాకరించింది. కాబట్టి ప్రమాదం అన్నది పాకిస్తాన్‌నుంచి ఇండియాకు వున్నదేకాని ఇండియానుంచి మాత్రం పాకిస్తాన్‌కులేదు.

అమెరికా స్టేట్ సెక్రటరీ శ్రీ డీన్ రస్క్, బ్రిటిష్ కామన్వెల్తు సంబంధాల కార్యదర్శి శ్రీ డంకన్ శాండీస్‌లు మన ప్రధానమంత్రికి, పశ్చిమ రాజ్యాల ఆయుధ సహాయం కాశ్మీర్ సమస్య పరిష్కారంతో ముడిపడిలేదని తెలియజేయడం ఆశాజనకంగావుంది.

భారతదేశానికి తగు పరిమాణంలో ఆయుధసహాయం లభింపజేయడం ద్వారా నిజానికి తాము ఈ ఉపఖండంలో సమిష్టి రక్షణను పటిష్ఠంచేస్తున్నామనే అభిప్రాయం పశ్చిమరాజ్యాలకు వుండాలి. వారా అభిప్రాయం కలిగివుండవచ్చు కూడా. చైనా పాలకుల వాస్తవిక ఉద్దేశాల విషయంలో ఎవరికి కూడా ఎట్టి భ్రాంతిలేదు.

చైనాతూ దాని చుట్టూరావున్న ఇతర దేశాలకూ మధ్యవున్న సరిహద్దులను నిజానికి దానిసత్వానికీ, స్వేచ్ఛాయుత జీవనానికీ మధ్యగల ఎల్లలుగా పరిగణించాలి. కాబట్టి చైనా జరపగల దురాక్రమణలను ఎదుర్కొడానికి చేసే రక్షణకృషి అంతా అన్నివిధాలా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల రక్షణకై చేసే ప్రయత్నమే అవుతుంది. ఈ ప్రయత్నంలో సిద్ధాంతరీత్యా సంఘటితం కావలసిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల నభిలషించే దేశాలన్నీ ఒకే విధమైన అపాయాన్ని ఎదుర్కొవలసివుంది.

## అమెరికాలో జాతి విచక్షణ

అమెరికాలోని అలబమా రాష్ట్రానికి చెందిన నీగ్రోలు జాతివిచక్షణా విధానానికి వ్యతిరేకంగా ప్రారంభించిన సత్యాగ్రహం ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. డాక్టర్ మార్టిన్ లూథర్‌కింగ్ నాయకత్వాన సత్యాగ్రహంసాగిస్తున్న ఈనీగ్రోలు, పాఠశాలలు, దుకాణాలు, బస్సులు మొదలైనవాటిలో నీగ్రోల ప్రవేశంపట్ల విధించిన నిషేధాలను తొలగించాలనీ, ఈ ఉద్యమం సందర్భంగా నిర్బంధంలోకి తీసుకున్న వారందరినీ విడుదలచెయ్యాలనీ కోరుతున్నారు. జాతివిచక్షణా విధానానికి సంబంధించిన సమస్యనంతటినీ చర్చించేందుకై అధికార అనధికార ప్రతినిధులతో, ద్విజాతి సంఘాన్ని నియమించాలనికూడా వీరు కోరుతున్నారు.

వీరు శాంతియుతంగా జరుపుతున్న ప్రదర్శనల చెదరగొట్టేందుకు బర్మింగ్‌హామ్ పోలీసులు, నీటిని చిమ్మే సాధనాలను, పోలీసు కుక్కలను ఉపయోగించారు. వేలమంది నీగ్రోలను నిర్బంధించారు. కొన్ని అంశాల విషయంలో శాంతి ఒప్పందం కుదిరిందికాని కొందరు శ్వేత జాతీయులు నీగ్రో నాయకుల ఇండ్లమీద దుకాణాలమీద బాంబులు వేయడంవంటి దౌర్జన్యచర్యలకు దిగడంవల్ల ఆ ఒప్పందం భగ్నమైంది.

ప్రెసిడెంట్ కెన్నెడీ ఈ పరిస్థితుల పట్ల తీవ్రవైఖరి ప్రదర్శించి శాంతి పరిస్థితులను నెలకొల్పేందుకు ఫెడరల్‌దళాలనుపంపారు. జాతి విచక్షణచూపే శ్వేతజాతివారిలో మార్పు తేవడానికి అవసరమైన చర్యలన్నీ గైకొనబడతాయనికూడా ఆయన ప్రకటించారు.

దక్షిణాఫ్రికా, ఉత్తర అమెరికాలలో, ఇట్టి దుస్సంఘటనలు పదేపదే సంభవిస్తుండటం శోచనీయం. అలబమా సంఘటన వల్ల రాజ్యాంగ సంబంధమైన ఒక జటిల సమస్య, అంటే ఫెడరల్ ప్రభుత్వానికీ, రాష్ట్ర ప్రభుత్వాలకూ మధ్య వివాదం తలెత్తే ప్రమాదం కూడా వుంది. కడకు పర్యవసానం ఎలావున్నప్పటికీ కొంతకాలం వరకు అమెరికాను దక్షిణాఫ్రికాతో పోల్చి చెప్పడం జరుగుతుంటుంది. నిజానికి ఇది దురదృష్టకరం. వీటన్నింటినీ మించిన విషయమేమంటే ప్రపంచశాంతి ప్రయోజనాల దృష్ట్యా ప్రెసిడెంట్ కెన్నెడీ వ్యక్తిగత గౌరవప్రతిష్ఠలు సుస్థిరంగా వుండవలసిన ఈ సమయంలో వాటికి భంగం వాటిల్లే ప్రమాదం ఏర్పడింది.



# ఆదిమవాసుల చిత్రకళ

క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

సాధారణంగా క్రీ. పూ. యిరవై వేల సంవత్సరాలనుంచి, క్రీస్తు శకారంభం వరకూగల మధ్యకాలం నాటి చిత్రకళ ఆదిమ చిత్రకళగా పేర్కొనబడుతున్నది. ఇప్పటికీ కొన్ని దేశాల్లోని కొన్ని కొన్ని జాతుల వారు ఈ చిత్రకళనే అంటిపెట్టుకొని వున్నా వీరి దానిలో పూర్వపు జీవం కనిపించడం లేదు.

ఆదిమవాసులు ఈ అతిప్రాచీన చిత్రకళకు కర్తలు. కొందరికి ఆదిమవాసులనగా అనాగరికులనే అభిప్రాయమున్నది. కొందరి ఆదిమవాసుల నాగరికతను ఈ నాటి నాగరికతతో సరిపోల్చితే మత విషయాల్లోగాని, నైతిక సాంఘిక విషయాల్లోగాని, శాస్త్ర విషయాల్లోగాని, శిల్పాది సాంకేతిక విద్యల్లో గాని, వారు అనాగరికులుగా యేమాత్రమూ కనపడడం లేదు. ఈ విధంగా 'ఆదిమవాసు' లనే పదం అపార్థం చేసుకోబడినట్లే 'ఆదిమ చిత్రకళ' యనే పదం కూడా చాలావరకు అపార్థం చేసుకోబడింది.

'ఆది' అనే పదాన్ని యే పదార్థపరంగానైనా, ప్రాథమిక దశను తెల్పడానికే వాడుతారు కాబట్టి ఆ పదార్థం ఆ ప్రాథమిక దశలో సర్వసామాన్యంగా మోటుగాను, అసంపూర్ణంగాను వుంటుంది. కాగా పలువురు ఆదిప్రాచీన చిత్రకళ మోటుగా వుంటుందనీ, ఆదిమవాసులకు శిల్పాది సాంకేతిక విద్యలు తెలియక పోవడమే యిందుకు కారణమనీ అభిప్రాయ పడుతున్నారు. కాని యిందులో యేమాత్రమూ నిజం లేదు. ఆనాటి చిత్రకారులు వృక్ష జంతు జాతులనుండి గైకొని వుపయోగించిన వర్ణాలు, చిత్రించడానికి వాడినరాయి, దంతం, ఎముక, కర్ర, మట్టి, లోహాది వస్తుసముదాయాలు, ఆనాటి చిత్రకారులకు శిల్పాది విద్యలందున్న నైపుణ్యాన్ని చెప్పకే చెప్పుతున్నాయి.

ఆదిమ చిత్రకళగా పిలవబడుతున్న ఈ చిత్రకళ పెక్కు భంగులుగాను, వివిధ రీతులుగాను వున్నది. ఆదిమవాసులు వివిధ దేశాలలో వేరువేరు శీతోష్ణ, సాంఘిక పరిస్థితులలో జీవిస్తూ, భిన్నమానసిక స్థితులు కలవారవడంచేత వారి చిత్రకళ కూడా వివిధ రీతుల్లో వుండడం సహజమే. కానీ కొన్ని భేదాలున్నప్పటికీ ఆ చిత్రకళలోని ముఖ్యాంశాలన్నీ ఒకదానినొకటి పోలి వుండడం చేత, ఈ చిత్రకళలన్నీ 'ఆదిమ చిత్రకళ' అన్న యేకనామంతోనే పేర్కొనబడుతున్నవి.

ఆదిమవాసులు తమ వేషభాషల్లోగావి, తాము చిత్రించే చిత్రాల్లోగావి అనవసరమైన వివరముల జోలికి పోలేదు. వారు శరీర శుభ్రతకు అవసరమైన వస్త్రాలను మాత్రమే ధరించేవారు. ఆ విధంగానే వారు చిత్రించేప్పుడు సైతం, ఆ వస్తువుయొక్క ప్రతి భాగాన్ని చిత్రించే వారు కాదు. ఇదే ఆది ప్రాచీన చిత్రకళలోని ముఖ్యాంశం. అందుచేతనే వారు పక్షిరాజైన గ్రద్దను చిత్రించేప్పుడు వాడిగావుండే దాని ముక్కును, భయంకరమైన దాని కాలిగోళ్ళను మాత్రం చిత్రించే వారు.

కాని కొన్ని కొన్ని ఆదిమ చిత్రకళలు పైన చెప్పబడిన దానికి పూర్తిగా భిన్నాంశాలు కలిగివున్నాయి. అటువంటి చిత్రాలను చిత్రకారులు చిత్రించేప్పుడు పక్షినిగావి, జంతువునుగాని (వారెక్కువగా పశుపక్ష్యాదులనే చిత్రించే వారు) శస్త్రపరీక్ష చేసి చూచినట్లు వాటి శరీరంలోవున్న ఎముకలు, కండరాలు మొదలైన వివిధ భాగాలను శాస్త్రజ్ఞుడు చిత్రించినట్లు చిత్రించే వారు.

సాంకేతిక చిత్రీకరణ అన్నది ఆదిమ చిత్రకళకున్న మరొక లక్షణం.

ఆ రోజులలో చిత్రలేఖనానికి అంత విశిష్టస్థానం లభించడానికి కారణం కేవలం ఆనాటి వారికి దానిమీదున్న మమత మాత్రమే కాదు. చిత్రలేఖనం సంఘానికి కావాడు అనేక విధాల సహాయకారిగా నుండేది. ఆదిమవాసులకు ప్రప్రథమంగా లిపి తెలియక పోవడం చేత వారు తమ భావాలను వ్యక్త పరచడానికి గాని, తమ చరిత్రను ఉల్లేఖించడానికి గాని చిత్రలేఖనాన్నే అవలంబించే వారు. ఈ పద్ధతి యెక్కువగా ఈజిప్టు చైనాలలో వాడుకలో వుండేది. ఎస్కిమో వనితలు, బాలికలు కథలను నేలమీద బొమికతో చిత్రాల రూపంగా చిత్రించేవారు.

అనేక వేల సంవత్సరాల నుంచి చిత్ర కళలో ప్రముఖస్థానం ఆక్రమించుకొన గలిగింది మతం—హిందూ మతం క్రీ. పూ. మూడువేల సంవత్సరాల కాలం నాటికే చిత్రకళలో ఒక విశిష్టస్థానాన్నాక్రమించు కొన్నది. బౌద్ధ మతం క్రీ. పూ. మూడవ శతాబ్దంనుంచి, క్రీ. శ. పద్దెన్మిదవ శతాబ్ద ప్రారంభం వరకూ పలుదేశాల చిత్రకళల్లో ఒక విశిష్టస్థాన మేర్పరుచుకొన్నది. క్రైస్తవ మతం కూడా చిత్రలేఖనంలో రెండువేల సంవత్సరాల కాలం అలరారింది. బాబిలోను, అసిరియా, ఈజిప్టు, గ్రీసు, మెక్సికో, మధ్య అమెరికా, కొలంబియా మొదలైన దేశాల చిత్రకళల్లో సైతం మతం చోటు చేసుకొన్నది. ఈ విధంగా ఆదిమ చిత్ర కళలో మతానికి ఒక ప్రధానపాత్ర కలదు. కాని ఆనాటి ఆదిమవాసుల మతానికీ, ఈనాటి మతానికీ కొన్ని భేదాలున్నాయి. ఆనాటి వారి మతం మంత్రతంత్రాలతోను, యింద్ర జాలాలతోను కూడుకొని వుండేది. వారు పూజ, బలి, నృత్యం, అనుకరణ, కేకలతో మిశితమైన గీతాలు మొదలైన అట్టహాసాలతో ఆ దేవతలను పూజించే వారు. ఇటువంటి అట్టహాసాలకు చిత్రకళ యెంతో తోడ్పడేది. ఇటువంటి పూజల్లో పాల్గొనేవారందరూ తమ ముఖాలకు కృత్రిమ ముఖాలు తగిలించు కొని, దేవతల ప్రతిమలకు పూజలు చేసే వారు. వీటన్నిటికీ చిత్రలేఖనం, శిల్పం చాలా అవసరం కదా! రైతులైన హోపి యిండియనులు సకాలంలో వర్షాలు కురవ డానికై పెద్ద ఉత్సవాలు చేసి వరుణదేవుని పూజించే వారు. ఆ వరుణదేవుని మానవా కారంలోనే చెక్కి, అతని ముఖం మీద మాత్రం చెక్కిళ్ళపై స్పష్టంగా కనబడేటట్లు మూడు అర్ధచంద్రాకార గీతలు (మేఘాలు), పాములవలె పైకి పోతున్నట్లున్న రెండు రేఖలు (మెరుపులు), చిన్న చిన్న నిలువు గీతలు (వర్షం) చిత్రించే వారు. బోర్నియోలోని 'బోలి ఆతప్' అనే ఆదివాసులు తమ కెటువంటి వ్యాధులూ రాకుండా ఒక దైవాన్ని మానవాకార రూపంలో కల్పించి పూజించే వారు. ఆఫ్రికాలోని నీగ్రో స్త్రీలు తమకు సంతానం కలగడానికై పిల్లల ప్రతిమలను చేసి నడుముకు కట్టుకొనే వారట.

ఈ ఆదిమవాసులు కేవలం దేవతల దయ్యాల పూజలేకాక, మూలపురుషులను, తమ పూర్వీకులను కూడా పూజించే వారు. ఈ పూర్వీకుల ప్రతిమలను పెద్దపెద్ద పండుగ ఉత్సవ సందర్భాలలో పూజించేవారు. కొన్ని తెగల నాయకులు తాము కూర్చొనే ఆసనముల వెనుకభాగాల్లో తమ పూర్వీకుల విగ్రహాలను చెక్కించుకొనే వారు. ఈ పూర్వీకుల పూజ ఖండఖండాంతరాలకూ వ్యాపించినప్పటికీ, పశ్చిమ ఆఫ్రికా, న్యూగినీ, మెలనిసియా, పశ్చిమోత్తర అమెరికాల లోను యెక్కువగా వుండేది. ఆనాటి శిల్పులు ఈ ప్రతిమలను యెంతో చాకచక్యంతో చెక్కి వున్నారు. కొన్ని ప్రతిమలు ఆ పూర్వీకుల రూపాలనే పోలివుండేవట.

అమెరికా ఆదిమవాసులు తమ కుల గోత్రాలను తెలుపడానికై తమ శరీరాల మీద పలువర్ణాలతో మృగాల సాంకేతిక చిత్రాలను చిత్రించుకొనే వారు. ఆదిమవాసులు జంతువుల నెన్నడూ తమకన్న హీనమైనవానిగా భావించలేదు. పైగా వాటి వేగాన్ని, బలాన్ని, యుక్తిని యెంతో మెచ్చుకొని వాటిని అనుకరించడానికి ప్రయత్నించే వారు. తత్ఫలితంగా వెలసినవే వారి శరీరాల మీదగల వివిధ జంతువుల చిత్రాలు.

ఆ కాలంలో కూడా చిత్రాల నిచ్చిపుచ్చుకొనే వ్యాపారముండేది. కొందరు చిత్రకారులు జీవితావసరాలైన వస్తువుల కొనుగోలుకై తమ చిత్రాలను యిచ్చివేసే వారు. ఆనాటి స్త్రీలు తమ పాత్ర వస్తు సముదాయాల మీద కూడా చిత్రించేవారట. ఈ విధంగా ఆదిమ చిత్రకళ కేవలం అందమైన వస్తువుల చిత్రీకరణకు గాక, వుపయోగకరమైన వస్తువుల చిత్రీకరణకు వుపయోగపరచ బడింది. ఇందుకు కారణం ఆనాటి వారు సాధారణంగా కొన్ని సంవత్సరాల పాటు ఒకేచోట స్థిరంగా వుండకపోవడమే. అందు వల్ల వారెప్పుడూ తమకు వుపయోగపడే సామాన్లను, సులభంగా మోసికొనిపోగల సామాన్లను మాత్రమే వుంచుకొనవలసి వచ్చేది.

కాని అంతమాత్రంచేత ఆదిమవాసులు కేవలం చిత్రకళను తమ అవసరాలు తీర్చు కొనడానికే వాడారని భావించడం సమంజసం కాదు. ఆఫ్రికా నీగ్రోలలోని ఒక తెగవారు కేవలం చిత్ర కళకోసరమే చిత్రాలను చిత్రించేవారు. వారు చిత్రించిన వస్తువులు వారికి మరియేవిధంగానూ వుపయోగపడేవి కావు. పండుగ రోజుల్లో ఆ చిత్రకారులు తమ చిత్రాలన్నిటినీ బైటికితీసి దుమ్ము దులిపి వాటినిచూస్తూ కూర్చుని ఆనందించే వారట.

ఆదిమ చిత్రకళ ఆదిమవాసులకేకాక మనకు కూడా ఒక విధంగా వుపయోగపడు తున్నది. ఉత్తర ఆఫ్రికాలోని అట్లాసు ప్రాంతాలలో నివసించిన ఆదిమవాసులు తమ చిత్రాల్లో ఏనుగులు, యెనుములు, జిరాఫీలు, ఖడ్గమృగాలు, నిప్పుకోళ్ళు మొదలయిన వేడి ప్రదేశాలలో నివసించే జంతు పక్ష్యాదులను చిత్రీకరించి వున్నారు. ఆ జంతువులిప్పుడు అట్లాసు పర్వతప్రాంతా లలో యెక్కడా లేవు. కానీ చిత్రాల వల్ల మనం ఆ నాడా ప్రాంతం అంతచల్లగా వుండి

పుంటదని గ్రహించగలుగుతున్నాము.

ఆదివాసుల్లో స్త్రీ పురుషుల కందరికీ చిత్రకళలో ప్రవేశ ముండేది. కాని ఆ నాడు చిత్రలేఖనానికి అవసరమైన వస్తువులు ఈ రోజుల్లోలాగా సులభంగా దొరకేవికావు. వాటిసేకరణ ఆ నాడు యెంతో ప్రయాసతో కూడినపని.

ఈ ఆదిమచిత్రకళ అన్ని ఖండాలలోనూ ఆలరారుతూవుండేది. ఐరోపాలో మొట్టమొదటమట్టిగోడలమీద చేతివ్రేళ్ళతోచిత్రించేవారు. ఆఫ్రికాలోనిఆదివాసులు గుహలగోడలమీదా, నేలమీదా జంతువుల, మానవుల రూపాలను మలచారు. వారెక్కువగా వర్ణాలను వాడలేదు. కాని దక్షిణాఫ్రికాలోని ఆదివాసులు ( బుష్‌మెన్ ) వర్ణాలను విరివిగా వాడారు. వారు ఆకులలములనుంచి, కొన్ని కొన్నిచోట్ల ఖనిజాలనుంచిసైతం వర్ణాలను తయారుచేసి జంతువుల క్రొవ్వుతో కలిపి వాడేవారు. బాగా అరగదీయబడి సన్నని కొన గలిగిన యెముక ముక్కలను కుంచెలుగా వాడేవారు. పశ్చిమ ఆఫ్రికాలోని నీగ్రోలు ఎక్కువగా కంచు, దంతపు విగ్రహాలనే చేసేవారు.

ఆసియా ఆదివాసులు అనేక తెగలకు, జాతులకు చెందినవారవడంచేత, భిన్న భిన్న శీతోష్ణ పరిస్థితులలో జీవించడంచేత, వారి వారి చిత్రకళల్లో కొన్ని భేదాలున్నాయి. భారతీయ ఆదివాసులు చిత్రకళలో నేమి శిల్పసాంకేతిక విద్యల్లోనేమి అతినేర్పరులు. మొహంజోదారో, హరప్పా చిత్రాలు వారి చిత్రకళకు చక్కటి నిదర్శనాలు. ఈ మొహంజోదారో, హరప్పా వాసులు మట్టి రాగి, ఱాయి, స్టియాటైట్ (Soap stone) లతో ప్రతిమలు చేసేవారు. మనదేశంలో ఈ ఆదిమ చిత్రకళ యిప్పటికీ పూర్తిగా నశించిపోలేదు. నీలగిరి కొండల్లో నివసించుతున్నతోడాలు, అస్సాం కొండల్లో నివసించుతున్న నాగాలు ఈచిత్రకళనే అవలంబించుతున్నారు. కొద్ది మార్పులతో ఈ ఆదిమ చిత్రకళ గంజాం జిల్లాలోకూడా వాడుకలో ఉండేది. ఇచ్చట చేయబడిన బొమ్మలు కొన్ని దక్షిణ కెన్సింగ్‌టన్ వస్తుప్రదర్శనశాలలో వుంచబడి, పాశ్చాత్యుల అనేకుల దృష్టిని ఆకర్షించుతున్నవి. మన దేశ ఆదివాసులు రాగి విగ్రహాలు చేయడంలోనూ బహూనేర్పరులు. వారు ముందు మట్టి ప్రతిమను చేసి ఆ ప్రతిమను మైనంతో కప్పి, దానికిపైనా, క్రిందా రెండు ప్రక్కల్లోను రెండు సన్నటి లోహపు గొట్టాలనుఅతికించి, మళ్ళీ ప్రతిమనంతటినీ మృదువైన మట్టితో కప్పివేసేవారు. ఆ మట్టి గట్టిపడినపిమ్మట పైగొట్టంనుంచి కరగబెట్టబడిన లోహాన్ని పోసేవారు. ఆ లోహం మట్టి అచ్చులకు మధ్య మైనంతో నిండిన భాగంలో ప్రవేశించి మైనాన్ని కరిగించివేసి దానిచోటు తా నాక్రమించుకొంటుంది. కరిగిపోయిన మైనం క్రింది గొట్టంద్వారా బైటకి వచ్చివేస్తుంది. ఆ లోహం చల్లారిన పిదప పైనా, లోపలా వున్న మట్టి అచ్చులను జాగ్రత్తగా తీసివేసేవారు. ఈ విధంగా ఆ నాడు రాగి విగ్రహాలు రూపొందేవి. కాని ఆ విధంగా తయారైన విగ్రహాలు కొంచెం కరుగ్గా వుంటాయి కాబట్టి వాటిని మళ్ళీ ఉలి, ఆకురాళ్ళతో సరిదిద్దేవారు. ఈ పద్ధతినే యితర లోహ విగ్రహాలుకూడా తయారుచేయబడుతుండేవి. కొందరు ఈ పద్ధతి మన భారతదేశంనుంచి ఈజిప్టుకి వ్యాపించిందని అభిప్రాయపడుతున్నారు. ఈ ఆదివాసులు లోహ విగ్రహాలతోపాటు దంతం, మ్రానుప్రతిమలనుకూడా అతి నేర్పుతో చేస్తూవుండేవారు. చైనా ఆదివాసుల మృణ్మయ, కంచుపాత్రలమీది చిత్రకళ ఈ నాటి చిత్రకారులను సంభ్రమాశ్చర్యచకితులను చేస్తున్నది. ఇండోనేషియాలో యిప్పటికీ అక్కడక్కడా ఈ చిత్రకళ ఛాయలు కనబడుతూనే వున్నాయి. ఆ కాలంలో సుమిత్రా, బోర్నియో, ఫిలిప్పెయిన్ మొదలుగాగల ద్వీపాల్లోకూడా ఈ చిత్రకళ ప్రసిద్ధిలోవుండేది. సుమిత్రాలో యిత్తడి విగ్రహాలను, మనదేశంలో రాగి ప్రతిమలను చేసే విధంగానే చేసేవారు.

చరిత్రకారులు ఆస్ట్రేలియాలోని ఆదివాసులు దక్షిణభారత దేశంనుంచి వలస వచ్చినవారై వుంటారని అభిప్రాయ పడుతున్నారు. సారవంతమైన ప్రదేశాలను అన్వేషిస్తూ ఒక చోటనుంచి మరొకచోటికి యెల్లప్పుడూ పయనిస్తూండడంచేత వారికి మృణ్మయ పాత్రలుగాని, ఱాతి లోహాది విగ్రహాలుగాని చేయడానికి అవకాశం కలుగలేదు. వారెక్కువగాగుహగోడలమీదనో, నేలమీదనో, చెట్టుపట్టల(Bark) మీదనోచిత్రించేవారు. ఉత్తర ఆస్ట్రేలియా ఆదివాసులు పశుపక్ష్యాదులను చిత్రించేప్పుడు వాటిని కోసి శస్త్రపరీక్ష చేసినట్లు ప్రతి ఎముకా కండర సహితంగా చిత్రించేవారు. మధ్య ఆస్ట్రేలియా ఆదివాసులు బహూసాంకేతికంగా చిత్రములు చిత్రించేవారు. ఉత్తర కింబర్లీలోని ఆదివాసులు ఒక రకమైన ప్రతిమలు చేసేవారు. ఈ ప్రతిమలకు, కన్నులు, ముక్కు తెలుపడానికి నల్లని మచ్చలు చిత్రించేవారు. ఆ ప్రతిమలకు నోరు చిత్రించితే కుంభవర్షం వచ్చి సర్వప్రజానాశనకారి కాగలదని వారు దృఢంగా విశ్వసించేవారు. అందువల్ల నోటిని చిత్రీకరించేవారు కారు.

అమెరికా ఆదివాసులు ఆసియాఖండం నుంచి పూర్వంకొన్ని సంవత్సరాల పర్యంతం గుంపులు గుంపులుగా వలసవచ్చిన వారేనట. ఇందుచేతనే కాబోలు ఆసియా ఆదిమచిత్రకళకూ, అమెరికా ఆదిమ చిత్రకళకూ

పోలికలు కనపడుతున్నాయి. ఇక్కడ ముఖాలకు తగిలించుకొనే కృత్రిమ ముఖాలు విరివిగా చేయబడుతూ వుండేవి. ఇవి దేవదారు చెక్కపై నలుపు, తెలుపు, ఎఱుపు, నీలం, లేత ఆకుపచ్చ మొదలయిన వర్ణాలతో చిత్రింపబడేవి. వారు ఎనుంచర్మంమీదా, దళంమీదా, కాతిమీదా, మృణ్మయ పాత్రల మీదా, గుహలమీదా చిత్రించేవారు. వారు మన దేశీయులవలే పూసలతో సాంకేతిక చిత్రాలు చిత్రించడంలోనూ, ధూళి చిత్రములు (ముగ్గులు) చిత్రించడంలోనూ, బహు నేర్పరులు. ఈ ధూళి చిత్రములను వీరు ఇసుకలో ఉత్సవ సందర్భాలలో చిత్రించి మరల సాయంకాలంలోగా తుడిచివేసేవారు. వీరి రాక్షస చిత్రీకరణ కూడా మన దేశీయుల చిత్రాలనుపోలియున్నది. మేదరి, నేతపనులకు కూడా వారు ప్రసిద్ధిచెందారు. అమెరికాలోని కొన్ని ప్రాంతములలో ఈ ఆదిప్రాచీన చిత్రకళ యిప్పటికీ నిలచివుంది.

ఇట్టిది ఆదివాసుల చిత్రకళ. ఈ నాడు ఆధునాతన చిత్రకారులైన గాగిన్, మొదగ్లాని, పికాసో వంటివారు ఈ చిత్రకళ ఔన్నత్యమును గ్రహించి, దీనియందలి కొన్ని అంశాలను అనుకరించుతూ, ఆధునాతన చిత్రకళన్న కొంగ్రొత్త పేరుతో దానికో విధంగా పునర్జన్మ యివ్వడానికి ప్రయత్నిస్తున్నా, కొన్ని దేశాల్లో ప్రభుత్వాలు సైతం మిగిలివున్న ఆదిమ చిత్రకళలను పెంపొందించడానికి ప్రయత్నిస్తున్నా, ఆ చిత్రకళకు దోహదమిచ్చిన అనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, నైతిక మత పరిస్థితులకు ఈ నాటి పరిస్థితులకు భేదమున్నప్పుడు అనాటి చిత్రకళను ఈ నాడు అవలంబింప ప్రయత్రించడం నిరుపయోగం అనిపిస్తుంది. అసహజమైన జీవనంకంటే సహజమైన మృత్యువే మేలుకదా !



# అమరవీరుడు అచ్యుతరాయుల స్మృతికి నెహ్రూ సంతాపం

గత సంవత్సరం నవంబరులో చైనా సైనికులు, భారతదేశంపై దండెత్తివచ్చినప్పుడు ఆంధ్రమాత కన్న వీరపుత్రుడు, యువకుడు, సెకండ్ లెఫ్టినెంటు కల్నల్ శ్రీ తులాబందుల అచ్యుతరాయలు మన మాతృదేశ రక్షణకై శత్రుసైనికులతో వీరోచితంగా పోరాడి, తమ ప్రాణాలను ధారపోశారు. ఆ అమరవీరుని స్మృతికి తమ ప్రగాఢ సంతాపాన్ని అందజేస్తూ ప్రధాని నెహ్రూ, అమరవీరుని తండ్రి శ్రీ తులాబందుల నాగేశ్వరరావుకు ఇలా లేఖ వ్రాశారు :

"ఈ విషాదకరమైన వార్త విని, మీ అందరివలె, నేనుకూడా శోకపరితప్తహృదయంతో బాధపడుతున్నాను. ఈ దుఃఖసమయంలో భారతదేశ ప్రజలతరఫున, వ్యక్తిగతంగా నేను మీకు నా ప్రగాఢసానుభూతిని అందజేస్తున్నాను. అయితే, మాతృదేశ రక్షణకై మీ పుత్రుడు కావించిన త్యాగం మహత్తరమైనది. ఆయన తన మాతృదేశసేవలో నిమగ్నుడై తన ప్రాణాలను సైతం బలిదానం కావించారు. ఆయన త్యాగనిరతికి యావద్భారతదేశం కృతజ్ఞురాలై వున్నది. ఇందువల్ల మీకు కొంత ధైర్యం, మనశ్శాంతి కలుగగలవని ఆశిస్తున్నాను."

# వెలుగు బాటలు

కె. వి. భాస్కరరావు

దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడి ఆరు నెలలు పూర్తయింది. ఈ కాలంలో జాతీయ సమైక్యత దినదినాభివృద్ధి చెందింది. ఆసేతుహిమాచల పర్యంతం ప్రజలు ఒక్కటిగా నిలబడ్డారు. ఎనలేని త్యాగం చేశారు. అసమాన ధైర్య, సాహసాలను ప్రదర్శించారు. ఆపదసమయంలో జాతి, మత, కులాలకు అతీతంగా వ్యవహరించ గలమని నిరూపించారు. ఏ దేశానికైనా సహజ సంపద ఆదేశంలోని ప్రజలే. వారు తమ బాధ్యతలను గుర్తించి దేశ రక్షణకు స్వచ్ఛందంగా నడుం కట్టటం గర్వకారణం. ఒక దేశం తన ప్రజనుండి ఇంతకుమించి ఆశించగల్గేదేమిటి? మన ప్రజలలో నిద్రాణమై వున్న శక్తులను మేల్కొల్పటందుకు ఇలాంటి పరిస్థితులే ఒక్కొక్కసారి దోహదం చేస్తాయి.

సాంస్కృతిక కార్యక్రమాలు అత్యవసర పరిస్థితిలో బహుముఖంగా తోడ్పడ్డాయి. ప్రదర్శనలద్వారా సరిహద్దు సమస్యను, చైనా దురాక్రమణను ప్రజలకు విపులంగా తెలుపడమే గాక, జాతీయ రక్షణనిధికి ధనం సమకూర్చడానికి వీలు కల్గింది. దేశంలోని అనేక సాంస్కృతిక బృందాలు ఈ అవకాశాన్ని సద్వినియోగపరచాయి. అనేక కొత్త కార్యక్రమాలను ప్రజలకు అందజేశాయి. ఇక రాష్ట్ర రాజధానిలో వేరే చెప్పనవసరం లేదు. ఇటీవలి కాలంలో హైదరాబాదులో ఏదోఒక సాంస్కృతిక కార్యక్రమం లేని రోజు లేదంటే అతిశయోక్తి కాదేమో; రాష్ట్రం లోపలినుండో, బయటి రాష్ట్రాల నుండో, చివరకు విదేశ సాంస్కృతిక బృందాలు సైతం తమ కళా నైపుణ్యాన్ని ప్రదర్శించి ప్రజల మన్ననల నొందాయి. వీటికితోడు అన్ని హంగులతో కూడిన రంగస్థలం రాజధానిలో నిర్మింపబడటం (రవీంద్ర భారతి) ఈ సాంస్కృతిక కార్యక్రమాలకు మరింత శోభ చేకూర్చింది.

ఆంధ్రదేశపు సాంస్కృతిక చరిత్రలో మే నెల మరపురానిది. తెలుగు చలనచిత్ర రంగంలోని కళాకారులంతా తమ నటనా కౌశల్యంతో ప్రజలను వుర్రూతలూపారు. సినిమారంగం ద్వారా లక్షలాది ప్రజల మన్ననల నొందిన నటీనటులు నాటక రంగంపై ప్రత్యక్షంగా ప్రదర్శనలిచ్చి అశేష ప్రజానీకపు ఆదరాభిమానాలను చూరగొన్నారు.

తమ స్వయంకృషి ద్వారా చలనచిత్ర రంగంలో ప్రముఖ స్థానాన్ని పొందిన శ్రీ నాగేశ్వరరావు, శ్రీ రేలంగి, శ్రీమతి సావిత్రి మున్నగువారు విద్యా సంస్థలకు, అభివృద్ధి కార్యక్రమాలకు లోగడ విరాళాలిచ్చిన సంగతి అందరికీ తెలిసిందే. ఐతే సాధారణ పరిస్థితులలోనే గాక అత్యయిక స్థితిలో కూడ వారు ముందుకు రావడం ముదావహం. జాతీయ రక్షణ నిధికి మేటి నటీనటులతో ఉచిత ప్రదర్శన లిచ్చేటందుకు వారు స్వచ్ఛందంగా అంగీకరించారు. ప్రఖ్యాత దర్శకులు శ్రీ పి. పుల్లయ్య కన్వీనరుగా ఆంధ్ర ఫిలిం పరిశ్రమ జాతీయ రక్షణ సంఘాన్ని ఏర్పాటు చేశారు.

తెలుగు సినీతారల ఉత్సవాలను రాష్ట్ర ప్రజా రక్షణ సంఘం నిర్వహించింది. ఆంధ్ర సినీ కళాకారుల జాతీయ రక్షణ సంఘం సాంస్కృతిక కార్యక్రమాలను సమర్పించింది. ఈ కార్యక్రమాలు విజయవాడ, హైదరాబాదు, కర్నూలు పట్టణాలలో ఏర్పాటు చేయబడ్డాయి. అంటే స్థూలంగా సర్కారు, తెలంగాణా, రాయలసీమ మూడు ప్రాంతాల ప్రజలకు తమ అభిమాన నటీ, నటులను, వారి ప్రదర్శనలను ముఖాముఖి చూసే అవకాశం కల్గింది. ఈ కార్యక్రమాలలో నాగేశ్వరరావు, రామారావు, జగ్గయ్య, గుమ్మడి, రంగారావు, రేలంగి, కాంతారావు, రాజనాల, రమణారెడ్డి, మిక్కిలినేని, లింగమూర్తి, పద్మనాభం, సావిత్రి, జమున, కృష్ణకుమారి, కన్నాంబ, రాజసులోచన, గిరిజ, జయశ్రీ, లక్ష్మీరాజ్యం, సూర్యకాంతం మొదలైన హేమాహేమీలు పాల్గొనడంతో చలనచిత్ర రంగమంతా కదలివచ్చినట్లయింది. ఘంటసాల, రఘురామయ్యగారలు తమ గాన మాధుర్యంతో పులకింపజేశారు.

ప్రదర్శించిన అంశాలలో అధికభాగం రక్షణ విషయాలకు సంబంధించి వుండటం మరొక విశేషం. 'దేశం కోసం', 'అజ్ఞాత వీరులు', 'రక్తతర్పణ', 'దేశభక్తి' నాటికలు సరిహద్దుసమస్యకు సంబంధించినవే గాక, దేశ రక్షలో ప్రజల కర్తవ్యాన్ని ప్రబోధించాయి. ప్రఖ్యాత నటులు శ్రీ జగ్గయ్య గారు 'రక్తతర్పణ' రచయితగా ప్రేక్షకుల ప్రశంసల నందుకొన్నారు. ఉత్సవాల సందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచికకు, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ జగ్గయ్య, శ్రీ పేకేటి గారలు ప్రత్యేక వ్యాసాలను అందజేశారు. ప్రపంచంలో ఏ మూల ఎలాంటి సంఘటన జరిగినా చెరువులోని అలలవలె అది అన్ని

ప్రాంతాలకు వ్యాపించగలదనీ, అందువల్ల విశ్వకల్యాణంలో మానవులంతా భాగస్వాములు కావాలని శ్రీ నాగేశ్వరరావుగారు ఉద్బోధించారు. జాతీయ రక్షణ నిధికి తోడ్పడవలసిందిగా ఆయన ప్రజలను కోరారు. సినిమాలవల్ల జాతీయ సమైక్యతే గాక, నవ సాంస్కృతిక నిర్మాణం ఎలా సాధ్యం కాగలదో విపులంగా తెలియజేశారు శ్రీ జగ్గయ్యగారు. తెర తారలను ప్రత్యక్షంగా చూడాలనే లక్షలాది ప్రజల కల ఫలించిందంటూ, ఇందుకు ఏర్పాట్లు చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని, తదితరులను అభినందించారు శ్రీ పేకేటి.

ఈ ప్రదర్శనలద్వారా ఆంధ్ర సినీ కళాకారులు తమ దేశ భక్తిని ప్రకటించడమే గాక, క్రమశిక్షణతో ఇతరులకు మార్గదర్శకులయ్యారు. మండువేసంగిలో వందలాది మైళ్ళ ప్రయాణాన్ని, తెరపిలేని కార్యక్రమాలను సంతోషంతో నిర్వహించారు. ప్రయాణపుఖర్చులను తారలే స్వయంగా భరించారు. సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో శ్రీ పుల్లయ్య, శ్రీ నాగేశ్వరరావు గారలు చూపిన ప్రత్యేక శ్రద్ధ ప్రశంసనీయమైనది. వీరి ప్రదర్శనల సందర్భంగా ఆంధ్ర చిత్ర పరిశ్రమ ఒక వారం రోజులపాటు స్థంభించిపోయింది. దీని విలువ కొన్ని లక్షలైనా వుంటుంది. దేశంకోసం ఇంతటి త్యాగాన్ని ప్రదర్శించిన మన చిత్ర పరిశ్రమలోని ప్రతి ఒక్కరూ ప్రజల జేజేల నందుకొంటారు.

ఇప్పటివరకూ మద్రాసులో వుంటున్న ఆంధ్ర కళాకారులంతా ఒక్కుమ్మడిగా తెలుగు గడ్డపైకి రావడంతో ఉభయులకూ ఎంతో ఆనందాన్ని కల్గించింది. తమ అభిమాననటులందరూ ఒకేసారి కన్పించడంతో ప్రజల ఆనందం అవధులు దాటింది. కళాకారులుకూడ తాము ఎంతో కాలం తరవాత పుట్టినింటికి చేరినట్లు సంబరపడ్డారు. ఉభయులను మరింత సన్నిహితం చేసిన సంఘటన యిది.

ఆంధ్ర సినీ కళాకారుల జాతీయ రక్షణ సంఘం కృషిని ప్రశంసిస్తూ ముఖ్యమంత్రి అత్యవసర పరిస్థితి వున్నా లేకపోయినా వారు ఏటేటా యిలాంటి కార్యక్రమాలను ప్రదర్శించి ప్రజలకు వినోదాన్ని విజ్ఞానాన్ని కల్పించాలని సూచించారు. ఈ సూచన ఎంతో సహేతుకమైనది. ఇందువల్ల కళాకారులు ప్రజలతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకొనడమే గాక సాంస్కృతిక వికాసానికి కూడ తోడ్పడగలరు. ఈనాటి దేశ పరిస్థితి దృష్ట్యా విశేష త్యాగం చూపిన వీరు దేశ ప్రజల అభీష్టాని కనుగుణంగా మున్ముందు ఎక్కువ ప్రదర్శనలివ్వగలరనడంలో సందేహంలేదు. ఎందువల్లనంటే వారికి తెలుసు "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుజులోయ్"—అని.

---

# చైతన్యము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

దీవించి సమర ధాత్రికి పంపుదువు గాని
కడుపు చల్లగ పుత్త్రుఁ గన్న తల్లి !
ఆనందముగ మనోహరు నంపుదువు గాని
విమతులఁ బోఁద్రోల వీరపత్ని !
అలనాటి సత్యను దలపించెదవు గాని
రావమ్మ ముందుకు యౌవనాంగి !
జయహారతులు పాడి సాగనంపుదువు గాని
నీ యన్నలను భారతీయ బాల !

దేశ గౌరవ స్వాతంత్ర్య దివ్య కీర్తి
సుప్రతిష్ఠలు కాపాడ; సుహృదులట్లు
చూచుకొన్న చైనీయులే దోచుకొనగ
బూని దండెత్తినారు నీ భూమిమీద.

కష్టించి పనిచేసి గడియించి పొదుపు చే
సిన పవిత్రం బైన ధన మొకింత
తర తరమ్ముల నుండి తనువున దాల్చుచు
మురిసి పోయెడి స్వర్ణ భూషణముల
హుండీలు గ్రహియించి ఊరూరు నింటింట
తిరిగి వేడుక తోడ తెచ్చు సొమ్ము
ఎప్పుడో తినుటకై యిప్పుడే దాచిన
ఆహార ధాన్యాల యందొకింత

దేశమాతకు కాన్కగా తీసి యిండు
ఆయుధ బలమ్ము తోడ సంఖ్యాబలమ్ము
కూడ గలిగిన రిపులతో ఘోర సమర
సీమ నిలిచిన భారత సేన కొరకు.

అద్వైత దృష్టితో నఖిలమ్ము వీక్షించు
తత్వమ్ముగల ఆర్ష ధాత్రి మనది
గౌతమాశోకులు గాంధీ మహాత్ముండు
గఱపిన శాంతి మార్గంబు మనది
పగవారలను బాధ పడనీక కష్టింప
ప్రాప్తించు స్వాతంత్ర్య లక్ష్మి మనది
న్యాయ సంరక్షణకై యనేకాజి రం
గంబుల నిలుచు ధైర్యంబు మనది

మాతృ దాస్య విముక్తికి మహిత సంప
దలను త్యజియించి ఖైదులోపల గృశింప
సిద్ధపడు త్యాగమూర్తుల సేవ మనది
అన్ని విధముల ఘన విజయమ్ము మనది.

తన యట్లె యెల్లరు మనసు లోతుల నుండి
భాషింతురన్న భావంబు మనది
స్నేహ పూరిత పరిస్థితులలో చర్చించి
సామరస్యము గూర్చు సరణి మనది
ఏ కూటమికి చెంద నిచ్చగింపని సుహృ
త్తాటస్థ్యమును బూను బాటమనది
ఒక సూది మోపిన యుర్వియు నితరుల
దాశింప బోని మర్యాద మనది.
యెంతో శ్రమియింపగా లభియించినట్టి
స్వేచ్ఛ నిల్పుకొనంగ సంసిద్ధుల మయి
యెట్టి త్యాగాలనైన గావింప గలుగు
ధర్మ మార్గైక దీక్షా పథంబు మనది.

(మిగతా 26 వ పేజీలో)

# తెలుపు నలుపు

[ఇప్పుడు వివాదగ్రస్తంగావున్న సరిహద్దు ప్రాంతాలపై సర్వం సహాధికారాన్ని గురించిన భారతీయవాదం ఆమోదిత అంతర్జాతీయ న్యాయశాస్త్ర సూత్రాలకు పూర్తిగా అనుగుణ్యంగా వుంది.

చారిత్రక హక్కులూ, సంధులూ, సంప్రదాయం, యిప్పుడు వివాదగ్రస్తంగావున్న ప్రాంతాలతో భారత ప్రభుత్వం సర్వం సహాధికారం చెలాయిస్తూ వుండడం - యివే భారతీయ వాదానికి ఆధారాలనీ, పైగా 1959 వరకూ చైనాకూడా యీ సరిహద్దును గుర్తించిందనీ డాక్టర్ కె. కృష్ణారావు యీ వ్యాసంలో నిరూపించారు.

భారతీయ వాదం పూర్తిగా అంతర్జాతీయ ఆచారానికి అనుగుణ్యంగా వుందనీ, అనేక సంవత్సరాలక్రితం పరిష్కృతమై, సంధులద్వారా ధ్రువపడిన యీ సరిహద్దును వివాదాస్పదం చేయడానికి చైనా చేస్తున్న యత్నాన్ని న్యాయశాస్త్రం సమర్థించదని నిరూపించడానికి డాక్టర్ కె. కృష్ణారావు యీ వ్యాసంలో అంతర్జాతీయ న్యాయస్థానంనిర్ణయాలను ఉదహరించారు.]

ఇప్పుడు వివాదగ్రస్తంగా వున్న సరిహద్దు ప్రాంతాలపై సర్వంసహాధికారాన్ని గురించిన భారతీయవాదం ఆమోదిత అంతర్జాతీయ న్యాయశాస్త్ర సూత్రాలకు పూర్తిగా అనుగుణ్యంగా వుంది.

హక్కును స్థిరపరుచుకోవడం ఒక క్రమానుగతమైన పద్ధతి అనీ, హక్కుదారు తన హక్కును బలపరుచుకోవాలని కోరతాడనీ, హక్కు బలపడుతున్న కొద్దీ, ఆ హక్కును సమర్థించేందుకు అనేక ఆధారాలుంటాయనీ ఒక సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త అన్నారు.

ఈ ప్రాంతాలపై భారత దేశానికి గల హక్కుకూ, వాటిపై చైనా తనకున్నదని చెబుతున్న హక్కుకూ చాలా వ్యత్యాసముంది. ఉదాహరణకు, భారతీయ వాదానికి ఆధారం చారిత్రక హక్కులు, క్రీస్తుశకానికిపూర్వం నుంచీ కూడా యీ ప్రాంతాలు భారత దేశ స్వాధీనంలోనే వున్నాయి.

భారత దేశపు ఉత్తర సరిహద్దు అంతర్జాతీయ న్యాయశాస్త్ర సూత్రాలకూ, సహజసరిహద్దులూ, పర్వత శ్రేణుల విషయంలో అంతర్జాతీయ ఆచారాలకూ అనుగుణ్యంగా వుంది. ఈ సరిహద్దులను ఇండియా, చైనాలు రెండూ ఆమోదించినట్లు సంధులూ, సంప్రదాయమూ నిరూపిస్తున్నాయి. చైనా భారత భూభాగంలోకి చొచ్చుకు వస్తూ, తన వాదాన్ని బయటపెట్టినపుడు, భారతదేశం ఆ సరిహద్దు ప్రాంతాలలో బాహాటంగా సర్వం సహాధికారాన్ని చెలాయిస్తోంది.

ముఖ్యంగా, 1914 నాటి సిమ్లా ఒప్పందానికి ఇండియా, టిబెట్, చైనాలు భాగస్వాములు. భారత దేశం చెబుతున్న భారత చైనా సరిహద్దును చైనా గుర్తించింది.

ఆనాటినుంచీ యీ సరిహద్దు ప్రాంతాలు ఇండియాలో భాగమని నిరూపించడానికి చారిత్రకాధారాలెన్నో వున్నాయి. శాసనాలూ, జనాభా లెక్కలూ, రెవిన్యూ రికార్డులూ, భారత సర్వేశాఖ రికార్డులూ — ఇవన్నీ యీ ప్రాంతాలు భారత పాలన క్రింద వున్నాయన్న వాస్తవాన్ని నిరూపిస్తాయి. ఒకవైపున భారతదేశమూ, రెండోవైపున టిబెట్, చైనాతో వివిధదశలలో కుదుర్చుకున్న సంధులూ, ఒప్పందాలూ యీ సరిహద్దును ధ్రువపరుస్తున్నాయి. లడఖ్ రంగంలో 1684, 1842, 1852 లనాటి సంధులూ, ఒప్పందాలూ యీ సరిహద్దును ధ్రువపరుస్తున్నాయి. 1890 సెప్టెంబరు, 1914 జూలై నెలలలో జరిగిన దౌత్యపత్రాల మార్పిడి ద్వారానూ, 1954 లో టిబెట్‌పై భారత, చైనాలు కుదుర్చుకున్న ఒప్పందం ద్వారానూ మధ్యరంగంలో యీ సరిహద్దు ధ్రువపడింది. అలాగే, తూర్పు రంగంలో సరిహద్దు 1914 మార్చి 24, 25 తేదీలలో ఇండియా టిబెట్‌లు పంపుకున్న పత్రాల ద్వారానూ, 1914 జూలై 3 నాటి సిమ్లా ఒప్పందంద్వారానూ ధ్రువపరచబడింది.

భారత, చైనా సరిహద్దు ఎన్నడూ లాంఛనంగా నిర్ణయించ బడలేదనీ, భారతదేశం చెబుతున్న సరిహద్దు దేశ బ్రిటిషు సామ్రాజ్యవాదులు రుద్దిందనీ చైనా ప్రజారిపబ్లిక్ యిప్పుడుఅంటోంది. ఇంత కాలంగా పూర్తిగా అమలులో వుంటూ, యిటీవలి వరకూ చైనా ఆక్షేపణకు గురికాని

సరిహద్దుకు సంబంధించిన యీ సూత్రాలన్నిటి మాటేమిటి? ఒక పక్షం ఇష్టాయిష్టాలపై సరిహద్దు సంధులను ఆమోదించవచ్చును లేదా తృణీకరించ వచ్చును. అంటే అది అరాచకమే అవుతుంది. ఇన్నేళ్ళ వరకూ యీ సంధులవల్ల లాభాలను అనుభవిస్తూ, యిప్పుడు అవి చెల్లనేరవని చైనా ప్రజా రిపబ్లిక్ అనడానికి అధికారం లేదు.

## ప్రియ విహీర్ కేసు

కంబోడియా, థాయ్‌లాండ్‌ల మధ్య సరిహద్దు వివాదాన్ని గురించిన ప్రియ విహీర్ కేసుపై ప్రపంచ న్యాయస్థానం 1962 జూన్ 15వ తేదీన తీర్పు యిచ్చినది.

ఫ్రాన్సు అనాడు కంబోడియాను రక్షిస్తున్న దేశంవద్దనుంచి తనకు అందిన పటంలో చూపిన సరిహద్దురేఖకు థాయ్‌లాండ్ ఆక్షేపణ తెలియజేయక, మౌనంగా వున్నందున థాయ్‌లాండ్ ఆ సరిహద్దు రేఖను గుర్తించిందనీ, అదిదాన్ని ఆమోదించినట్లవుతుందనీ అందువల్ల థాయ్‌లాండ్ ఆ సరిహద్దు రేఖకు కట్టుబడి వుండాలనీ ఆ కేసు తీర్పులో ప్రధానాంశం. సయాం అధికారులు దీర్ఘకాలం చెలాయించిన పాలనాధికారం వల్ల ఆ హక్కు చెక్కుచెదరదని యీ న్యాయస్థానం తీర్పు యిచ్చింది.

పర్వత శ్రేణి సూత్రం, సరిహద్దున చైనా అంగీకారం తెలిపిందన్న భావన, ఒకసారి జరిగిన సరిహద్దు పరిష్కారం ఖాయంగా వుండాలన్న సూత్రం — వీటిని గురించిన భారత వాదాన్ని యీ తీర్పు సమర్థిస్తోంది.

చైనా యీ విషయంలో యిష్టం వచ్చినట్లు వ్యవహరిస్తోంది. తనకు అనుకూలంగా వున్నప్పుడు కొన్ని సూత్రాలనూ ఉల్లేఖిస్తూ వుంటుంది. అనుకూలంగా లేనప్పుడు వాటిని నిరాకరిస్తూ వుంటుంది.

## చైనా వాదంలో వైరుధ్యాలు

రెండు పొరుగు దేశాలు తమతమ ప్రాంతాలపై సర్వం సహాధికారాన్ని చెలాయిస్తూ ఉభయ దేశాలు ఉమ్మడిగా నిర్దేశించుకున్నదే ఆమోదిత, అంతర్జాతీయ సూత్రాల ప్రకారం అంతర్జాతీయ సరిహద్దు అని చైనా నిర్వచించింది.

ఈ నిర్వచనం ఆధారంగా, భారత, చైనా సరిహద్దురేఖ చెల్లనేరదని చైనా అంటోంది.

బహుశా, తనకు అనుకూలంగా వుండడం వల్ల కాబోలు, చైనా యితర సందర్భాలలో యిందుకు భిన్నమైన వాదం లేవదీసింది. ఆ వాదాన్ని గమనించడం అవసరం. సరిహద్దు సమస్యపై భారత, చైనా దేశాల అధికార బృందాలు చర్చలు జరుపుతున్నప్పుడు చైనా బృందం ఆ ప్రాంతంలో సరిహద్దుకు సంబంధించి 1924–25 లో టిబెట్, గ్రేట్ బ్రిటన్‌ల మధ్య జరిగిన దోక్పో కార్పో చర్చలను ప్రస్తావించింది. "సంప్రదాయ సిద్ధమైన సరిహద్దు రేఖ స్పష్టంగా వుంది కాబట్టి, దానిని తిరిగి నిర్ణయించవలసిన అవసరం లేదు." కాబట్టి చైనా ఆ సందర్భంలో ఒక ప్రతిపాదనను అంగీకరించ లేదని వాదించ బడింది. తాము చెబుతున్న సంప్రదాయ సిద్ధమైన సరిహద్దు రేఖ "నిర్దిష్టంగానూ, స్పష్టంగానూ వుందనీ'' దానికి తిరుగు లేదనీ కూడా చర్చల సందర్భంలో చైనా బృందం వారు అన్నారు.

వివిధ సందర్భాలలో చైనా ధోరణులలో కొట్టవచ్చేటట్టుగా కనిపిస్తున్న వైరుధ్యాలను ఎవరూ గమనించకుండా వుండరు. అదే సరిహద్దును గురించి ఇంతకుముందు ఒక మాటచెప్పి, యిప్పుడు దానిని గురించే విరుద్ధంగా మాట్లాడడం చైనాకే చెల్లుతుంది.

అంతేకాదు, గుర్తింపబడిన అంతర్జాతీయ న్యాయశాస్త్ర సూత్రం ప్రకారం, అంతర్జాతీయ సరిహద్దును లాంఛనంగా నిర్ణయించవలసిన అవసరం లేదు. పామాస్ కేసులో మాక్స్ హ్యూబర్ న్యాయమూర్తి కూడా పైవిషయాన్నే ధ్రువపరిచారు.

అంతర్జాతీయ పరిగణన పొందిన సహజ సరిహద్దులూ, సరిహద్దు ఒప్పందాలూ, నిరాఘాటంగా కొనసాగిన విధుల నిర్వహణ–యిట్టి అనేక ఆధారాలవల్ల ప్రాదేశిక సర్వం సహాధికారం నిరూపితమవుతుందని పైవిషయాన్ని బట్టి స్పష్టమవుతుంది.

చైనా యితర వాదాలు కూడా అలాగే వైరుధ్యాలతో నిండి వున్నాయి. 1914 నాటి సిమ్లా ఒప్పందం విషయంలో తన పూర్వానుమతిలేనిదే ఒప్పందం కుదుర్చుకునే అధికారం టిబెట్‌కు లేదని చైనా వాదం. అయితే, భారత, చైనా సరిహద్దులో ఒక భాగానికి సంబంధించి 1924–25 లో గ్రేటు బ్రిటన్‌తో టిబెట్ స్వతంత్రంగాజరిపిన సంప్రదింపులూ, చర్చల ప్రాతిపదికపై చైనా తన వాదానికి సాక్ష్యం సమకూర్చుకో దలిచింది. ఈ చర్చలు కూడా చైనా పూర్వానుమతి లేకుండానే జరిగాయి. అందువల్ల సిమ్లా ఒప్పందంపై సంతకం చేసేందుకు టిబెట్‌కు అధికారం లేదన్న చైనా వాదంలో పసలేకుండా పోయింది.

## చైనా స్వవచనాఘాతం

టిబెట్‌లో "రాజకీయ, మత సమైక్య'' వ్యవస్థను గురించిన చైనా వాదాన్ని పరిశీలిద్దాం. రాజకీయాధికారం, మతాధికారం సమమని చైనా వాదంలో కీలకాంశం. కాని, 1914 లో అప్పటి చైనా ప్రభుత్వమే దానిని ఖండించింది. అప్పటి చైనా విదేశాంగ మంత్రి యిలా అన్నారు. "లామాలకు మత సంబంధమైన అధికారాలుంటే వుండవచ్చు,

అంతమాత్రాన, ఆ ప్రాంతాలు టిబెట్‌కు చెందినవే అనడానికి వీలు లేదు.''

ఈ వాదం యిప్పుడు చైనాకు అనుకూలంగా వుండవచ్చు. కాని, అంతర్జాతీయ న్యాయశాస్త్రం అందుకు ఒప్పదు. చైనా యిప్పటి యీ వాదం స్వవచనాఘాతమే.

అంతర్జాతీయ న్యాయశాస్త్రం క్రింద ఆక్షేపణలు తెలపడం, అంగీకారాన్ని తెలియజేసే జగద్విదిత నియమం — వీటిని గురించి చైనా సాధారణమైన ప్రకటనలు చేసింది.

భారత, చైనా సరిహద్దు వివాదగ్రస్తమైనదైతే, 1956 వ సంవత్సరం వరకూ చైనా కిమ్మనకుండా ఎందుకువుంది అన్న భారతీయ వాదాన్ని ఖండించే ప్రయత్నంలో చైనా అధికార బృందం వారు 1960 లో యిలా చెప్పారు. "ఏ అంతర్జాతీయ న్యాయశాస్త్ర ప్రకారం భారత వాదం ఆధారపడిందో చైనాకు తెలియదు. మౌనం అంగీకారం అన్నది అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో ఆమోదిత సూత్రం కాదు.''

అంతర్జాతీయ న్యాయస్థానం యిచ్చిన ముఖ్యమైన తీర్పుల ఆధారంగా చైనా వాదాన్ని ఖండించవచ్చును. సామాస్ దీవి కేసులోనూ, రోటస్ కేసులోనూ, మిన్‌క్వైర్స్, ఎక్రెహోస్ కేసులోనూ, మరికొన్ని యితర కేసులలోనూ ఆక్షేపణ పత్రాల ప్రాముఖ్యం ఉగ్గడించబడింది. మౌనం అంగీకారం అన్న సూత్రం సమర్థించబడింది.

ఇప్పుడు చైనీయులు చేస్తున్న వాదానికి సమమైన వాదాన్ని అంతర్జాతీయ న్యాయస్థానం యిటీవల ప్రియవిహీర్ కేసులో నిస్సంకోచంగా నిరాకరించింది. "......ఆ పటంలో చూపిన సరిహద్దును అంగీకరించక పోతే, లేదా ఆ విషయమై తీవ్రమైన భేదాభిప్రాయం వుంటే అది అందిన కొంతకాలం లోగా సయాం అధికారులు దానికి ఆక్షేపణ తెలుపవలసి ఉంది. అప్పుడుగాని, చాలా సంవత్సరాల వరకూగాని వారు అలా చేయలేదు. దాని అర్థం వారు ఆ సరిహద్దును అంగీకరించినట్లే'' అని న్యాయస్థానం తీర్పు యిచ్చింది.

అల్ఫారో న్యాయమూర్తి ప్రత్యేకాభిప్రాయ ప్రకటనలో కూడా మౌనం అంగీకారం అన్న సూత్రం గుర్తించ బడింది.

అందువల్ల, సరిహద్దును గురించి భారత వాదమేమిటో తెలిసుండి కూడా చైనా యిన్ని సంవత్సరాలు మౌనంగా వుండడంవల్ల, ప్రస్తుత చైనా వాదంలో పసలేదని సుస్పష్టమవుతోంది.

నిజానికి, తప్పుడు చైనా పటాలను గురించి భారత దేశమే పలుమార్లు చైనా ప్రభుత్వానికి ఆక్షేపణలు తెలిపింది. అవి పాతకాలం నాటి పటాలనీ, వాటిని సవరించ వలసివుందనీ చైనా చెబుతూ వచ్చింది. పంచశీల ఒప్పందంపై సంతకాలు పెడుతున్నప్పుడు కూడా సరిహద్దును గురించి చైనా తన అనుమానాలను వ్యక్తపరచలేదు. ఇట్టి చైనా ప్రవర్తన అంతర్జాతీయ న్యాయశాస్త్ర, నియమాలకు విరుద్ధం. ప్రియవిహీర్ కేసులో యిటీవల యీ విషయం ధ్రువపడిందికూడా.

సంధిమూలకంగా పరిష్కారం కుదిరితే, చారిత్రక కారణాలూ, మత, జాతి, తదితర కారణాలూ అప్రధానమవుతాయి. సంధిద్వారా జరిగిన పరిష్కారమే ఖాయపు పరిష్కారం.

భారత, చైనా సరిహద్దు రేఖ సంధుల ద్వారా ప్రామాణికం చేయబడింది. కాబట్టి, చైనా చూపే చారిత్రక మత సంబంధ, తదితర సాక్ష్యాలకు విలువలేదు. ఇప్పుడు వివాద గ్రస్తమైన ప్రాంతాలకూ, టిబెట్‌కూ మత సంబంధమైన అనుబంధాలున్నాయన్నదే తన వాదాన్ని సమర్థించుకునేందుకు చైనా చూపుతున్న సాక్ష్యానికి ఆధారం. కాని పై వాదం ప్రకారం యిది చెల్లదు.

అందువల్ల అనేక సంవత్సరాల క్రితం నిర్దేశించబడి, సంధుల ద్వారా ధ్రువపడిన యీ సరిహద్దును, వివాదాస్పదం చేయడానికి చైనా చేస్తున్న యత్నాన్ని న్యాయశాస్త్రం సమర్థించదనడంలో ఎట్టి సందేహమూ లేదు.

— డాక్టర్ కె. కృష్ణారావు

## అలీసబ్రీ రాయబారం

సరిహద్దు వివాదంపై ఇండియా, చైనాల మధ్య ముఖాముఖీ చర్చలు జరిగేటట్లు చేయడానికి సమైక్య అరబ్ రిపబ్లిక్ ప్రధాని అలీసబ్రీ ఇటీవల పెకింగ్ సందర్శించారు. తర్వాత న్యూఢిల్లీకివచ్చి చౌ-ఎన్-లై ప్రభృతులతో తాను జరిపిన చర్చలను ఆయన ప్రధాని నెహ్రూకు వివరించారు. ముఖాముఖీ చర్చలు జరగాలంటే వివరణలతో సహా కొలంబోసభ ప్రతిపాదనలను ఇండియా అంగీకరించినట్లే చైనా పూర్తిగా అంగీకరించాలని లోగడే భారత ప్రభుత్వం స్పష్టపరిచింది. దీనిని బట్టి కొలంబో ప్రతిపాదనలను చైనాచేత పూర్తిగా ఆమోదింపజేయడానికే సబ్రీ చైనాకు వెళ్ళారన్నది విదితం.

ఇండియా — చైనా సరిహద్దు వివాదాన్ని సాకల్యంగా పరిశీలించిన కొద్దిమంది విదేశీయులలో అలీసబ్రీ ఒకరు. ఎదుటివారి వాదాన్ని ఓపికగావిని దానిలోని లోపాలను మనస్సు నొచ్చకుండా చూపించి ఒప్పించగల చతురుడు, ఆయన. అందుచేత కొలంబో సభతరపున సబ్రీ పెకింగ్‌కు వెడుతున్నారంటే ఆయన రాయబారం జయప్రదం కావచ్చుననే ఆశకలిగింది. ఆయన కూడా తన పెకింగ్‌యాత్ర సఫలమౌతుందన్న ఆశాభావం వ్యక్తపరిచారు. కాని చైనా తన మొండి వైఖరిని మార్చుకొనక పోవడంవల్ల ఆయన రాయబారం జయప్రదం కాలేదు.

వివాదంపై అలీసస్త్రీ అభిప్రాయ మేమిటో చైనాకు లోగడే తెలుసు. చైనా–ఇండియా సరిహద్దుపోరాటం ఫలితంగా ఏ పక్షంకూడా లాభం పొందరాదన్న సూత్రాన్ని కొలంబో సభ అంగీకరించడానికి ఆయనే కారణభూతుడు. ఈ సూత్రం మన వాదానికి దగ్గరగా వున్నది. 1962 డిసెంబరు 10 వ తేదీన కొలంబో సభ ప్రారంభమైన నాడు ప్రధాని నెహ్రూ పార్లమెంటులో ప్రసంగిస్తూ "ఏ విధంగా చైనా వివాదం పరిష్కారం కావాలన్న దృష్టితో వారు (కొలంబో సభ రాజ్య ప్రతినిధులు) చేస్తున్న కృషిని, స్నేహభావాన్ని మనం గ్రహించాము. దురాక్రమణ పరునితో రాజీకి దిగడం సాధ్యంకాదని వారు గ్రహిస్తారని విశ్వసిస్తున్నాను. ఇరుపక్షాలు వివాద పరిష్కారానికి ప్రయత్నించేముందే దురాక్రమణ ప్రాంతాలనుంచి (చైనీస్) వైదొలగాలి" అని స్పష్టపరిచారు.

కొలంబోసభలో అలీసస్త్రీ ఇదే విషయాన్ని చెప్పారు. సైనిక చర్యలద్వారా భూభాగాలను స్వాధీనపరచుకోవడం బాండుంగ్ సిద్ధాంతాలకు విరుద్ధమని ఆయన వివరించారు. తదనుగుణంగా కొలంబోసభ ప్రతిపాదనలు రూపొందించడం జరిగింది. కొలంబోసభ ప్రతిపాదనలను తాము అంగీకరించినట్లు సభ తరఫున సింహళ ప్రధాని శ్రీమతి సిరిమావో బండారనాయకే, ఇండోనీసియా విదేశాంగమంత్రి డాక్టర్ సుబాండ్రియో, ఘనా విదేశాంగమంత్రి ఆటా పెకింగ్ వెళ్ళిన సందర్భంలో చైనా ప్రకటించింది. కాని తర్వాత వివరణలు లేకుండా మాత్రమే తాము కొలంబోసభ ప్రతిపాదనలను ఆమోదిస్తామని చైనాప్రధాని చెప్పారు.

కొలంబోసభ ప్రతిపాదనల ప్రకారం భారత దళాలు నేపాలో మెక్ మోహన్‌రేఖ వరకు వెళ్ళడానికి హక్కు వుంటుంది. కాని భారతసేనలు ఎంతవరకు వెనుకకు వెళ్ళినవో అక్కడనుంచి ముందుకు రాకూడదని చైనా వాదం. చైనీస్ ఆక్రమించేవరకు ఇండియా ఆధీనంలో వున్న లడక్ ప్రాంతంలో తిరిగి భారత కేంద్రాలు నెలకొల్పడానికి కొలంబోసభ ప్రతిపాదనలు అవకాశమిస్తున్నవి. ఈ సూచనను చైనా తిరస్కరించింది. తమ సైనిక దళాలు ఖాళీ చేసిన ప్రాంతం తమ అధీనంలోనే వుండాలని చైనా మంకుపట్టు. ఆ ప్రాంతంలోకి భారత సిబ్బంది ప్రవేశించరాదట. లడక్‌లో ఉత్తర ప్రాంతం నిస్సైనిక మండలానికి అవతల వున్నదని, అందుచేత తమ సైనిక కేంద్రాలు నెలకొల్పుతామని చైనా ఒక లేఖలో తెలిపింది. ఆ ప్రాంతంలో ఇండియా, చైనా సమానంగా గస్తీ కేంద్రాలు ఏర్పరచుకొనడానికి కొలంబో ప్రతిపాదనలు అవకాశమిస్తున్నవి. ఈ సూచనను తిరస్కరించడమే కాక తాము అక్కడ 26 గస్తీకేంద్రాలు నెలకొల్పుతున్నట్టు చైనా ప్రకటించింది. వీటినిబట్టిచూస్తే కొలంబో ప్రతిపాదనలను చైనాపూర్తిగా తిరస్కరించినట్లేఅవుతున్నది.

కాని కొలంబోసభ ప్రతిపాదనలను తిరస్కరించినట్లు చెప్పడానికి చైనా నాయకులకు ఇష్టంలేదు. ప్రతిపాదనలను తిరస్కరిస్తే ఆఫ్రేషియా రాజ్యాలలో తమ పరువు పోతుంది. చర్చలద్వారా వివాదం శాంతియుతంగా పరిష్కరించుకోవాలని తాము పరితపిస్తున్నట్లు భారత ప్రభుత్వమే పరిష్కారాన్ని వ్యతిరేకిస్తున్నట్లు ప్రపంచాన్ని నమ్మించాలని చైనా నాయకులు విశ్వప్రయత్నం చేస్తున్నారు; పదేపదే ఇండియాను నిందిస్తూ ప్రకటనలు చేస్తున్నారు.

ఇండియాను ఆడిపోసుకోవడం మాత్రమేకాక ఇరు దేశాలమధ్య ముఖాముఖీ చర్చలు జరగడానికి అనుకూల పరిస్థితులు కల్పించ యత్నిస్తున్న కొలంబో సభ రాజ్యాలపైనకూడా చైనా అభాండాలు వేసింది. కొలంబోసభ ప్రతినిధులు పెకింగ్‌కు ఒక వివరణలు, న్యూఢిల్లీకి మరొక వివరణలు ఇచ్చారని చైనా ఆరోపించింది. తాము భిన్న వివరణలు చెప్పలేదని, రెండు దేశాలకు ఒకే వివరణలు అందజేశామని కొలంబో రాజ్యాలు స్పష్టీకరించాయి. స్వవ్యాఖ్యానాలు చేయకుండా ప్రతిపాదనలను ఆమోదించాలని సభ రాజ్యాలు చైనాకు విజ్ఞప్తి చేశాయి.

చైనా రెండునాల్కల వ్యవహారాన్ని కొలంబోసభ రాజ్యాలు, వాటి తరఫున ఏప్రిల్ చివర వారంలో పెకింగ్ వెళ్ళిన అలీసస్త్రీ గ్రహించకపోలేదు. కాని మధ్యవర్తిగా వున్నప్పుడు ఒక పక్షాన్ని నిందించడం (ఆ మధ్యవర్తికి) భావ్యంకాదు. తప్పుచేసినపక్షాన్ని పట్టుకొని విమర్శించడం మధ్యవర్తి పని కాదు. దానివల్ల మధ్యవర్తి ఆశించినపని నెరవేరదు సరికదా చెడిపోయే ప్రమాదంవున్నది. అందుకే కొలంబో ప్రతిపాదనలు చైనా అంగీకరించక పోవడాన్ని ఖండించడంవల్ల వచ్చేలాభమేమీలేదని అలీసస్త్రీ ఢిల్లీలో ఒక విలేకరి ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. కొలంబో ప్రతిపాదనంపై ప్రతినిధులు న్యూఢిల్లీలో ఒకరకంవివరణలు, పెకింగ్‌లో మరొక రకంవివరణలు చేశారనే ఇంకా చైనా ఆరోపిస్తున్నదా? అని ప్రశ్నించగా సమాధానం చెప్పకుండా సస్త్రీ చైనా గౌరవాన్ని కాపాడారు. ఇంతగా తన పట్ల ఉదారంగా ప్రవర్తిస్తున్న కొలంబోసభ దేశాల ప్రతిపాదనలను ఇప్పటి కైనా పూర్తిగా అంగీకరించి చైనా తన చిత్తశుద్ధిని వెల్లడించుకొనవలసిన తరుణం వచ్చింది.

చైనా ఇంకా తన పట్టుదలను విడిచిపెట్టకుండా వ్యవహరిస్తే కొలంబోసభ రాజ్యాలు తమ ప్రయత్నాలు ఫలించే ఆశలేదని భావించవచ్చు. 'సిలన్ డెయిలీన్యూస్' మే 11 వ తేదీన పేర్కొన్నట్టు ఇలా నిరవధికంగా చైనా సమ్మతికోసం ఎదురుచూడడంవల్ల ఇండియాకు అన్యాయం చేసినట్లే అవుతుందని అలీన రాజ్యాలు తమ కృషిని విరమించకముందే కళ్ళుతెరచి వివరణలతో సహా కొలంబో ప్రతిపాదలను ఆమోదించడం చైనాకే మంచిది కాగలదు.

— కె. దేశపతిరావు

★



# నిలకడమీద తెలిసిన నిజం

## మలయాళ నాటిక:

మూలం
కె. యం. జార్జి

అనువాదం
'రమేష్'

పాత్రలు

- వర్కీ — వడ్డీ వ్యాపారస్తుడు
- కిట్టు — అతిమంచివాడు
- అన్నమ్మ — వర్కీ భార్య
- కుర్యాన్ — టీచరు

*

అన్నమ్మ ఏమండీ! అన్నం వండడానికి పాత్రలు లేవు। ఒక ఇత్తడి పాత్ర కొంటే బావుంటుందేమో!

వర్కీ ఎంతమాటన్నావు। ఎంత మాటన్నావు? ఇత్తడి పాత్ర కొంటావా? నీకు మతి పోలేదు కదా?

అ: మతి పోవడమేమిటండీ। వండుకొనడానికి తిండి బొచ్చె లేకపోతే యెలాగండీ?

వ పక్కవాళ్ళ వడిగి తీసుకుంటే సరిపోదూ

అ: వంట చేసుకునే పాత్ర రోజూ ఎవరినైనా అడుగుతారటండీ?

వ. ఏమీ ఫరవాలేదు. ఇత్తడి పాత్ర కొనాలంటే ఎన్ని డబ్బులు పోయాలి? డబ్బు

# అనువాదభారతి

యిలా ఖర్చుచేస్తే ముందుగతేంగాను?

అ ముందు సంగతి అలా వుంచండి — ప్రస్తుత విషయం ఆలోచించండి

వ తెలివిగా పని చేసుకుంటే ఏ విషయమైనా సమకూడుతుంది ఆ 'కొమ్ము తుంటి' వాళ్ళను చూడు! దివాలా ఎత్తిన కుటుంబం ఈరోజున ఎంత గడించారో! ఆ నాణియమ్మ గడ్డిపోచనుకూడా వృథా పోనివ్వదు తెలివి అంటే అదిగాని — నీదీ ఒక తెలివేనా?

అ సరేలెండి। ఆమె భర్త మంచివాడు గనుక సంసారం తెలివిగా గడిచిపోతున్నది అ కిట్టూ పిళ్ళై నిజంగా చాలా మంచివాడు।

వ అవునవును — కిట్టూ పిళ్ళై అతి మంచివాడు చాలా నిక్కచ్చి మనిషి। మాట తప్పడం అంటే ఏమిటో ఆతనికి తెలియనే తెలియదు। వడ్డీ డబ్బును అంత నిక్కచ్చిగా యిచ్చే వాడిని నా జీవితంలో చూడలేదు ఫలానా రోజున, ఫలానా యిన్ని గంటలకు యిస్తానూ అంటే— చెప్పినదానికి ఒక అర గంట ముందే వచ్చి

తప్పు చెల్లించి వెళతాడు. గడియార
మైనా తప్పు నడుస్తుందేమోగాని — కిట్టూ
పిళ్ళై మాత్రం మాట జవదాటడు.
ఇవాళ్ళ నాలుగు గంటలకు వచ్చి ఆవేళ
తీసుకున్న డబ్బు తిరిగి యిచ్చి వెళతా
నన్నాడు. ఇంకా రాలేదే!

అ: వస్తూనేవుండాలి! అంత మంచి మని
షిని నే నిదివరలో ఎప్పుడూ చూడలేదు.
ఆయన మన యింటికిరావడం ప్రారం
భించి రెండునెలలయిందేమో! ఎంత
నిష్కల్మష హృదయుడు; కులాన్ని,
మతాన్ని పాటించే వ్యక్తికాదు! చాలా
ఉదారమైన స్వభావం!

వ: అవునవును! మొదటిసారి పదిరూపా
యల అప్పుకోసంవచ్చి ఆ విషయం
చెప్పడానికి ఏంతో సిగ్గుపడ్డాడు. నే
నలాగే కూర్చున్నా. చివరకు తన ఉంగ
రంతీసి నా చేతికిచ్చాడు. ఆ తీసుకున్న
పదిరూపాయలు చెప్పిన గడువుకంటె
ఒకరోజుముందే యిచ్చివెళ్ళాడు! వడ్డీ
కూడా బాగానే యిచ్చాడు. అతని మంచి
తనంచూసి రెండవ పర్యాయం వస్తువు
తాకట్టు పెట్టనవసరం లేదన్నాను.

అ: అంత నిజాయితీగల మనిషిని తాకట్టు
అడగటం ఏం బావుంటుంది? ...అవును
గాని క్రిందటిసారి ఇరవయ్యిరూపాయలు
తిరిగిచ్చి పాతికరూపాయలు మరల
అప్పుతీసుకెళ్ళాడుగదా— అలాచేయడం
కంటే ఐదురూపాయలు అప్పుతీసుకో
లేకపోయాడా ?

వ: నీ తెలివి చట్టుబండలయినట్టుంది.
చక్రవడ్డీ అంటే ఏమిటో నీకు తెలు
సునా? అసలు మొత్తం పుచ్చుకోవాలి,
దానిపై వడ్డీకూడా రాబట్టుకోవాలి. ఆ
తరువాత మళ్ళీ కొత్తగా అప్పుయివ్వాలి.
ఇదీ వడ్డీ వ్యాపారపద్ధతి అంటే!
తెలిసిందా! ప్రపంచంలో అర్థశాస్త్రం రానివాడు
వ్యర్థుడు!

అ: అది సరేననుకోండి—కిట్టూపిళ్ళై చాలా
నిజాయితీపరుడంటాను.

వ: నేను కాదని ఎప్పుడన్నాను? నిజా
యితీకి అతగాడు పెట్టింది పేరు —
అదుగో— ? మాటల్లోనే వచ్చాడు!
నేను చెప్పలేదూ, తప్పక వస్తాడని!

అ: అవును — గడియారమైనా తప్పు
నడుస్తుందేమోకాని కిట్టూపిళ్ళై విష
యంలో మాత్రం చెప్పిన టైంకు రాక
పోవడమంటూ ఎప్పుడూ జరగదు.

వ: రండి! రండి! మీ విషయమే అను
కుంటున్నాం.

[ కిట్టూపిళ్ళై ప్రవేశిస్తాడు ]

కి: ఏమన్నారు? నా విషయమే అను
కుంటున్నారా? ఏమిటో తెలవివ్వండి.

వ: అబ్బే ఏమీలేదు; మా ఆవిడతో
మిమ్మల్ని గురించి, మీ మాట మంచి
తనాన్ని గురించి చెబుతున్నాను. నాలుగు
గంటలకల్లా వచ్చి డబ్బిచ్చి వెళతా
నన్నారుగదూ? ఆ విషయమే అను
కుంటున్నాం.

కి: ఓహో! అదా? చెప్పినట్టు చేయ
డంలో రవ్వంతకూడా అశ్రద్ధచేయను.
మాట తప్పడమంటే నాకు సుతరామూ
యిష్టముండదు. అలా చేయడం
అన్యాయమని నా వుద్దేశం. ఆడిన మాట
జవదాటకూడదని నా సిద్ధాంతం. మాట
పోయిన తరువాత మనిషి జీవించి
వుండేకంటే మరణించడం మేలంటాను.

వ: అవునవును! మీరన్నది అక్షరాలా
నిజం. మన వూళ్ళో కొంతమంది
వున్నారు—వట్టి దగుల్బాజీలు! మోసం
చేయడంతప్ప మరొకటి తెలియదు!

కి: అట్టువంటి వాళ్ళంతా బాగుపడితే దేశం
బాగుపడుతుంది. మీలాంటి మనుషుల్ని
కొంచెం కనిపెట్టి వుంటుంది.

అ: అదేనండీ నేనూ చెబుతున్నాను:

కి: మంచితనం వుండబట్టే గదండీ, నాకు
మీలాంటి వాళ్ళ దగ్గర డబ్బు దొరుకు
తున్నది? చెప్పిన గడువుకు డబ్బిచ్చి
వేయకపోతే నాకు చాలా బాధగా
వుంటుంది. నిన్ననే బొంబాయిమంచి మా
అన్నగారి అబ్బాయి దగ్గిరినుంచి ప్రత్తుర
మొచ్చింది. బొంబాయిలో ఒక పెద్ద
మిల్లులో అతగాడొక ఆఫీసరు. డబ్బు
కేమైనా ఇబ్బందిగా వుంటే నాకు రాయ
మన్నాడు. వాడి దగ్గిర డబ్బు తీసుకు
నేంతటి స్థితికి నేను దిగజారలేదు. అవ
సరమైతే వడ్డీకి తీసుకుంటాను; పని
గడిచిపోతుంది.

వ: నేనుండగా మీ కెటువంటి యిబ్బంది
రానివ్వను...

కి: మీరుచేసేది వడ్డీవ్యాపారమే అయినా
మీరు మహా మంచివారండీ!

వ: అవునవును— మనవృత్తిలో మనం గట్టి
గానే వుండాలి. ఇతరులది నాకక్కర్లేదు;
నాదినేను ఇతరులకు యివ్వను. ఇచ్చి
పుచ్చుకునే విషయంలో నేను చాలా పట్టు
దలగా వుంటాను. ఏమంటారు?

కి: వ్యాపారం అన్న తరువాత అలాగే
వుండాలిలెండి. అంత నిష్ఠగా వుండబట్టే
మీ వ్యాపారం యిలా దినదినప్రవర్ధమాన
మవుతున్నది.

వ: అవునవును. మీ మాటలు అక్షరాలా
నిజం......

అ: పిళ్ళైగారూ, కొంచెంకాఫీ తెస్తాను
పుచ్చుకోండి.

కి: కాఫీ అక్కర్లేదండీ! దప్పికగావుంది.
మంచితీర్థం యిప్పించండి చాలు.

అ: మజ్జిగ తెమ్మంటారా?

కి: అలాగేనండి! ఏమండీ వకీళ్ళగారూ ఇంతలో మనం వ్యవహారానికి సంబంధించిన విషయాలు మాట్లాడుకుందాం. ఇదుగోండి డబ్బు! పాతికరూపాయలు లెక్క పెట్టుకోండి!

వ: ఆఁ.. ఒకటి రెండు మూడు ... ఆఁ మజ్జిగ వచ్చింది తీసుకోండి.

(కిట్టూ మజ్జిగ తాగుతాడు)

అ: ఎలా ఉందండీ మజ్జిగ!

కి: దివ్యంగా వుందమ్మా! ఇందుకే గాబోలు ఆ దివ్యమంగళ రూపుడైన శ్రీకృష్ణ భగవానుడు వెన్న, మజ్జిగలు దొంగిలించాడు!

వ: కిట్టూ పిళ్ళైగారూ! మీరు నాచేతికిచ్చిన డబ్బెంత? ఇరవయ్ రూపాయలే వున్నాయేమిటండీ? మీరుకూడా మరొక సారి లెక్కబెట్టండి!

కి: మీరు లెక్కబెట్టారుగా? ఇంకా నేనెందుకులెండి? అయితే ఐదు రూపాయలు ఏమయినట్టు? బహుశా ఇంటి దగ్గిర మరచిపోయి వుంటాను. దానిదేముందిలెండి, ఆ ఐదు రూపాయలు మళ్ళా తెచ్చి యిస్తాను.

వ: ఫరవాలేదులెండి! తరువాత నేయివ్వండి. ఇప్పుడేమైనా?...

కి: ఒక వంద రూపాయలు కావాలండీ! చాలా అవసరం. ఇది మీ దృష్టిలో అంత పెద్ద మొత్తంకూడా కాదు.

వ: తప్పకుండా యిస్తా. మీ కివ్వకపోతే యింకెవరికిస్తాను? అయితే మీరీ డబ్బును కొంచెం తొందరగా తిరిగి యివ్వాలి. ఏమంటారు?

కి: ఇరవయ్ రోజుల్లో తిరిగి యిచ్చి వేస్తానండి. ఒకవేళ ఈ గడువు మీకు నమ్మతం కాకపోతే పోనివ్వండి, మా వాడికి రాస్తాను.

వ: అట్నే ఎందుకు రాయడం? యిస్తాను, ఇప్పుడే యిచ్చేస్తాను, మీరు ఇరవయ్ రోజులంటే ఇరవయ్ రోజుల్లోనే యిస్తారు. ఇరవయ్ ఒక్క రోజు మాత్రం ఎప్పుడూ కాదు. యింకా పందొమ్మిది రోజుల్లోనైనా యిస్తారేమో గాని!

కి: ఖాతా పుస్తకంలో లెక్క వివరంగా వ్రాసుకోండి —

వ: లెక్క వ్రాసుకోవడానికి యిందులో ఏముందిలే! ఇరవయ్ రోజులకు ఇరవయ్ రెండున్నర అణాలు — అంటే పదిహేను రూపాయల పది అణాలు! పది అణాలు వదిలేస్తాను. పదిహేను రూపాయలు వడ్డీ, పాత బాకీ ఐదు — మొత్తం ఇరవయ్ రూపాయలు! వందలో ఇరవయ్ పోతే ఎనభై రూపాయలు, ఇవిగో తీసుకోండి.

కి: ప్రామిసరీ నోటు ఎంతకు రాయమంటారు!

వ: నా సిద్ధాంతం మీకు తెలియనిదేముంది?......రెండింతలకు నోటు రాయించుకుంటాను. అంటే వంద యిస్తే రెండు వందలకు — ఏదో అంకె. అలా రాయించుకుంటా. అంతే! ఆ తరువాత మీ యిష్టం.

కి: రెండు వందలేమిటి! ఐదు వందలకు రాయించుకోండి. మీ మంచితనం నాకు బాగా తెలుసు.

వ: అయితే వెళ్ళి డబ్బుతెస్తా (బిగ్గరగా) ఇదుగో ఆ ఇనప్పెట్టి తాళంచెవు లెక్కడా?

అ: మీ తాళంచేతుల సంగతి నాకేం తెలుసు? మీ దగ్గరేవున్నాయి చూసుకోండి.

కి: అదిగోనండి, మీ మొలత్రాడున వేలాడుతున్నాయి.

వ: ఓహో! యిక్కడేవున్నాయి. ఇప్పుడే వస్తా.

## 2

వ: ఇవ్వాళ తారీఖు ఎంత? ఇరవయ్ ఎనిమిది కదూ?

అ: అవును. ఇరవయ్ ఎనిమిదే?

వ: ఆ మాట నిక్కచ్చి మనిషి రాలేదేమిటి?

అ: ఆయన యివ్వాళ రాలేదంటే యివ్వాళ తారీఖు ఇరవయ్ ఎనిమిది కాదేమో? ఎప్పుడిస్తా నన్నాడేమిటి?

వ: ఇవ్వాళ ఇరవయ్యోరోజు!

అ: అంతేకదా! వస్తాడు. ఎందుకు మీకంత విచారం?

వ: వస్తాడనే నమ్మకం నాకూవున్నది. అయినా ఇనప్పెట్టె ఒక్కసారి తెరిచి చూచుకుంటాను.

అ: తెరిచి చూసుకుంటే అతను తీసుకెళ్ళిన డబ్బువచ్చి పడుతుందా ఏమిటి?

వ: అదికాదు పిచ్చిదానా? అలా ఇనప్పెట్టి తెరిచి దానిలోవున్న డబ్బును నా చేతులతో స్పర్శిస్తే చాలు నాకెక్కడలేని ఆనందం కలుగుతుంది. నువ్వు ఆడదానవులే! నీకేంతెలుసు దీనిలోని అంతరార్థం! ఆఁ ఏదో చప్పుడవుతున్నది- ఎవరో వస్తున్నట్టున్నారు, చూడు.

అ: కుర్యన్ మాస్టరు!

వ: వెధవ—అప్పు అడగటానికి వస్తున్నాడేమో!

అ: పాపం ఇతగాడు చాలా కష్టదశలో వున్నాడు, ఒకళ్ళా, యిద్దరూకాదు— ఎనిమిదిమంది పిల్లలు!

వ: ఏమండోయ్ మాస్టరుగారూ! ఏమిటిలా దారితప్పి వచ్చారు?

కు: అయ్యా! చాలా కష్టంలోవున్నా. ఐదు రూపాయలు అప్పుకావాలి. ఒకటో

తేదీన జీతం అందడంతో మీ డబ్బు మీకిచ్చివేస్తాను.

వ : ఏమయ్యోయ్ ఘోష్టరూ ! మీ కష్టాలు మీరు చెప్పారు. మరి నా కష్టం ఎవరికి చెప్పుకోను ? మీ మాటలపద్ధతి చూస్తే నేనేదో డబ్బు మీకోసమే యిక్కడ కుప్ప పోసుకొని కూర్చున్నట్టుగా వున్నది.

కు : అయ్యా ! నాలుగు రోజుల్లో తిరిగి యిచ్చేస్తాను.

వ : నాలుగు రోజులేమిటి, పది రోజుల తరువాత యిచ్చినా ఫరవాలేదు. ఇప్పుడు మీకు ఐదు రూపాయలు కావాలంటారు!

కు : అవునండి ! మీరిస్తే తీసుకెళ్ళి పిల్లలకు తిండి పెడతాను. నిన్నటినుంచి పస్తు లున్నారు పిల్లలు !

అ : పాపం ! యివ్వండి ! చాలా కష్టంలో వున్నట్టున్నారు.

వ : నీ సిఫార్సు నా కక్కర్లేదు. కుర్యన్ మాష్టరు సంగతి నాకు తెలియదా ఏమిటి ?...అవునుగాని — చచ్చి నా దగ్గిర చిల్లిగవ్వలేదే ? ఏమిటి చేయడం?

కు : ఏదో రకంగా మీరు ఏర్పాటు చేయండి ! ! అవసరం....

వ : బడి పంతులుకోసం నేను అప్పుకు బయలుదేరడమా ? అది నా వల్లకాదు. నా దగ్గిరవుంటే యిచ్చేవాణ్ణి. నా మాట నమ్మండి ఎంతో మంది తియ్యగా మాటలుచెప్పి అప్పు పట్టుకెడతారు; కాని ఎవ్వరూ సమయానికి తిరిగి యివ్వరు. ఎవరైనా యిస్తే మీకు సర్దడానికి నాకేమీ అభ్యంతరంలేదు. దొంగలు ఎవరూ యివ్వరుకదా !

కు : నన్ను మాత్రం అలా జమకట్టకండి! అటువంటి పని నేనెప్పుడూ చేయను. లేనివాళ్ళమే అయినా, ఇతరులను మోసం చేయడం నాకు చేతకాదు. మీ డబ్బు మీకు. ఒకటవ తేదీన తిరిగియిచ్చి వేస్తాను ; కనికరించండి.

వ : మీ విషయం నాకు తెలియదూ ? కాని ఏంచేయను చెప్పండి; చేతిలో చిల్లి గవ్వ లేదు. ఇంతగా మీరు ప్రాధేయ పడుతున్నారు గనుక—మీ కొక ఉపాయం చెబుతాను. కిట్టూపిళ్ళైను మీరు ఎరుగుదురుగా ? ఆయనగారిని కలుసుకోండి. మీ పని సానుకూలపడుతుంది.

కు : సరే, వస్తాను, కలవిప్పించండి.

(వెళ్ళిపోతాడు.)

వ : ఇదుగో ! నిన్నే ! కొంచెం మంచినీళ్లు తీసుకురా ! పనిలేనివాళ్ళతో మాట్లాడేప్పటికి కంఠశోషకూడా వచ్చింది.

అ : ఇప్పుడే తెస్తానుండండి.

వ : అదుగో, కిట్టుపిళ్ళై వస్తున్నారు ... రండి రండి ! మిమ్మల్నిగురించే అనుకుంటున్నా.

కి : నేను రానని అనుకోవడం లేదుకదా ?

వ : అబ్బే, అలా ఎందుకనుకుంటాను ?

అ : మీ విషయంలో అలా అనుకోవడం ఎప్పటికీ జరగదు. ఈయన మిమ్మల్ని నమ్మినంతగా ఎవరినీ నమ్మరు. నన్ను కూడా నమ్మరు.

వ : నువ్వు కావడానికి నా భార్యవే అయినా—స్త్రీవి కదా ! మగవాళ్ళు మగవాళ్ళే !

కి : అవునవును ! ఆఁ...కొంచెం తొందరలో వున్నాను. వందకదండీ ! ఇదుగో నోటు ! లెక్కపెట్టుకోవలసిన అవసరం కూడాలేదు.

వ : ఆఁ, ఇదుగోండి—మీ ప్రామిసరీ నోటు!

కి : రెడీగా వుంచినట్టున్నారే !

వ : ఇవాళ్ళ ఇరవయి ఎనిమిదో తారీఖు కదండీ ! అందుకని రెడీగానే వున్నాను.

కి : చివరకు నేను నా మాట నిలబెట్టుకున్నా నంటారా ? లేదా ?

వ : లేదని ఎలా అంటానండీ ? ఇప్పుడే కుర్యన్ మాష్టరువచ్చి వెళ్ళాడు. కళ్ళ నీళ్ల పర్యంతం పెట్టుకున్నాడు—కష్టదశలో వున్నానన్నాడు. పిల్లలకు తిండి లేదన్నాడు — అయినా నేనుమాత్రం జాలి వహించలేదు. వెళ్ళిపొమ్మన్నాను. వెళ్ళిపొయ్యాడు.

కి : అవును మరి, మీకు ఏ మనిషి ఎటువంటి వాడయినదీ బాగా తెలుసు !

వ: ఏమండీ ! ఇంకేమైనా డబ్బుకావాలా ?

కి: అడగడానికే మనస్సు ఒప్పడంలేదు. మీ అన్నగారి అబ్బాయివుత్తరంరాశాడు. వెయ్యిరూపాయలు టెలిగ్రాం మని ఆర్డరుద్వారా పంపించమన్నాడు. స్థలం కొంటున్నాడట ! అడ్వాన్సు యివ్వాలట! ఏం చేయాలో తోచకుండావున్నది.

వ: ఎంతకావాలో చెప్పండి. ఎందుకు సందేహిస్తారు ? —

కి: 750 రూపాయలు కావాలండీ ! రేపు యిచ్చేస్తానండీ.

వ: ఒక్కరోజుకేనా ఈ పైకం ?

కి: అవునండీ, రేపుదయం పదిగంటలకు 750 రూపాయలకు బదులు ఎనిమిది వందలు తిరిగియిచ్చి వేస్తాను.

వ: అంటే వడ్డీ ఏభైరూపాయలా !

కి: అవునండీ ! అవసరం కదండీ ! ఏభై రూపాయలదేముంది చెప్పండి ?

వ: అయితే యిస్తాను వుండండి.

కి: కొంచెంతొందరగా యిచ్చిపంపించండి. యింకా నోటు ఎందుకులెండి. అనవసరంగా రెవెన్యూబిళ్ళకూడా నష్టం !

వ: అలాగే, అలాగే. మీరంటే నాకెంతో నమ్మకముంది. రేపు యిచ్చేస్తారు కదూ ? అవును స్టాంపుకూడా ఎందుకు?

అనవసరపు ఖర్చు? ఇలా లోపలికి రండి, యిస్తాను! ఎవరికీ చెప్పకండి.

### 3.

వ : కిట్టూపిళ్ళై పదిగంటలకు వస్తానన్నాడు. కాని యింతవరకూ రానేలేదు.

అ : అవునవును! రాలేదెందుకో?

వ : నాలుగు గంటలయింది. ఇంకా ఆ "నిజాయితీ పరుడు" పత్తా లేదు.

అ : ఏ మొచ్చిందో లెండి! మీరుకొంచెం ఎంగిలిపడండి. ఇంతవరకు ఏమీ తీసుకో లేదు, ఇలా కడుపుమాడ్చుకొంటే జరిగే దేమిటి?

వ : నీకెప్పుడూ తిండిగొడవే! నేను నోటు కూడా రాయించుకోలేదు...అతను మోసం చేయడనుకో...అయినా...

అ : అబ్బే! ఆయన చాలా మంచివాడండీ!

వ : అయినా నోటు రాయించుకోవలసింది. పొరపాటు చేశాను.

అ : మరిలా విచారించి లాభమేమిటి చెప్పండి? నలుగురూ వింటే ఏమంటారు!

వ : ఏమంటారంటావు?

అ : వడ్డీ వ్యాపారంతప్ప మరొక ధ్యాస వుండదంటారు.

వ : అనుకుంటే అనుకోనివ్వు! నాదేం పోయింది?...ఒకటికాదు, రెండుకాదు.. ఏడువందల ఏభై రూపాయలు! ఇంకొకరితో ఏమని చెప్పుకోను?

అ : ఎందుకో కుర్యన్ మాష్టరు మళ్ళా వస్తున్నాడు.

వ : నువ్వేమీ మాట్లాడకు (కుర్యన్ ప్రవేశిస్తాడు).

వ : రండి మాష్టరుగారూ! రండి! ఏమిటి సంగతులు?

కు : మీరు చెప్పినట్టు రాత్రే కిట్టుపిళ్ళైను కలుసుకున్నానండి. కాని —

వ : ఆఁ...కాని...

కు : ఉంగరం తాకట్టుపెట్టి డబ్బు తీసుకున్నానండి. తీరా యివ్వాళ యిద్దామని వెడితే మనిషే కన్పించలేదు.

వ : ఎక్కడికి వెళ్ళాడంటావు?

కు : ఏమో? ఎక్కడ చూసినా కన్పించలేదు.

వ : అతనితో నాకుకూడా చాలా అర్జంటు పని వున్నదే!

కు : ఇద్దరు ముగ్గుర్ని మోసంచేసి వెళ్ళిపోయాడని అంటున్నారు!

వ : ఏమిటి? మోసం చేశాడా?

కు : అవునండీ, అందరూ యిదే మాట అంటున్నారు. రాత్రే వెళ్ళిపోయి వుంటాడని ఎవరో అన్నారు. మీ కేమైనా యివ్వాలా?

వ : ఏం చెప్పమంటారు? ఒకటికాదు, రెండుకాదు ఏడువందల ఏభై రూపాయలు తీసుకున్నాడు —

కు : అందుకే కాబోలు — జనం రకరకాలుగా చెప్పుకొని నవ్వుకుంటున్నారు. వడ్డీ వ్యాపారస్తుణ్ణి నిజాయితీకి పేరు మోసిన కిట్టూ పిళ్ళై బాగా మోసం చేశాడని అనుకుంటున్నారు!

అ : ఆడదానవు, నీకేం తెలుసు లెమ్మని, ఆరోజున నన్ను కసిరికొట్టారే! ఇప్పుడేమయిందంటారు? ఎంత మోసం! నిలకడమీదకాని నిజం తెలిసిరాలేదు.

వ : (బొంగురు గొంతుతో) కిట్టూ! ఎంత పని చేశావయ్యా! మంచివాడవనుకున్నాను! చివరకు నా కొంప ముంచావు... కొంచెం మంచినీళ్ళు తీసుకరా...

కు : ఏమండోయ్ వదినెగారూ! మంచినీళ్ళు అట తీసుకరండి. మంచినీళ్ళతోపాటు డబ్బులుకూడా తీసుకరండి. ✻

---

(17 వ పేజీ తరువాయి)

మునుపు పద్మవ్యూహమునజొచ్చు నభిమన్యు
దలపించు శౌర్యము గల జవాను
ప్రాణేశ్వరిని వీడి బవరానికే తెంచు
నా బాలచంద్రు నీడగు జవాను
గజగజ లాడించు గడ్డ కట్టిన మంచు
లెక్కింపకుండ నిల్చిన జవాను
సంఖ్యా బలమ్మున్న శత్రు సైన్యాలకు
జంకక ముందుకు చను జవాను
కలరు మన సరిహద్దు రక్షణము సేయ
నచల దీక్షను బూను సైన్యమ్ము నందు;
ఒక్కొ‌క్కరొక్కరి సాహస మక్కజంబు
గొలుపు జగమెల్ల కీర్తి కాంతులు వెలుంగ.

కంఠమందలి మౌక్తికపు హారము నొసంగ
నుబలాట పడుచున్న యువతు లిరుగొ
కరకంజముల గల గలలాడు బంగారు
గాజుల జత లిచ్చు కాంతలిరుగొ
పరిణయ చిహ్నగా ధరియించు నంగుళీ
యకము లీయగ వచ్చు నతివలిరుగొ
చెక్కులపై కాంతి చిందిచు కర్ణ భూ
షణము లోసంగెడు చానలిరుగొ
ధర్మ మార్గమ్ము వీడి యుత్తరపు హద్దు
మీరి వచ్చిన రిపు సేనఁబారద్రోల
భావి సౌఖ్యాలు గౌరవ ప్రదపు బ్రతుకు
భారతీయుల కొన గూర్చు వ్రతము తోడ. ★

# సర్వసన్నద్ధమవుతున్న మనదేశం

మన దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడి 1963 ఏప్రిల్ ముగింపు నాటికి అర్ధ సంవత్సరం గడిచింది. ఈ ఆరు నెలలలో అనేక విషయాలు జరిగాయి. భారతదేశం నేఫా, లఢక్ సరిహద్దులలో పరాజయాలకు గురికావలసి వచ్చింది. చైనా వారు ఏకపక్షంగా యుద్ధ విరమణనూ, సైనిక దళాల ఉపసంహరణనూ ప్రకటించారు. కొలంబో రాజ్యాలు సమావేశమై కొన్ని ప్రతిపాదనలు చేశాయి. భారతదేశం వాటిని ఆమోదించగా చైనా ఆమోదించలేదు.

ఈ కాలంలోనే 'చైనా, పాకిస్తాన్‌ల మధ్య సరిహద్దు ఒప్పందం జరిగింది.' ఈ ఒప్పందంలో ఈ ఉభయ ప్రభుత్వాలు భారత దేశానికి చెందిన భూ భాగం విషయంలో లావాదేవీలకు దిగడం జరిగింది. కాగా దీనిపట్ల భారత ప్రభుత్వం తన తీవ్ర అధిక్షేపణను భద్రతా సమితికి చైనా, పాకిస్తాన్ ప్రభుత్వాలకూ తెలియ జేసింది.

దేశంలో అత్యవసర పరిస్థితి ఏర్పడిన ఈ ఆరు మాసాల్లో సైనికంగా, రాజకీయంగానే గాకుండా ఆర్థిక రంగాలలో కూడా అనేక అభివృద్ధికరమైన మార్పులు వచ్చాయి. ఇప్పటికి పరిస్థితి ఎలా వుందంటే యుద్ధం ఆగిపోయినప్పటికీ భవిష్యత్తులో ఏర్పడగల ఎట్టి పరిస్థితినైనా గట్టిగా ఎదుర్కోడానికి దేశం సర్వసన్నద్ధంగా వుండాలి.

చైనావారి మిత్రద్రోహంవల్ల, విశ్వాస ఘాతకంవల్ల మన దేశ సరిహద్దులను పరిరక్షించడానికి, ప్రాదేశిక సమగ్రతను కాపాడడానికి మనంతీసుకున్న నిశ్చయం మరింత గట్టిపడడం మాత్రమే జరిగింది. దేశరక్షణకృషి నిరాఘాటంగా కొనసాగాలి. చైనీయుల దురాక్రమణ ప్రమాదం ఎంతకాలంవరకు వుంటుందో ఎవ్వరం చెప్పలేము. అయితే దేశ స్వాతంత్ర్య పరిరక్షణకు మన సన్నాహాలు స్వల్పకాలిక లక్ష్యంగా జరగరాదు.

చైనా ప్రభుత్వ వైఖరి మన ఈ కృషిని తీవ్రతరం చేసేదిగానే వుంది. ఈ ఒక్క అంశాన్ని పురస్కరించుకునే అత్యవసర పరిస్థితి ఏర్పడిన గత ఆరు నెలల్లో విభిన్నచర్యలు గైకొనబడినాయి. ఈ చర్యలన్నీకూడా జాతిని సమాయత్త పరచడానికి సమూహికంగా తోడ్పడగల నిశ్చయమైన, నిర్మాణాత్మకమైన కృషిని ప్రజలు, విభిన్న ప్రభుత్వసంస్థలు సాగించడానికి వీలుగా పెక్కు రంగాలను ఏర్పరుస్తూ పరస్పర సంబంధం కలిగి వున్నాయనే విషయం గమనార్హం.

## సమైక్యత

మన దేశ సరిహద్దులు ఉన్నత పర్వత శ్రేణులగుండా, ఎడారులగుండా కొన్ని కొన్నిచోట్లలో జనసంఖ్య అధికంగా వుండే ప్రదేశాలగుండా విస్తృతమైన ప్రాంతాలతో వున్నాయి. కనుక సరిహద్దు రక్షణ పటిష్ఠంగా వుండటానికి ఇతోధిక సైనికశక్తి, మంచి రవాణా సౌకర్యాలుమాత్రమే గాకుండా సరిహద్దు ప్రాంతాలలోని ప్రజలలో భావ సమైక్యతను సాధించడానికి గట్టికృషి జరగడం కూడా అవసరమే. అస్సాంరాష్ట్రం నాగా భూమి నేఫాసరిహద్దుల పొడవునా ఉత్తర, ఈశాన్య దిశలలో చైనానూ, తూర్పున బర్మానూ ఆనుకొనివుంది. పాకిస్తాన్‌తో కూడా దీనికి సరిహద్దువుంది. అందుచేత దేశంలోని బహుశ ఇతర ప్రాంతాలలో కంటే అస్సాంలో జాతీయ సమైక్యత బృహత్సమస్యగావుంది.

విదేశాలతో సరిహద్దులున్న మన రాష్ట్రాలు ఇవి: పశ్చిమ బెంగాలు పాకిస్తాన్, సిక్కిం, భూటాన్ సరిహద్దులను ఆనుకొనివుంది. కాగా సిక్కిం, భూటాన్‌ల రక్షణవిషయంలో భారతదేశానికి కొంత బాధ్యత వుంది. బీహారు నేపాలు సరిహద్దులనూ, ఉత్తర్‌ప్రదేశ్ నేపాలు చైనా సరిహద్దులనూ, పంజాబు చైనా, పాకిస్తాన్ సరిహద్దులనూ, హిమాచల్ ప్రదేశ్ చైనా సరిహద్దులనూ, జమ్మూ, కాశ్మీర్ పాకిస్తాన్, చైనాసరిహద్దులనూ, రాజస్తాన్, గుజరాత్‌లు పాకిస్థాన్

సరిహద్దులనూ ఆనుకొని వున్నాయి. కాబట్టి ఈ సమస్యయొక్క కేవలం భౌతిక అంశమే ప్రస్తుతానికి సైనిక కార్యకలాపాలలో స్తబ్దత వున్నప్పటికీ అప్రమత్తతతో వుండాలనే విషయాన్ని ప్రజలు గుర్తించేట్లు చేస్తున్నది. సరిహద్దు ప్రాంతాలలో నివసించే ప్రజలలో, నేఫా, హిమాచల్ ప్రదేశ్ లలోని నిరాడంబరులైన గిరిజనులు, కిన్నార్లు మొదలుకొని అస్సాం, పశ్చిమ బెంగాలు, పంజాబు, రాజస్థాన్, గుజరాత్ సరిహద్దు మైదానాలలోని రాజకీయ చైతన్యంగల ప్రజలవరకు అనేక రకాలవారున్నారు. ఈ ప్రజలలో భావ సమైక్యతను సాధించడం అత్యావశ్యకం. ఈ కృషి నిరంతరం కొనసాగాలి.

## బేషరతుగా సహాయం

ఈ ఆరునెలల కాలంలో భారతదేశం తన మిత్రదేశాలేవో తెలుసుకొనగలిగింది. ప్రపంచంలోని పెక్కు దేశాలు చైనా దురాక్రమణను ఖండించడం, భారత దేశానికి మద్దతు నివ్వడం జరిగింది. అనేక దేశాలు ముఖ్యంగా అమెరికా, ఇంగ్లాండు మనకు సైనిక సహాయం చేయడానికి ముందుకు వచ్చాయి. దేశ స్వాతంత్ర్య పరిరక్షణార్థం మనం ఈ సహాయాన్ని స్వీకరించాం. దురాక్రమణదారుని ప్రతిఘటించడానికి స్వయంగా సన్నద్ధుల మవుతున్నాం. మనకు విదేశాల నుంచి అందిన సహాయం బేషరతుగానే లభించింది. కాబట్టి ఈ సహాయాన్ని మనం స్వీకరించడంవల్ల మన అలీన విధానానికి ఎట్టి భంగం వుండదు.

ఇక పోతే సైనికరంగం విషయం. జాతీయ రక్షణ దళాలను పటిష్ఠ మొనర్చే కృషి తీవ్రంగా కొనసాగుతున్నది. ఇది నిరాటంకంగా కొనసాగవలసిందే. ఎందుచేతనంటే చైనాతోగల సరిహద్దు వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించడానికి కొలంబో రాజ్యాలవారు అంతర్జాతీయ స్థాయిలో చేసిన ఏకైక ప్రయత్నం దురాక్రమణదారునికి ఆమోదయోగ్యం కాలేదు. వారు రెండు షరతులు పేర్కొన్నారు. అవేమిటంటే:

(1) చైనా దళాలు 20 కిలో మీటర్లు ఉపసంహరించుకోవడంవల్ల ఏర్పడే నిస్సైనీకరణ మండలాలు చైనా పౌర గస్తీ కేంద్రాల నిర్వహణలోమాత్రమే వుండాలని చైనా ప్రభుత్వం కోరుతున్నది. ఇది కొలంబో రాజ్యాలు చేసిన ప్రతిపాదనలకు విరుద్ధం. నిస్సైనీకరణ మండలాలు ఇండియా, చైనా పౌరగస్తీ కేంద్రాల సంయుక్త నిర్వహణ క్రింద వుండాలని ఈ రాజ్యాలు సూచించాయి.

(ii) తూర్పురంగంలో నేఫాలో చైనా దళాలు ఖాళీచేసిన ప్రాంతాలలో భారత సైనిక దళాలు ప్రవేశించరాదని చైనాప్రభుత్వం కోరింది. తాగ్లా కనుమ, లాంగ్జూ ప్రాంతాలు మినహా మెక్ మోహన్ రేఖవరకూ భారత సాయుధ దళాలు వెళ్లవచ్చని కొలంబో రాజ్యాలు ప్రతిపాదించాయి.

కొలంబో రాజ్యాల ప్రతిపాదనలను చైనా ఏకమొత్తంగా ఆమోదించేపర్యంతం సంప్రదింపుల ప్రసక్తిలేదని భారత ప్రభుత్వం తెలిపింది. కాగా ఆత్మరక్షణకై చర్యలు గైకొనే హక్కు తమకుందని చైనా ప్రకటించింది.

"ఆత్మరక్షణ" పేరిట చైనా లోగడ మన దేశంపై వచ్చి దురాక్రమణ జరిపింది. ఇది మనకొక గుణపాఠం. కనుక దేశం సైనికంగా సన్నద్ధం కావలసిన అవసరాన్నిగూర్చి, ప్రజలు త్యాగాలు చేయవలసిన ఆవశ్యకతనుగూర్చి వేరుగా చెప్పనవసరంలేదు.

## రక్షణకృషిలో ప్రణాళిక అంతర్భాగం

దేశ ఆర్థికస్థితిని పటిష్ఠమొనర్చడానికి అనేక చర్యలు గైకొన్నారు. ఇవి జాతిని సమాయత్తపరచడానికి నేరుగా తోడ్పడతాయి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని దిగువ పేర్కొనబడినాయి:

రక్షణ కృషిలో అతి ప్రధానమైన భాగంగా పంచవర్ష ప్రణాళిక పరిగణింపబడింది. అత్యవసర పరిస్థితి ఫలితంగా ప్రణాళికకు పెద్దదెబ్బ తగులుతుందనే భయసంశయాలు తొలగించబడినాయి. దేశ అభివృద్ధి ప్రణాళికలు "జాతీయ రక్షణకృషిలో అంతర్భాగాల" ని జాతీయాభివృద్ధి మండలి ప్రకటించింది. అభివృద్ధి ప్రణాళికలలో 85 శాతం రక్షణ కృషిలో అతిప్రధానమైన భాగాలనీ, పోతే మిగతా 15 శాతం ప్రణాళికలుకూడా పరోక్షంగా దీనికి సంబంధించినవేననీ లేదా దీనిలో భాగాలేననీ జాతీయాభివృద్ధి మండలి సమావేశంలో ప్రసంగిస్తూ ప్రధానమంత్రి అన్నారు. ఈ కారణంగా ప్రణాళికను త్యాగం చేయడం కాక ప్రణాళికాలక్ష్యాలను నిర్ణీత గడువులోగా సాధించడానికే కృషి జరుగుతున్నది. అనేక రంగాలలో గమనార్హమైన ఫలితాలు సాధించారు. ప్రతి చిన్న పెద్ద ప్రణాళికా పథకంలోనూ ప్రజలు ఉత్సా

హంగా పాల్గొని తమ శక్తికొలది తోడ్పడినట్లయితే అది జాతిని సన్నద్ధం చేయడంలో ఎంతో ఉపకరిస్తుంది.

ధరల పెరుగుదలను అరికట్టడం మరో ముఖ్యమైనపని. యుద్ధాలవల్ల సాధారణంగా వాటితో ప్రత్యక్షంగా సంబంధం వున్న దేశాలలో ద్రవ్యోల్బణ పరిస్థితి ఏర్పడుతుంటుంది. కాగా భారీఎత్తున జరిగే యుద్ధాలవల్ల వాటితో ప్రత్యక్షంగా సంబంధంలేని దేశాలలోకూడా ధరలు పెరిగిపోతాయి. అయితే మనదేశంలో అత్యవసర పరిస్థితిలో ధరలు బాగా నిలకడగా వున్నాయి. 1962 నవంబరునుంచి గోధుమ ధరల అఖిలభారత సూచీ సంఖ్యలో గమనార్హమైన తగ్గుదల ఏర్పడింది. 1962 జనవరిలో అఖిల భారత సూచీ 98 పాయింట్లను సూచించగా 1963 జనవరిలో 88 పాయింట్లను సూచించింది. (ప్రాతిపదిక 1952 - 53 = 100) సజ్జ, మొక్కజొన్న, బార్లీ, రాగులు మొదలైన ఇతర ఆహారపదార్థాల ధరలు మామూలుగానే 1961 వ సం॥లో కంటే 1962 వ సంవత్సరంలో తక్కువగా వున్నాయి. ఒక్క బియ్యంవిషయంలో మాత్రమే 1962 లో 1961 కంటే ధరలు అధికంగా వున్నాయి. దేశ ఆర్థికవ్యవస్థ సౌష్ఠవమైన పునాదిపై నిలవాలంటే ధరలను అదుపులో పెట్టాలనే లక్ష్యం దీర్ఘకాలికమైనదిగా వుండాలి. అత్యవసర పరిస్థితిలోనేగాకుండా అన్ని సమయాల్లోనూ, ఇది ధ్యేయంగా వుండాలి. ముఖ్యంగా ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చెందడానికి ఉపక్రమించిన దేశాలలో ఇది చాలా అవసరం.

## ఇతోధిక ఉత్పత్తులు

ఉత్పత్తిరంగంలో కూడా గమనార్హమైన ఫలితాలు సాధించారు. అత్యవసర పరిస్థితి ప్రకటించబడిన తొలి రోజులలో ప్రభుత్వం చేసిన పారిశ్రామిక శాంతి తీర్మానం ఇంకా ఇతర చర్యల ఫలితంగా ఫ్యాక్టరీలలో పనిరోజుల నష్టం గమనించదగినంతగా తగ్గిపోయింది. 1962 జనవరి-అక్టోబరు మధ్యకాలంలో పనిరోజుల నష్టానికి సంబంధించిన అఖిలభారత స్థాయి నెలసరి సగటు సంఖ్య 4.7 లక్షలుకాగా నవంబరు, డిశంబరు నెలలకు సంబంధించిన తాత్కాలిక సంఖ్యలు 70,000, 19,000. మూలాధార వస్తువుల ఉత్పత్తిలోకూడా పెరుగుదల ఏర్పడింది. ఉదాహరణకు ఉక్కు 1961-62 వ సం॥లో 4.1 మిలియన్ టన్నులు ఉత్పత్తి కాగా 1962-63 వ సం॥లో 4.8 మిలియన్ టన్నులు ఉత్పత్తి అయింది.

నిర్మాణాత్మకమైన మార్గాలలో ప్రజోత్సాహాన్ని వినియోగించుకోవడానికి అనేక చర్యలు తీసుకున్నారు. చైనా దురాక్రమణను ఎదుర్కోడానికి జాతి యావత్తూ ఏకోన్ముఖంగా సన్నద్ధంకావడమే జాతీయైక్యతకు చక్కని తార్కాణం. జాతీయ సమైక్యతా సంఘంవారు దీనిని గమనించి ప్రస్తుతానికి తమ చర్చా కార్యక్రమాలను విరమించుకున్నారు. "ఈ విపత్కర పరిస్థితివల్ల ప్రజలు తమ సంకుచిత భావాలన్నింటికీ వెంటనే స్వస్తి చెప్పగలిగా" రని ఈ సంఘం ప్రకటించింది.

దేశప్రజలు చూపిన అమోఘమైన ఐక్యత పట్ల ప్రపంచమంతటా హర్షం ప్రకటించారు. చైనీయుల దురాక్రమణచర్యలను ప్రతిఘటించడానికి బహుశా ఇది కారణమైందేమోకూడా. ఈ సమైక్యతవల్ల దేశంలో ప్రభుత్వం నిర్వహించవలసిన బాధ్యతలభారం కొంత తగ్గింది. అయితే జాతీయ సమైక్యతాభావం ఎట్టి కృషి లేకుండా ఎల్లప్పటికీ ఈ విధంగానే నిలిచి వుంటుందనుకోరాదు. విపత్కర పరిస్థితిలో జాతి ప్రదర్శించిన ఈ ఉత్సాహం, ప్రజలలో సమైక్యతాభావాన్ని దృఢతరంచేసి, విపత్కర పరిస్థితి అనంతరం కూడా ప్రజలు జాతీయ దృక్పథంతో వ్యవహరించేట్లు చేయడానికి ప్రభుత్వానికి ప్రజలకుకూడా గొప్ప అవకాశం కల్పించిందని జాతీయ సమైక్యతా సంఘం వెల్లడించింది. ప్రజలు సమైక్యతాభావాన్ని ఎల్లప్పుడూ కలిగివుండాలి. దేశానికి అండగా నిలువడానికి సమైక్యతతో కృషి చేయడానికి వారు సిద్ధంగా వుండాలి. ఈ విషయంలో వారు తమ పాత్ర నిర్వహించడానికి అనేక పథకాలు అవకాశం లభింపజేస్తాయి. వీటిలో కొన్నిటినిగురించి దిగువ పేర్కొనబడింది:

హోంగార్డులు—పౌరరక్షణలో ప్రథమ శ్రేణిలోనివారు. పదిలక్షలమంది హోంగార్డులను సిద్ధంచేయడానికి ప్రతిపాదించారు. హోంగార్డుదళాలు, దేహదార్ఢ్యం గల వ్యక్తులు దేశంపట్ల తమకుగల బాధ్యతలను నిర్వహించడానికి అవకాశం కలుగజేస్తాయి.

గ్రామీణ ప్రాంతాలలో గ్రామీణ స్వచ్ఛంద సేవకదళం పథకాన్ని ప్రవేశపెట్టారు. ఉత్పత్తులను పెంపొందించడం, జనబాహుళ్యానికి విద్య గరపడం, పౌరరక్షణ చర్యలు గైకొనడం ఈ దళం లక్ష్యాలు. ఇంతేగాక ఈ పథకంక్రింద రక్షణ శ్రామిక బ్యాంకులను నెలకొల్పుతారు. దేహదార్ఢ్యంగల ప్రతి వయోజన వ్యక్తినుంచీ నెలలో కనీసం ఒకరోజు ఉచితంగా కాయకష్టం పొందడం లేదా దానికి బదులు రొక్కం విరాళం పొందడం

ప్రాతిపదికగా ఈ బ్యాంకులను స్థాపిస్తారు.

పారిశ్రామిక శాంతి తీర్మానంవల్ల ఉత్పత్తులను పెంచడానికి, పారిశ్రామిక సంస్థలు మూతపడి తత్ఫలితంగా ఉత్పత్తులు తగ్గడానికి దారితీసేటట్టి స్వల్ప వివాదాలను పరిష్కరించు కోవడానికి పారిశ్రామికవేత్తలకూ, ఉత్పత్తిదార్లకూ సంస్థల నిర్వాహకులకూ, కార్మికులకూ అవకాశం కలిగింది.

రైఫిల్ శిక్షణా పథకం, జాతీయ క్రమశిక్షణా పథకంద్వారా జాతీయ శక్తినీ, సామర్థ్యాన్నీ, క్రమశిక్షణనూ పెంపొందించదలిచారు. జాతీయ క్రమశిక్షణా పథకం గత కొంతకాలంనుంచే ఆచరణలోవుంది. ఇప్పుడు దీనిని పటిష్ఠం చేశారు. కొత్తగా శిక్షణా కేంద్రాలను తెరిచి వాటిలో వివిధ పాఠశాలలకు చెందిన ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తున్నారు. వీటిలో శిక్షణపొందిన ఉపాధ్యాయులు తరువాత తమ విద్యాసంస్థలకు చెందిన విద్యార్థులకు శిక్షణ గోరుపుతారు. 1963 వ సంవత్సరంలో ఈ పథకంక్రింద 10,000 మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వడానికి ప్రతిపాదించారు.

దేశరక్షణ కృషిలో తమ పాత్ర నిర్వహించడానికి ఎన్. సి. సి. ద్వారా విద్యార్థులకు అవకాశం కల్పించబడుతున్నది. ఎన్. సి. సి. ఇదివరకే బాగా అభివృద్ధి చెందింది. కాగా ఇప్పుడు దీనిని నిర్బంధం చేయడానికి తలపెట్టారు. కళాశాలల లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ కొత్త షూటింగ్ రేంజీలను నిర్మిస్తున్నారు. ఇందుకుగాను విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘంవారు, ప్రణాళికా సంఘంవారు వివిధ విద్యా సంస్థలకు గ్రాంట్లు ఇస్తున్నారు.

దేశవ్యాప్తంగా పౌర మండలులను నెలకొల్పి వాటిద్వారా మన ప్రజా స్వామిక సంప్రదాయాలకనుగుణ్యంగా యుద్ధసన్నద్ధ కృషిలో ప్రజలు నేరుగా పాల్గొనేట్లు చేస్తున్నారు. కేంద్ర పౌర మండలి ఆధ్వర్యంక్రింద ఇలాంటి పౌర మండలులు అన్ని రాష్ట్ర స్థాయిల లోనూ, అనేక జిల్లా స్థాయిలలోనూ పనిచేస్తున్నాయి. జాతీయ ప్రయోజనాల కనుగుణ్యంగా వ్యవహరించడానికి, ఆలోచన చేయడానికి, సలహాలివ్వడానికి ఇవి ప్రజానీకానికి అవకాశం కల్పిస్తాయి. ఇంతేగాక ఇవి అధికార్లు పౌరమండలులతో సన్నిహితంగా కలిసిమెలిసి పని చేస్తారుకాబట్టి ప్రభుత్వకృషికి విస్తృత ప్రాతిపదికపై ప్రజలలో ప్రాచుర్యం లభింపజేయ గలుగుతాయి.

దేశప్రజలను సర్వసన్నద్ధులను చేయడానికి పైన పేర్కొన్న అనేక నిర్మాణాత్మక కార్యకలాపాలలో పాల్గొనడంతోపాటు, పెరుగుతోన్న రక్షణావసరాలను ఆదుకోవడానికి వీలుగా ప్రభుత్వానికి బ్రహ్మాండమైన వనరులను సృష్టించడంకూడా అవసరమే. ఇప్పటికి ప్రారంభించిన పథకాలలో జాతీయ రక్షణనిధి, మొత్తాల పొదుపుకు ఉద్దేశించిన వివిధ పథకాలు స్వచ్ఛందమైనవి. కాగా కొత్త పన్నులు, బంగారం కంట్రోలు ఉత్తర్వు మొదలైనవి నిర్బంధమైనవి. స్వచ్ఛందమైనవైనా, నిర్బంధమైనవైనా ఈ పథకాలన్నీకూడా అత్యావశ్యకమైన కార్యకలాపాలు నిరాటంకంగా కొనసాగడానికి వీలుగా జాతీయ వనరులను పెంపొందించడాన్నే ప్రధానంగా లక్షిస్తున్నాయి.



# కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 మార్చిలో దిగువ తెల్పిన గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పడం జరిగింది.

నిజామాబాదు జిల్లా జైలు, అచ్చంపేట, (నిజామాబాదు జిల్లా), ఫతేపూరు, బండనాగారం, ధర్మసాగరం, (వరంగల్లు జిల్లా). చండూరు, మాసనపల్లి, వస్తకొండూరు, (నల్లగొండ జిల్లా)

# మహోదయం

"కమ్మిశెట్టి"

ఈ మహా ప్రభాత వేళ
ఈ శుభ ప్రభాత వేళ
పొంగి పొరలు నా యెడంద
ఆనందోద్విగ్న హేల

నా మనస్సులో ఇంద్ర ధ
నుస్సు విరిసి మెరుస్తోంది
నా శిరాన శుభాశీః ప్ర
సూన వృష్టి కురుస్తోంది

హృదయ విపంచీ తంత్రిక
ఝుమ్మని రవళిస్తున్నది
ప్రాయం నాగీతికి సం
గీతం జోడిస్తున్నది.

గగన భామినీముఖాన
తెలి మబ్బుల చిరునవ్వులు
భూనందన వాటికలో
నెత్తావుల క్రొంబువ్వులు

ఆనందం ఎందులకని
అడుగుతావు ఎవరునీవు ?
వెన్నెల తెలియదా నీకు!
పరిమళ మెరుగవా నీవు !!

గిలిగింతలు పెట్టే ఈ
సురభిళ పవనాల నడుగు
స్వర్ణ ఘాళి చల్లే ఉద
యారుణ కిరణాల నడుగు

మనసులోను వికసించిన
మధుర కళా జగతినడుగు
నా చుట్టూ పరచుకున్న
రమణీయ ప్రకృతి నడుగు

హిమాహార్య శృంగంలా
నిల్చిన నా దేహంలో
ఆనందోన్మాదంలో
అరమోడ్చిన అక్షులలో

నా పునీత మాతృభూమి
మహస్సు బింబిస్తున్నది
నాలో పొంగిన గర్వం
నభస్సు చుంబిస్తున్నది

సస్య శ్యామలమై, కను
విందు చేయు మాగాణులు
నింగినంట తలలెత్తిన
తుంగ పర్వత శ్రేణులు

నృత్యగాన రవళులతో
స్రవించే నదీ నదాలు
పంటలతో పశువులతో
పొలుపారే జనపదాలు

విశాలమై పరచుకొన్న
అడవులు, వనాలు, తోటలు
పలుపలు రకాల పిట్టలు
పాడే తీయనిపాటలు

చిరు గాలుల తాకిడికే
కిలకిల నవ్వే పాపలు
కరకంకణ క్రమరవళి
కలకల లాడే వెలదులు

కర్మ వీరులై సాగే
కార్మికులూ, కర్షకులూ
తేజః కిరణాలై దీ
పించే యువతీ యువకులు

ఘూంకార ధ్వనితో పొగ
లెగజిమ్మే ఫ్యాక్టరీలు
ముంగిటిలో పెన్నిధులై
దీపించే ప్రాజెక్టులు

విరిసిన విద్యాలయాలు
విజ్ఞాన నికేతనాలు
పురోగమన ధ్యేయానికి
ఎగరేసిన కేతనాలు

సర్వతో ముఖాభ్యున్నతి
ఆసించే ఉద్యమాలు
మరో నవ్యలోకానికి
ప్రణాళికల కాంతిమెట్లు

కార్యదీక్ష చిత్తశుద్ధి
గమ్యానికి రాచబాట
ఏకీకృత సంఘశక్తి
మాగళాల మ్రోగు పాట

రవితేజము నెంతసేపు
అడ్డగలవు కార్మొయిళ్లు ?
ఎగసి దూకు జలపాతము
నెవరెదిర్చి నిలువ గలరు ?

విశ్వ మహాకావ్యంలో
నాదేశం స్వర్ణగీతి
ఆలపింతు నిర్భర మో
దాశ్రులతో మధురరీతి

ఈ మహా ప్రభాత వేళ
ఈ శుభ ప్రభాత వేళ
పొంగి పొరలు నా యెడంద
ఆనందో ద్విగ్న హేల....



## నీటి పారుదల

1962-63 వ సం॥లో వరదనిరోధం, ఇంజనీరింగ్ పరిశోధనలతో సహా భారీ, మధ్యరకం నీటి పారుదల పథకాల అమలుకై రు. 431.00 లక్షలు కేటాయించారు.

1962-63 వ సం॥ వార్షిక ప్రణాళికలో చేర్చబడిన కొన్ని ముఖ్యమైన పథకాల అమలులో సాధించిన అభివృద్ధినిగూర్చి దిగువ ఇవ్వబడింది.

*టి. బి. పి. హెచ్. యల్. సి. పథకాలు* (మొదటిదశ) రు. 18 కోట్లు.

1959 వ సం॥లో యీ పథకం అమలును చేపట్టడం జరిగింది. ఇది అభివృద్ధి దశలో ఉంది.

1125.00 స్థాయివరకు డాం నిర్మాణం జరిగింది. 1125.00 పైన పని చురుకుగా కొనసాగు తున్నది. మధ్యపెన్నార్ దక్షిణం కాలువ పని 44వ మైలువరకు పూర్తిఅయింది. మధ్యపెన్నార్ ఉత్తరం కాలువ పనిదాదాపుపూర్తికావచ్చింది. ఉరువకొండ కట్ పనిని చేపట్టడం జరిగింది. యీ ప్రాజెక్టుక్రింద ఆంధ్రప్రదేశ్ లో 119115 ఎకరాల ఆయకట్టు సాగులోకి వస్తుంది. 1962-63 వ సం॥ ఆఖరువరకు రు. 560 లక్షలు ఖర్చుచేయడం జరిగింది.

1963-64 వ సం॥లో యీ పథకాల అమలుకై రు. 150.00 లక్షలు కేటాయించారు. యీ పనుల అమలు పురోభివృద్ధిని బట్టి అవసరమైతే అదనపు కేటాయింపులను గూర్చి ప్రభుత్వం పరిశీలించవచ్చు.

*కె. సి. కెనాల్:* ఖర్చు అంచనా... రు. 754 లక్షలు.

1954 వ సం॥లో యీ పథకం అమలును ప్రారంభించారు. కాలువల క్రాసింగ్ల మినహా అన్ని విషయాలలో యీ పథకం అమలు పూర్తిఅయింది. పంపిణీ కాలువలు, క్షేత్రం కాలువల పని చురుకుగా కొనసాగుతున్నది. యీ పథకం క్రింద మొత్తం 278000 ఎకరాల ఆయకట్టు సాగులోకి వస్తుంది. 1962-63 వ సం॥లో 168700 ఎకరాల ప్రాంతాన్ని అభివృద్ధిచేయడం జరిగింది. 1962-63 వ సం॥రం ఆఖరువరకు రు. 659 37 లక్షలు ఖర్చు చేశారు.

1963-64 వ సం॥లో యీ పథకం అమలు కొనసాగింపుకై రు. 15.00 లక్షలు కేటాయించారు.

*వంశధార ప్రాజెక్టు:* అంచనా ఖర్చు రు. 1360 లక్షలు. యీ పథకం అమలుకై కేంద్ర జల నీటి విద్యుచ్ఛక్తి కమీషన్ సాంకేతిక అనుమతి లభించాల్సి ఉంది. మంజూరీకి లోబడి నేరడి బ్యారేజి ప్రాథమిక పనులు కొనసాగిస్తున్నారు. పునాదులకై బావులు త్రవ్వకం, దక్షిణంవైపు ఎగువ స్థాయి కాలువల పనుల పరిశీలనా వివరాలు సేకరించేపనులు చురుకుగా కొనసాగుతున్నాయి. 1962-63 వసం॥ ఆఖరువరకు 8.30 లక్షలు ఖర్చుచేశారు. 1963-64 వ సంవత్సరంలో రు 1.00 లక్ష కేటాయించారు.

*రాజోలిబండ మళ్ళింపుపథకం:* ఖర్చు అంచనా 336 లక్షలు: కాలువ 70 వ మైలు వరకు నిర్మాణంపనులు పూర్తిఅయ్యాయి. మిగతాపని చురుకుగా కొనసాగుతున్నది. 50 వ మైలువరకు సాగుకై నీటి విడుదల చేయడం జరిగింది. దీనివల్ల 40,000 ఎకరాలకు సాగుకై నీరు లభిస్తుంది.

1963-64 వ సంవత్సరంలో ఈ పథకం అమలుపూర్తి అవుతుందని ఆశించబడుతున్నది. దీనికై రు 42.00 లక్షలు కేటాయించారు. 1962-63 వ సంవత్సరంలో రు. 201. 74 లక్షలు ఖర్చుచేశారు.

*మూసీ ప్రాజెక్టు:* అంచనా ఖర్చు రు. 282 లక్షలు: యీ ప్రాజెక్టుపని పూర్తికావచ్చింది. 1961 వ సంవత్సరంలో సాగుకు నీరు విడుదలచేశారు. 16000 ఎకరాల భూమిని అభివృద్ధిచేయడం జరిగింది. 1962-63 ఆఖరు వరకు యీ ప్రాజెక్టునిర్మాణానికై రు. 288.10 లక్షలు ఖర్చు చేశారు. మిగతాపనిపూర్తి చేయడానికై రు. 2.00 లక్షల మొత్తాన్ని కేటాయించారు.

*కడెం ప్రాజెక్టు:* 1958 ఆగస్టులో భారీ ఎత్తున వరదలు వచ్చిన కారణంగా ఆనకట్టలో కొంత భాగం గండిపడింది. దీని పునర్నిర్మాణానికై రు॥ 160 లక్షల అంచనా మొత్తాన్ని మంజూరు చేయడం జరిగింది. రిజర్వాయరు శక్తిని ఎక్కువ చేయడం భద్రతకై ఉన్నత ప్రమాణంలో ఏర్పాట్లు చేయడంతోసహా పునర్నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించారు. వరదగేట్ల నిర్మాణం మినహా పునర్నిర్మాణం పని పూర్తిఅయింది. 1962-63 వ సంవత్సరం ఆఖరువరకు యీ ప్రాజెక్టుపై రు॥ 738.83 లక్షలు ఖర్చుచేశారు. 1963-64 లో యీ పనులను పూర్తిచేయడానికై రు॥ 37.20 లక్షల కేటాయించారు.

*పోచంపాడు ప్రాజెక్టు:* అంచనా రు. 1481 లక్షలు : యీ పథకం అమలుకై కేంద్ర

**అభ్యుదయం**

జలవిద్యుచ్ఛక్తి కమీషన్ సాంకేతిక అను మతి లభించాల్సిఉంది యీ అనుమతికి లోబడి ఒక సర్కిల్‌ను ఏర్పాటుచేయడం జరిగింది. అప్రోచ్‌రోడ్లు, రెస్ట్‌హౌస్ క్యాంప్ భవనాలు మొదలైన ప్రాథమిక పనులు ప్రారంభించారు. సంపిణీ కాలువల సర్వే కార్యక్రమం చురుకుగా కొనసాగు తున్నది. కాఫర్‌డాం నిర్మాణం పని పూర్తి అయింది.

దిగువ పథకాల అమలు చురుకుగా కొనసాగుతున్నది.

(1) నారాయణపురం ఆనకట్ట, శ్రీకాకుళం జిల్లా.

(2) తొర్రిగడ్డ పంపింగ్ పథకం, తూర్పు గోదావరిజిల్లా.

(3) పోలేరు—బిట్రగుంట సరఫరా కాలువ, నెల్లూరుజిల్లా.

(4) పైడిగం ప్రాజెక్టు, శ్రీకాకుళంజిల్లా.

1963—64వ సం॥ ఆఖరువరకు యీ పథకాల అమలు పూర్తి అవుతుంది. వీటికి తోడు దిగువ తెల్పిన పథకాల అమలు కొన సాగుతున్నది. మూడవ పంచవర్ష ప్రణాళిక ఆఖరువరకు యివి పూర్తిఅవుతాయి.

1. జుర్రేరు ప్రాజెక్టు, కర్నూలుజిల్లా 2. కానుపూర్ కాలువ, నెల్లూరు జిల్లా 3.జూట్‌పల్లి, హైద్రాబాదుజిల్లా 4.లక్నాపూర్, హైద్రాబాదుజిల్లా 5. రామడుగుప్రాజెక్టు, నిజామాబాదుజిల్లా 6. కాలివాగుప్రాజెక్టు, వరంగల్లుజిల్లా. 7. స్వర్ణప్రాజెక్టు, ఆదిలా బాదుజిల్లా.

1963—64వ సం॥ లో వివిధ భారీ, మధ్యరకం పథకాలు, వరద నిరోధక పథకం, ఇంజనీరింగ్ పరిశోధనల అమ లుకై రు॥ 395.15 లక్షలు కేటాయించారు. యీ పనులను త్వరితగతిని పూర్తిచేయ డానికై అన్నివిధాల కృషిచేయడం జరుగు తున్నది.

## చిన్నతరహా నీటి పారుదల

మూడవ ప్రణాళికా కాలంలో చిన్నతరహా నీటి పారుదల పథకాల అమ లుకు అత్యంత ప్రాధాన్యం ఇవ్వబడింది. ముఖ్యంగా అత్యవసర పరిస్థితి కాలంలో త్వరితగతిని లక్ష్యాలను సాధించడానికి ప్రాముఖ్యం ఇవ్వబడుతున్నది. భారత ప్రభుత్వం రాష్ట్రాలకు లభింపచేసే మొత్తా లనుకూడా తుది సారిగా కేటాయించింది. చిన్నతరహా నీటి పారుదల సమీకృత కార్య క్రమాలకై రు 20 కోట్లు కేటాయించారు.

1961—62 వ సంవత్సరంలో రు 153 లక్షలు ఖర్చు చేశారు. 1962—63 వ సం॥ లో యీ కార్యక్రమంక్రింద మొత్తం రు 257.76 లక్షలు పూర్తిగా ఖర్చు చేయాల్సి ఉంది.

1963—64 వ సం॥ లో చిన్నతరహా నీటి పారుదల కార్యక్రమానికై రాష్ట్ర ప్రణా ళికలో ప్రభుత్వం రు 185.00 లక్షలు కేటా యించింది. అదనంగా రు 115 లక్షలు కేంద్ర సహాయం లభిస్తుంది. రాష్ట్ర కార్య క్రమంక్రింద వ్యవసాయ రంగానికి కేటా యించిన మొత్తం రు 417 లక్షల నుంచి 1963—64 సం॥ లో చిన్నతరహా నీటిపారు దల పథకాలకై పి. డబ్ల్యు. డి. కి రు 240 లక్షలు కేటాయించాలని 1963 ఫిబ్రవరి 13 వ తేదీన జరిగిన అధికారుల కమిటీ సమావేశంలో సూచించారు.

## విద్యుచ్ఛక్తి

1962 నవంబరులో ఆంధ్రలో 7 గ్రామా లకూ, తెలంగాణాలో 5 గ్రామాలకూ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం జరిగింది. డిసెంబరులో ఆంధ్రలో 9 గ్రామాలకూ, తెలంగాణాలో 10 గ్రామాలకూ విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది.

తెలంగాణా హైడ్రోథర్మల్ పథకంక్రింద నాగార్జునసాగర్ — హైద్రాబాదు సెక్షన్ లోని తాడేపల్లిలో హైద్రాబాదు 132 కె. వి. లైన్ పై టవర్ నిర్మాణం పూర్తి అయింది. కండెక్టర్ల బిగింపు పనిని డిసెంబరులో చేపట్టారు. తాడేపల్లి — నాగార్జునసాగర్ విభాగంలో స్టబ్‌ల అమర్చేపని చురుకుగా కొనసాగుతున్నది.

హుస్సేన్ సాగర్‌వద్ద బాయిలర్ హౌస్ నిర్మాణం చురుకుగా జరుగుతున్నది. దానికి సంబంధించిన పరికరాలు అందాయి.

నిర్మాణానికి సంబంధించిన పరిస్థితి డిసెంబరులో దిగువ విధంగా ఉంది :

(i) ఉక్కు స్ట్రక్చర్ స్థాపించబడింది.

(ii) డ్రమ్ములు సరి అయినస్థితిలో పెట్ట బడ్డాయి.

(iii) ఎకానమైజర్‌పని పూర్తి అయింది.

(iv) కొలిమిగదిలోనికి ట్యూబులను పంపే కొంతపని మినహా స్టోకర్‌పని పూర్తి అయింది.

నీరు తీసుకునే, నీరు వదిలే పనులు మినహా రామగుండమువద్దగల రెండవ కూలింగ్ టవర్ నిర్మాణంపని పూర్తి అయింది. 1,50,000 యల్.బి/హెచ్.ఆర్. బాయిలర్‌కు సంబంధించిన పరికరాల సరఫరా జరగాల్సి ఉంది.

ట్రాన్స్‌మిషన్ లైనులపై దిగువ విధంగా పనిజరిగింది.

(అ) తాడేపల్లి — హైద్రాబాదు 132 కె. వి లైన్, టవర్ నిర్మాణం, 36.91 మైళ్లు, కండక్టర్ల నిర్మాణం: 36.91 మైళ్ళు.

(ఆ) తాడేపల్లి — నాగార్జున సాగర్ 132 కె. వి. లైన్: త్రవ్వకం, 29; స్టబ్ అమర్చడం, కాంక్రీటింగ్, 41; మట్టి త్రవ్వకం 47; టవర్ల స్థాపన, 127.

*తుంగభద్ర పథకం :* డిసెంబరులో దిగువ పనులు జరిగాయి :

(అ) హంపి–గుత్తి 132 కె. వి. లైన్ : చెక్ సర్వే 20 మైళ్ళు; త్రవ్వకం 20 లాక్‌లు; స్టబ్ అమర్చడం 37 లాక్‌లు; కాంక్రీటింగ్ 37 లాక్‌లు;

(ఆ) గుత్తి - కడప 132 కె. వి లైన్ : త్రవ్వకం 50; సర్వే 54; స్టబ్ అమర్చడం, కాంక్రీటింగ్ 12.

ఈ పథకంక్రింద నిర్మించబడే సబ్‌స్టేషనుల ప్లానులు పూర్తి అయ్యాయి.

*కొత్తగూడెం థర్మల్ పథకం :* కొత్తగూడెం – వరంగల్లు 132 కె. వి. డి. సి. లైను, రామగుండం–వరంగల్లు 132, కె.వి. డి.సి లైనులపై ప్రాథమికపనులు చురుకుగా కొనసాగుతున్నాయి.

### పురావస్తుశాఖ కార్యక్రమాలు

1963 మార్చి నెలలో యీ శాఖా పరంగా దిగువ ప్రచురణలు వెలువడినాయి :

1. ఏలేశ్వరం త్రవ్వకాలు
   —శ్రీ మహమ్మద్ అబ్దుల్ వహీద్ ఖాన్.
2. ఆంధ్రలో జైన్ చిహ్నాలు
   —డాక్టర్ యస్. గోపాలకృష్ణమూర్తి.
3. విష్ణుకుండిని నాణాలు
   —డాక్టర్ యం. రామారావు.
4. తూర్పు చాళుక్యుల నాణాలు
   —డాక్టర్ యం. రామారావు.
5. అమరావతిలో లభించిన రంధ్రాలుగల వెండినాణాలు
   —డాక్టర్ పరమేశ్వరిలాల్‌గుప్త.
6. పురావస్తుశాఖ బులిటెన్ ii
   —డాక్టర్ పి. శ్రీనివాసాచారి.
7. సెలక్ట్ బంగారు, వెండి నాణాలు
   —డాక్టర్ యం. రామారావు.

వీటికితోడు వివిధ కళారీతులకు చెందిన 43 పెయింటింగులను రు. 14985/– లకు యీ శాఖ కొనుగోలు చేసింది. హైద్రాబాదులోని రాష్ట్ర పురావస్తు మ్యూజియంలోని సమకాలీన ఆర్ట్ గ్యాలరీలో వీటిని ఉంచారు. న్యూ ఢిల్లీ లోని నేషనల్ మ్యూజియంనుంచి, హరప్పా, మహెంజిదారోలకు చెందిన అపూర్వమైన కొన్ని పురాతన ప్లాస్టర్ వస్తువులనుకూడా కొనుగోలు చేయడం జరిగింది. మ్యూజియంలో వీటిని ఉచితరీతిగా అమర్చడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

4,5000 బి. సి. కాలానికి చెందిన వివిధ పురాతన వస్తువులకు చిహ్నాలైన పురాతన లిపికిచెందిన 20 చార్టులనూ, ప్రపంచంలోని వివిధ త్రవ్వకాలలో లభించిన వస్తువుల వివరాలనూ సేకరించి ప్రచురించిన శ్రీ ఐ.సి. సక్సెనా రచనలనూ, సేకరించడం జరిగింది.

తెలంగాణా ప్రాంతంలోని రాష్ట్ర భద్రతగల 5 పురాతన కళాఖండాలనూ 2 భద్రత లేని కళాఖండాలనూ, ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ అధీనంలోకి వచ్చిన 2 కళాఖండాలనూ (పూర్వం జాతీయ ప్రాముఖ్యంగల) రు. 8754/–ల ఖర్చుతో జాగ్రత్తచేసే పనులు కొనసాగించబడినవి.

## పరిశ్రమలు

*కేంద్ర రంగం :*— సింథెటిక్ డ్రగ్స్, భారీ విద్యుత్పరికరాల కర్మాగారాల పనులు చురుకుగా కొనసాగుతున్నాయి. ఇక్కడ నిర్మించబడనున్న హిందుస్తాన్ యంత్ర పరికరాల యూనిట్ కోసం స్థలాన్ని ఎన్నిక చేయడానికై హిందుస్తాన్ యంత్ర పరికరాల మేనేజింగ్ డైరెక్టరు శ్రీ మాతుల్లా 1963 ఏప్రిల్ 22,23 వ తేదీలలో హైద్రాబాదు సందర్శించారు. ఈ యూనిటును నెలకొల్పడానికి లోగా కేరళ, పింజోరి ప్రాంతాలను పరిశీలించడం జరిగింది. హిందుస్తాన్ యంత్ర పరికరాల కంపెనీ ఒక యూనిటును నెలకొల్పడానికై స్థలాన్ని నిర్దేశిస్తూ ఇటీవల ఉక్కు, భారీపరిశ్రమల శాఖ పార్లమెంటులో ఒక ప్రకటన చేసింది.

విశాఖపట్నంలో మధ్యరకం కోస్డ్‌బేడ్డ్ ప్లాంటును నిర్మించాలనే, ఉక్కు, భారీ పరిశ్రమల శాఖ చేసిన ప్రకటనను అనుసరించి, హిందుస్తాన్ యంత్ర పరికరాల కంపెనీకి చెందిన సాంకేతిక బృందం ఇటీవల విశాఖపట్నం సందర్శించింది. ప్రతిపాదిత ప్లాంటుకు అవసరమైన నీటి సరఫరా మొదలైన వాటిని గూర్చిన సంఖ్యా వివరాలను వారికి విశదపరచడానికై రాష్ట్ర ప్రభుత్వం ఒక సీనియర్ ఇంజనీర్‌ను డిప్యూట్ చేసింది.

*ప్రైవేటు రంగం :* ఆంధ్ర సిమెంటు కంపెనీలో ప్రస్తుతం ఉన్న చక్రగతి అవములను మార్చి స్పాంజ్ ఇనుము ఉత్పత్తిని ప్రారంభించడానికై భారతప్రభుత్వం వారికి లైసెన్సు జారీచేసింది. సంవత్సరానికి లక్ష టన్నుల శక్తిగల దీనిని రెండు దశలలో పూర్తి చేయడం జరుగుతుంది. మొదటి దశలో 40,000 టన్నుల ఉత్పత్తి జరుగుతుంది. సిమెంటు నష్టాన్ని పూరించడానికై సున్నంరాయి విస్తారంగా లభించే నందికొండలో ఒక సిమెంటు ఇటుక (క్లింకర్) ప్లాంటును కూడా యీ కంపెనీ నెలకొల్పుతుంది. యీ సిమెంటు ఇటుకను చూర్ణంచేసి ప్యాక్ చేయడానికి అవసరమైన యంత్ర పరికరాలు, సౌకర్యాలు ప్రస్తుతం ఉన్న ఫ్యాక్టరీలో ఉన్నాయి.

60 మిలియన్ అడుగుల వెల్డింగ్ ఎలక్ట్రోడ్‌లను ఉత్పత్తి చేయడానికై హైద్రాబాదులో ఒక ఫ్యాక్టరీని నిర్మించడానికి స్థానికసంస్థకు లైసెన్సు జారీచేయడం జరిగింది. రాష్ట్రంలోని పరిశ్రమల

రంగంలో చీనికిష్టాలా డిమాండు ఉంది. రెండుషిఫ్టుల ప్రాతిపదికపై సంవత్సరానికి 2000 టన్నుల ఎ. సి. యస్. ఆర్. కండక్టర్లను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీనిర్మించ డానికై తూర్పుగోదావరి జిల్లా కడియంలోని ఆజం ఎలక్ట్రికల్సుకు లైసెన్సు లభించింది.

కాగితంమిల్లుల స్థాపనకు లైసెన్సులు జారీచేయడం నిషేధించబడినా రోజుకు 10 టన్నుల ఉత్పత్తిశక్తిగల చిన్న ప్లాంట్లను నెలకొల్పడాన్ని భారత ప్రభుత్వం ప్రోత్స హిస్తున్నది. నూజివీడు (కృష్ణాజిల్లా) లో ఇటువంటి ప్లాంటును నెలకొల్పడానికి ఇటీవల భారత ప్రభుత్వం ఒకలైసెన్సు జారీ చేసింది.

వరంగల్లులోని ఆజం జాహిమిల్సు, కాకినాడలోని సర్వారాయ టెక్స్ టైల్స్‌లలో అదనంగా 400 మరియు 1240 కదుళ్ళను నెలకొల్పడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. దీనివల్ల సర్వారాయమిల్సులో అమర్చబడిన కదుళ్ళసంఖ్య 25000 కు పెరిగింది. భారత ప్రభుత్వ ఎగుమతుల పెంపుదల పథకంక్రింద 500 ఆటోమాటిక్ మగ్గాలను నెలకొల్పడానికి వీలుగా సర్వారాయమిల్సు చేసిన దరఖాస్తును భారత ప్రభుత్వం అనుమతించినట్టు తెలుస్తున్నది.

తణుకులోని అక్కామాంబ టెక్స్‌టైల్స్, ఆజంజాహి మిల్లులలో కాటన్ వేస్ట్ యార్న్‌కై 600 కదుళ్ళ చొప్పున నెలకొల్పడానికి లైసెన్సులు జారీచేయడం జరిగింది. కంబళ్ళ పరిశ్రమకు ఇది ఎంతో అవసరం.

*సింగరేణి బొగ్గుగనులు :* సింగరేణి గ్రూపు బొగ్గుగనులలో 1963 ఫిబ్రవరి నెలలో 2,55,844.2 టన్నుల బొగ్గుఉత్పత్తి జరిగింది. గత సంవత్సరం యిదేకాలంలో 2,31,659.2 టన్నుల ఉత్పత్తి జరిగింది. 1963 ఫిబ్రవరివరకు 5,46,575.9 టన్నుల ఉత్పత్తి జరగగా గత సంవత్సరం ఇదే కాలంలో, 4,78,743.8 టన్నుల ఉత్పత్తి జరిగింది. 1963 మార్చిలో ఇల్లెందు డివిజన్‌లో మరొక గనిని ప్రారంభించారు.

*నిజాం చక్కెర ఫ్యాక్టరీ :* చెరకు క్రషింగ్ — యీ నెలలో 94593 టన్నుల చెరకు క్రష్ చేయడం జరిగింది.

చక్కెర ఉత్పత్తి—యీ నెలలో 97435 బస్తాల చక్కెర ఉత్పత్తి జరిగింది.

*చెరకుగడ సరఫరా :* యీ నెలలో స్వంత క్షేత్రాలనుండీ, రైతులనుండీ దిగువ విధంగా చెరకు స్వీకరించడం జరిగింది.

| | | |
|---|---|---|
| సెంట్రల్ రైల్వే | ...... 11666 | టన్నులు |
| లైటురైల్వే | ...... 44908 | ,, |
| రోడ్డు | ...... 38466 | ,, |
| మొత్తం | 95040 | |

*ప్రముఖులరాక:* ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చీఫ్‌జస్టిస్ శ్రీ పి. చంద్రారెడ్డి 1963 మార్చి 6 వ తేదీన ఫ్యాక్టరీని సందర్శించారు.

శాసన సభ్యులు శ్రీ తెన్నేటి విశ్వనాథం, ఇతర శాసన సభ్యులు 1963 మార్చి 9, 10 తేదీలలో ఫ్యాక్టరీ, క్షేత్రాలను సందర్శించారు.

వ్యవసాయశాఖ మంత్రి శ్రీ ఎ. బలరామిరెడ్డి, వ్యవసాయశాఖ డైరెక్టరు, పశుపోషణశాఖ డైరెక్టర్లు యుక్తంగా 1963 మార్చి 24 వ తేదీన ఫ్యాక్టరీని సందర్శించారు.

*రక్తదానం.* అత్యవసర పరిస్థితిలో అందుబాటులో ఉండడానికి వీలుగా నిజాం చక్కెర ఫ్యాక్టరీ ఆసుపత్రిలో బ్లడ్‌బ్యాంకును ప్రారంభించడానికి ప్రతిపాదించారు.

*చేతి పరిశ్రమలు :* 1963 మార్చి 25 వ తేదీన డైరెక్టొరేటు కార్యాలయంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఎగుమతుల అభివృద్ధి సంఘం సమావేశం జరిగింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమల మంత్రి యీ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఎగుమతి చేయదగిన చేతి పరిశ్రమల వస్తువులను సమావేశం గదిలో ప్రదర్శించి కమిటీ సభ్యులకు చూపెట్టారు. చేతి పరిశ్రమలకు చెందిన వస్తువులను ఎగుమతి చేయడంలో గల అవకాశాలను గూర్చి సాధారణ చర్చ జరిగింది. ముఖ్యమైన పట్టణాలలో ప్రముఖ వ్యాపార సంస్థలను ఉపయోగించుకుని తద్వారా చేతిపరిశ్రమ వస్తువుల విక్రయానికి ఏజన్సీలను నెలకొల్పాలని సభ్యులు నొక్కిచెప్పారు. నాణ్యత విషయంలోనూ, నమోనాల విషయంలోనూ విదేశాల అవసరాలకు అనుగుణంగా చేతి పరిశ్రమల వస్తువుల ఉత్పత్తిని విస్తరింప చేయాల్సిన అవసరం ఎంతో ఉంది. ఈ నెలలో ప్రైస్ ఉపాధ్యక్షులు డాక్టర్ కుచుక్, హైద్రాబాదులోని ప్రభుత్వ చేతి పరిశ్రమలు, కుటీర పరిశ్రమవస్తువుల విక్రయశాలలను సందర్శించి వస్తువులను, ప్రదర్శనా తీరును చూచి ఎంతో శ్లాఘించారు. 1963 మార్చి 30 వ తేదీన బ్రిటిష్ హైకమీషనర్ శ్రీపాల్-గోర్-బూత్, ఆయన సతీమణి, డిప్యూటీ కమీషనర్ శ్రీ డబ్ల్యు. జె. యం. ప్యాటర్‌సన్ యీ విక్రయశాలలను సందర్శించారు. వారికి ఎంపోరియం మొత్తాన్ని సవివరంగా చూపడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ చేతి పరిశ్రమల వస్తువులను వారెంతో మెచ్చుకున్నారు. రు. 130/-ల విలువ చేసే సుల్తాన్ తానాషా పెయింటింగ్‌తో కూడిన నిర్మల్ ఫలకాన్ని వారికి బహూకరించారు. శ్రీమతి గోర్ బూత్ దీనిని ఎంతో మెచ్చుకున్నారు.

## ఓవర్‌బ్రిడ్జికి అప్రోచ్ రోడ్లు

గుంటూరు జిల్లాలో తెనాలి — నారకోడూరు రోడ్డు ముఖ్యమైనది.

ఇది తెనాలి పట్టణ హద్దులలో మద్రాసు–హౌరా, తెనాలి – రేపల్లె రైల్వే లైన్ల మీదుగా వెళ్తుంది. ప్రస్తుతం అచ్చట లెవెల్ క్రాసింగ్ వుంది. గేట్లను తరుచుగా మూస్తుండడంవల్ల ఈ మార్గంలో రాకపోకలకు చాలా అంతరాయం కలుగుతున్నది. అందుచేత ఈ రోడ్డులో లెవెల్ క్రాసింగ్ స్థానే ఓవర్ బ్రిడ్జిని నిర్మించి రెండువైపులా అనువైన అప్రోచ్ మార్గాలను నిర్మించడానికి ప్రతిపాదించారు.

ఓవర్ బ్రిడ్జికి అప్రోచ్ మార్గాలను నిర్మించేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 16–11–1961 తేదీగల 2652 వ నెంబరు జి. ఓ. ఎం. యస్. లో రూ. 5.50 లక్షలను పాలనావిషయకంగా మంజూరు చేసింది. సమగ్ర అంచనాలను సిద్ధంచేసి, టెండర్లను పిలిచిన తరువాత. రూ. 9.20 లక్షల వ్యయంతో కూడిన కొత్త అంచనాలను రూపొందించి మంజూరు కొరకు ప్రభుత్వానికి పంపడం జరిగింది. ఈ సవరించిన అంచనాల ప్రకారం టెండర్లను స్వీకరించి ఆమోదం నిమిత్తం ప్రభుత్వానికి పంపారు.

ఈ పనికి 1963 ఏప్రిల్ 3 వ తేదీన రాష్ట్ర మునిసిపల్ పరిపాలనా శాఖామంత్రి గౌ॥ శ్రీ ఆలపాటి వెంకటరామయ్య శంకుస్థాపనచేశారు. ఈ ఉత్సవ కార్యక్రమానికి భవనాలు, కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ మీర్ అహ్మద్ అలీఖాన్ అధ్యక్షత వహించారు.

రైల్వే వంతెన పొడవు 110 అడుగులు వుంటుంది. దీనికి 24 అడుగుల వెడల్పుగల అప్రోచ్ మార్గాలుంటాయి. వీటికి రెండు వైపులా 6 అడుగుల కాలిబాటలుంటాయి.

## మాచ్ ఖండ్ జలవిద్యుత్ పథకం

ఈ పథకంక్రింద నెలకొల్పిన ఆరు యూనిట్లూ విద్యుదుత్పాదన చేస్తున్నాయి. స్పిల్ వే త్రవ్వకం, జాలాపుట్ వద్ద పీర్ నిర్మాణం, స్పిల్ వేకి గేట్లు, స్టీమ్లు అమర్చడం, ఈ ప్రాంతంలో రోడ్లు, వంతెనలు నిర్మించడంవంటి మిగులు పనులు ఇప్పుడు జరుగుతున్నాయి.

## ఎగువ సీలేరు జలవిద్యుత్ పథకం

ఎగువ సీలేరు ప్రాజెక్టుకు అవసరమైన జనరేటర్లు, టర్బైన్లు స్టెప్అప్ ట్రాన్స్ఫార్మర్లు మొదలైన యంత్ర సామాగ్రి సరఫరాకై ఈ శాఖ స్విస్ ఫర్ములతో కుదుర్చుకున్న వివిధ ఒప్పందాలకు భారత్ స్విట్జర్లాండ్ ప్రభుత్వాల ఆమోదం 1963 ఫిబ్రవరి నెలలో లభించింది. జనరేటర్ల కొరకు 10 శాతం అడ్వాన్సు మొత్తాన్ని 1963 ఫిబ్రవరిలో మెసర్స్ ఒర్లికన్ ఇంజనీరింగ్ కంపెనీకి చెల్లించడం జరిగింది. టర్బైన్ స్టెప్ అప్ ట్రాన్స్ఫార్మర్, స్విచ్ గేర్ కంట్రాక్టర్ల నిమిత్తం 10 శాతం అడ్వాన్సు మొత్తాన్ని 1963 ఫిబ్రవరిలో చెల్లించడమైంది.

## తుంగభద్ర జల విద్యుత్ పథకం

ఎన్ ఋణసౌకర్యపథకం క్రింద జపాను సంస్థలకుచేసిన ఆర్డర్ల మేరకు యంత్రపరికరాలు మనదేశం చేరాయి (మద్రాసు రేవు) 90 శాతం బంగీలను ప్రాజెక్టు స్థలానికి చేరవేశారు. మిగిలినవాటిని త్వరలో చేర్చుతారు.

ఆనకట్ట విద్యుత్కేంద్రంలో యంత్ర పరికరాలను అమర్చేపని చురుకుగా సాగుతున్నది. టర్బైన్లను స్థాపించేపని 1963 జూన్నాటికి ముగుస్తుంది. ఆనకట్ట విద్యుత్కేంద్రం మొదటి యూనిటును 1963 నవంబరులో వినియోగంలోకి తెస్తారు. 1963 డిశంబరులో రెండవ యూనిటును వినియోగంలోకి తెస్తారు. హంపిలో మూడవ యూనిటును 1963 డిశంబరునాటికి ప్రారంభించడానికి, 1964 జనవరి నెలాఖరునాటికి 4వ యూనిటును ప్రారంభించడానికి తలపెట్టారు.

ఉత్పత్తిదార్లు పంపిన సూపర్ వైజింగ్ ఇంజనీర్లు చేరుకున్నారు.

*కొత్తగూడెం థర్మల్ పథకం :*

(అ) బాయిలర్ ప్లాంట్ ఇతర ఉపకరణాలు, టర్బో జనరేటర్లు, సహాయక సాధనసామగ్రి కొరకు టెండర్లు స్వీకరించడం జరిగింది. ఈ శాఖవారు సలహాదార్లు, టెండర్లను పరిశీలిస్తున్నారు. సలహాదార్ల సిఫార్సులు త్వరలో అందనున్నాయి.

(ఆ) హైటల్టేజ్ స్విచ్ గేర్, ట్రాన్స్ఫార్మర్ల కొరకు 1963 మే 13 వ తేదీవరకు టెండర్లు స్వీకరించడం జరిగింది. ఒక్కొక్కటి దాదాపు 2 మె. వా. శక్తిగల రెండు డీసెల్ జనరేటింగ్ సెట్ల కొరకు స్పెసిఫికేషన్ను ఖాయపరచడం జరిగింది. ఇప్పుడు దీనిని ముద్రణకు పంపుతున్నారు. ముద్రణ పూర్తయాక దీనికి టెండర్లను పిలుస్తారు.

(ఇ) *రైల్వే సైడింగ్* : ప్రారంభంలో నిర్మాణ పరికరాలను రవాణా చేయడానికి, తర్వాత బొగ్గు రవాణా చేయడానికి భద్రాచలం రోడ్డు స్టేషన్నుంచి విద్యుత్కేంద్రం వరకు ఒక రైల్వే సైడింగ్ను నిర్మించ వలసిందిగా కేంద్ర రైల్వేవారిని అభ్యర్థించడం జరిగింది. ఎరువుల ఫ్యాక్టరీ పక్షాన భద్రాచలం రోడ్డు స్టేషనునుంచి ఎరువుల ఫ్యాక్టరీస్థలం వరకు రైల్వేవారు సర్వేపనులు పూర్తి చేశారు. అంచనాలను సిద్ధంచేశారు. ఎరువుల ఫ్యాక్టరీ వారు రైల్వే లేనుపట్ల తమకు ఆసక్తిలేదని ఇప్పుడు తెలియజేయడంవల్ల ఈ పనిని పూర్తిగా ఈ శాఖ తరపున చేపట్టవలసిందిగా కేంద్ర రైల్వేవారిని అభ్యర్థించడం జరిగింది. అంచనాలు మొదలైన వాటిని ఖాయపరుస్తున్నట్లు తెలుస్తున్నది.

సివిల్ పనులు : అప్రోచ్ రోడ్లు నివాస గృహాల నిర్మాణంవంటి సివిల్ పనులు చురుకుగ్గా కొనసాగుతున్నాయి.

## హైద్రాబాదులో గ్యాస్ టర్బో సెట్ల స్థాపన

ఈ పథకానికి రూ. 165.0 లక్షలు ఖర్చవుతాయని అంచనా. ఈ పథకంక్రింద ఒక్కొక్కటి 10 మె.వా. శక్తిగల రెండు ప్యాకేజ్ నమూనా గ్యాస్ టర్బో సెట్లను హైద్రాబాదు ఎఱ్ఱగడ్డ సబ్ స్టేషనులో నెలకొల్పడానికి తలపెట్టారు. ప్రణాళికా సమితి వారు దీనికి సాంకేతికంగా మంజూరీ ఇచ్చారు. ప్రభుత్వంనుంచి పాలనా విషయకంగా ఆమోదం లభించింది. 10 మె. వా. శక్తిగల ప్యాకేజ్ నమూనా గ్యాస్ టర్బో సెట్లను నాలుగింటిని సరఫరా చేసేందుకై సప్లైస్, డిస్పోజల్స్ డైరెక్టరు జనరల్ కార్యాలయం వారు మెసర్స్ ఐ. జి. ఇ., న్యూయార్క్ కు ఆర్డరు చేశారు. వీటిలో రెండింటిని మన రాష్ట్రానికి కేటాయించారు. ఎగ్జిం బ్యాంకు ఋణ సౌకర్యంక్రింద విదేశీ మారకాన్ని లభింపజేస్తున్నారు. 1963 సంవత్సరం ఉత్తరార్ధంలో ఈ సెట్లను వినియోగంలోకి తేదలిచారు.

రాష్ట్రంలో ప్రస్తుతం వున్న విద్యుచ్ఛక్తి కొరత దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వం ఈ పథకానికి ప్రాధాన్యత ఇస్తున్నది. పునాదులు మొదలైన సివిల్ పనులు, సబ్ స్టేషన్ పనులు చురుగ్గా జరుగుతున్నాయి.

## రామగుండం విద్యుత్కేంద్రం

*యంత్ర సామగ్రి:* ఈ పథకానికి అవసరమైన రెండు ఎలక్ట్రికల్ ఫీడ్ పంపుల కొరకు, కేంద్ర జల విద్యుత్ సంఘం ఖారీ కొనుగోళ్ళ క్రింద ఆర్డరు చేసింది.

హీటర్ల కొరకు స్వీకరించిన టెండర్లను జల విద్యుత్ సంఘం పరిశీలిస్తున్నది. వీటి కొరకు బహుశా త్వరలోనే ఆర్డరు చేస్తారు.

(ii) *సలహాదార్లతో ఒడంబడిక:* సలహాదార్లయిన అమెరికాకు చెందిన మెసర్స్ బర్న్స్ అండ్ రౌ వారు, తాము ఇక్కడ పనిచేయడానికి సంబంధించిన ఒడంబడిక ముసాయిదాలో కొన్ని మార్పులు సూచించారు. ఈ శాఖ ఉదహరించిన కొన్ని అంశాల విషయంలో ఇంకా వారి నుంచి సమాధానం రావల్సివుంది.

(iii) *కూలింగ్ టవర్లు:* ఈ పథకం క్రింద రెండు కూలింగ్ టవర్లను నెలకొల్పవలసివుంది. పనులు ప్రారంభించే నిమిత్తం టవర్లను నిర్మించే స్థలాన్ని కంట్రాక్టర్లకు అప్పగించడం జరిగింది.

## నెల్లూరు థర్మల్ పథకం

(i) స్థాపన పనులకు సంబంధించిన టెండర్లను ఖాయం చేయడం జరిగింది. బొంబాయికి చెందిన మెసర్స్ సి. కె. జి. పిత్తావాలాకు కంట్రాక్టు ఇచ్చారు. (రూ. 18,26,859).

(ii) వర్క్ షాపు యంత్రాలకొరకు స్వీకరించిన టెండర్లను ఖాయపరుస్తున్నారు.

(iii) థర్మల్ పథకం స్థలంవద్ద సివిల్ పనులు పూర్తయాయి. యంత్రాలను స్థాపించే పనులు ప్రారంభించడానికి అవసరమైన ఏర్పాట్లు చేశారు.

(iv) థర్మల్ పథకం స్థలానికి జపాను పర్యవేక్షక ఇంజనీరు త్వరలో రానున్నారు. ఆయన వచ్చిన పిమ్మట యంత్రాల స్థాపన ఆరంభమవుతుంది.

## హుస్సేన్‌సాగర్ బాయిలర్ విస్తరణ పథకం

(అ) *ఎలక్ట్రికల్, మెకానికల్ పనులు:* ప్రధాన బాయిలర్ సాధన సామగ్రికి సంబంధించిన విడి భాగాలన్నీ దాదాపు పూర్తిగా ఈ పథకం అమలు జరుగుతున్న స్థలానికి చేరాయి. వీటిని ఇంగ్లాండులో తయారు చేశారు. బాయిలర్ డ్రమ్ములను నెలకొల్పారు. 24 వరసల్లో గొట్టాలు వేశారు. 20 వరసలను పాక్షికంగా విస్తృతీకరించారు.

బొగ్గుపనికి సంబంధించిన యంత్ర సామాగ్రిని ఇంగ్లాండులో తయారు చేయడం జరుగుతున్నది.

దేశంలో లభ్యమయ్యే సహాయకయంత్ర పరికరాలలో 75 శాతం యంత్ర పరికరాలను తయారుచేయడం వాటిలో 50 శాతం యంత్రపరికరాలను పథకం స్థలానికి చేరవేయడం జరిగింది.

(ఆ) *సివిల్ పనులు:* బాయిలర్ ప్లాంటుకు పునాదులు నిర్మించడం పూర్తయింది. ఆర్. సి. సి. బిల్డింగ్ కాలమ్స్‌ను బేస్ మెంట్ నుంచి 30 అడుగుల ఎత్తున నిర్మించారు. బాయిలర్ హౌస్ చుట్టూ ఆర్. సి. సి. బ్రేసెస్ నిర్మాణం రెండవదశ కొంతవరకు ముగిసింది. బ్యాక్ వాష్ టాంక్ పునాదిపూర్తయింది. వీటికి సంబంధించిన యంత్రాలకు పునాదుల త్రవ్వకం ముగిసింది.

*(ఇ) నెల్లూరు నుంచి విశాఖపట్నంకు 2.5 ఎం. డబ్ల్యు. సెట్ల తరలింపు:* ఒక సెట్టును 1962 అక్టోబరులోనే హుస్సేన్ సాగర్‌కు తరలించడం, వినియోగంలోకి తేవడం జరిగింది. రెండవ సెట్టును వేసవి తరువాత 1963 జూలైలో తరలించదలచారు.

## తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం

*రామగుండం థర్మల్ కేంద్రంవిస్తరణలు:* 1,50,000 Lbs/hr బాయిలర్‌ను సరఫరా చేసి నెలకొల్పేందుకై కొత్త ఢిల్లీలోని

మెసర్స్ ఇండోసన్ (మెసర్స్ ఇంగ్రయుగో స్లావియా ప్రతినిధులు) ఆర్డరు చేశారు.

*1. బాయిలర్ :* కంపెనీ అందజేసిన బాయిలర్ డ్రాయింగులను ఆమోదించి దానిని తిరిగి పంపడం జరిగింది. మిగించకుండావున్న బాయిలర్‌ను 1963 మార్చి 27 వ తేదీన నౌకలో పంపినట్లు కంపెనీ తెలిపింది.

బాయిలర్ పునాది నమూనాలను కంపెనీ పంపించింది. వీటిని ఖాయపరుస్తున్నారు.

*2. (i) సి. డబ్ల్యు పైపింగ్ :* సి. డబ్ల్యు పైపింగ్ వివరాలను కంపెనీకి పంపడం జరిగింది. కొత్తగా నెలకొల్పిన రెండవ కూలింగ్ టవర్‌ను 1963 మే నాటికి వినియోగంలోకి తేవడానికి వీలుగా సి.డబ్ల్యు. పైపింగ్ పూర్తి చేయబడుతుందని, కంపెనీ వెల్లడించింది.

(ii) *26,000 జి. వి. ఎం. రెండవ కూలింగ్ టవర్ :* రెండవ కూలింగ్ టవర్‌ను మెసర్స్ గమన్స్‌వారు నెలకొల్పడం పూర్తి చేశారు.

*3. బొగ్గుపనికి సంబంధించిన యంత్రం:* మెసర్స్ ఇండోసన్ వారు బాయిలర్ తో పాటుగా 125 tons/hr కోల్ హాండ్లింగ్ యంత్రాన్ని సరఫరా చేయవలసివుంది. దీని సవరించిన డ్రాయింగులు అందవలసివున్నది కూడా.

*4. ఫీడ్ వాటర్ టాంకులు :* వీటికి సంబంధించిన ప్రణాళికలను ఇటీవల సిద్ధం చేశారు. డ్రాయింగులను కంపెనీకి పంపించారు.

కంపెనీ ప్రతినిధులు, బోర్డు అధికార్ల మధ్య ఇటీవల జరిగిన చర్చలలో 1963 డిశంబరు నాటికి బాయిలర్‌ను వినియోగంలోకి తేవచ్చని కంపెనీ ప్రతినిధి తెలిపారు.



## మీ ప్రేమోత్సుకత

దుర్గమమైన హిమాలయ ప్రాంతంలో ఎన్నో కష్ట పరిస్థితులలో దేశసరిహద్దులను కాపాడుతున్న పేరుకైన మనసైనికులు మీరు కానుకలుగా పంపే వెచ్చని బట్టలను ఎంతో గొప్పగా పరిగణిస్తారు.

ఈ క్రింది వస్తువులను పంపండి :

ఉన్ని బట్టలు, లోపల ధరించే బనీన్లు, డ్రాయర్లు, కేప్-కంఫర్టర్లు, స్కార్ఫ్స్, మేజోళ్ళు, గ్లోవ్స్, పుల్లోవర్లు దుప్పట్లు, కాటన్ పిల్లో-స్లిప్పులు (3′ × 1½′) (తెలుపు), నూలు పక్కదుప్పట్లు (తెలుపు) 'పజమా' సూట్లు (తెలుపు)

శస్త్ర చికిత్స కుపయోగించే కాటన్, పూలు బాండేజీలు (బూడిద, వైమానికదళనీలం, ఖాకీ టీక్, లేక ఇతర "న్యూట్రల్" రంగులలో వుంచే మంచిది).

ప్యాకెట్లలో వున్న వస్తువుల వివరాలను ప్యాకెట్లపై స్పష్టంగా తెలపాలి. వాటిని ఈ క్రింది చిరునామాకు రవాణా ఛార్జీలు చెల్లించి పంపాలి.

1. అడ్మినిస్ట్రేటివ్ కమాండెంట్, హెడ్‌క్వార్టర్స్, సికింద్రాబాద్ స్టేషన్, బొలారం.

లేక

2. స్టేషన్ కమాండర్, ఎయిర్ ఫోర్స్ స్టేషన్, బేగంపేట, హైదరాబాద్.
3. శ్రీ యం. హెచ్. కె. షుజ్జవీ, గవర్నర్ సహాయ కార్యదర్శి, రాజభవన్, హైదరాబాద్.

# ఆంధ్రుల చరిత్ర, సంస్కృతుల్లో ప్రముఖ ఘట్టాలు*

## (1800 నుంచి 1947 వరకు)

మామిడిపూడి వెంకటరంగయ్య

క్రీ. శ. 1800 సం॥ నాటికి బ్రిటిష్‌వారు ఆంధ్రను దాదాపు పూర్తిగా జయించారు. ఈ సందర్భంలో వారు, ఫ్రెంచివారితోను, నిజాము, మైసూరు సుల్తానులతోను యుద్ధాలు చేయవలసి వచ్చింది. సప్తవర్ష సంగ్రామంలో (1756–63) ఫ్రెంచివారు పరాజయం పొందడంతో గంజాం నుంచి గుంటూరు వరకు గల కోస్తా ప్రాంతం బ్రిటిష్ వారికి హస్తగతమైంది. 1865 సం॥లో మొగలు చక్రవర్తి జారీచేసిన ఫర్మాను వల్లనూ, 1766 లోను 1768 లోను నిజాముతో చేసుకొన్న ఒప్పందాల వల్లనూ ఈ ప్రాంతంపై వారికి న్యాయయుతమైన హక్కు సంక్రమించింది. వారు 1788 లో గుంటూరును స్వాధీనపరచుకొన్నారు. రాయలసీమలోని బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలు మైసూరు సుల్తాను రాజ్యంలో వుండేవి. బ్రిటిష్ వారికి స్నేహపాత్రుడైన నిజాము, మూడవ, నాల్గవ మైసూరు యుద్ధాలలో వీటిని సంపాదించుకొన్నాడు. అయితే 1800 సం॥ లో బ్రిటిష్ వారికి వాటిని దత్తం చేశాడు. చిత్తూరు, నెల్లూరు జిల్లాలు కర్నాటక నవాబు స్వాధీనంలో వుండేవి. అయితే బ్రిటిష్ వారు అతణ్ణి 1802 తో పదవీ భ్రష్టుని చేసి, ఈ ప్రాంతాలను తమ స్వాధీనంలోకి తెచ్చుకొన్నారు.

### జమీందారీ తిరుగుబాట్లు

అయితే బ్రిటిష్‌వారు ఆంధ్రలో తమ అధికారం నిలద్రొక్కుకోవడానికి వారికి అనేక సంవత్సరాలు పట్టింది. ఆకాలంలో వాస్తవికమైన అధికారం చెలాయిస్తూ వుండిన రాజులు, జమీందార్లు, పోలిగర్లు బ్రిటిష్ పరిపాలనను తీవ్రంగా ప్రతిఘటించారు. గంజాంలోని పర్లాకిమిడి, గుంసూరు, విజయనగర్, ప్రతాపగిరికోట రాజులు తమ అనుయాయులతోపాటు గిరిజన ప్రాంతాల్లో 1763 నుంచీ తిరుగుబాట్లు లేవదీశారు. స్పెషల్ కమీషనరు జార్జి రస్సెల్ 1837 లో ఈ తిరుగుబాట్లను పూర్తిగా అణచివేశాడు. ఆయన ఇందుకొరకే నియమించబడ్డాడు. విశాఖపట్నంలోని జమీందార్లలో అతి ప్రబలుడైన విజయనగరం రాజా ప్రతిఘటన కొనసాగించాడు. 1794లో పద్మనాభం యుద్ధ భూమిలో ఆయన ఓడిపోయి విహతుడైనాడు. ఈ యుద్ధం తరువాత కూడా కాశీపురం, పల్లకొండ, గోలుకొండ జమీందార్లు బ్రిటిష్ ప్రభుత్వానికి ఇబ్బందులు కల్గించడం ఆరంభించారు. 1836 నాటికిగాని వీరిని అణగద్రొక్కడం సాధ్యం కాలేదు. రాయలసీమలోను, చిత్తూరులోను పోలిగర్లు బ్రిటిష్ అధికారాన్ని ధిక్కరించారు. 1806 సం॥ నాటికి వీరిని పూర్తిగా అణగద్రొక్కడం జరిగింది.

చరిత్రకారులు ఈ తిరుగుబాట్ల ప్రాముఖ్యాన్ని పరిగణించలేదు. ఇవి అరాచకాన్ని రేకెత్తించే భూస్వామ్య శక్తుల తిరుగుబాట్లు మాత్రమేనని వారు చులకన చేశారు. అయితే యిది సరియైనది కాదు. ఆ కాలంలో జమీందార్లు మాత్రమే విదేశీ పాలనను యెదుర్కొనే స్థితిలో వుండేవారు. బ్రిటిష్‌వారి పాలనను ఎదిరించడానికి వారిని కేవలం స్వార్థపరత్వమే కాదు, దేశభక్తి కూడా ప్రేరేపించింది. వారు యేమేమి కార్యాలు చేశారో, అంతా కలిస్తే అది ఆంధ్ర స్వాతంత్ర్యోద్యమం చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టమవుతుంది.

ఆంధ్ర ప్రాంతం జయించబడిన తరువాత అది 1858 వరకు తూర్పు ఇండియా కంపెనీ పరిపాలన క్రింద వుంది.

### పరిపాలనా సంబంధమైన మార్పులు

ఆంధ్ర పరిపాలనా విధానంలో తూర్పు

* ఇందులో ఇవ్వబడిన వివరాలు కోస్తా జిల్లాలు, రాయలసీమకు మాత్రమే సంబంధించినవి. తెలంగాణాకు సంబంధించినవి కావు.

ఇండియా కంపెనీ పెద్ద మార్పులు తీసుకొని వచ్చింది.వీరి పరిపాలనకు పూర్వం ప్రజలకు దేశ పాలకులతోగాని కేంద్ర అధికారంతో కాని లేక దాని ప్రతినిధులతోకానీ ప్రత్యక్ష సంబంధాలు వుండేవికావు. స్థానిక రాజులు, జమీందార్లు, పాలకులు, పాలితుల మధ్య అడ్డుగా వుండేవారు. వీరికి పౌర అధికారాలే గాక, వారి అధీనంలో పెద్దపెద్ద సైన్యాలు కూడా వుండడంవల్ల కేంద్ర ప్రభుత్వానికి తరచుగా యిబ్బందులు కలిగిస్తూ వుండేవారు. కంపెనీ ప్రభుత్వం ఈ పద్ధతిని తుదముట్టించి అధికారాన్నంతా తన చేతిలో వుంచుకొనేందుకు ప్రయత్నించింది. జమీందార్లకు గల సైనిక దళాలు, సివిల్ అధికారాలు తొలగించబడ్డాయి. కేవలం భూస్వాముల హోదాకు వారు తగ్గించబడ్డారు. ఆంధ్ర ప్రాంతమంతా అనేక జిల్లాలుగా విభజించబడింది. ప్రతి జిల్లాకు ఒక కలెక్టరు నియమించబడ్డారు. అతనికి కేవలం సివిల్ అధికారం మాత్రమే వుండేది. ఆయన మద్రాసు ప్రభుత్వానికీ, రెవెన్యూ బోర్డుకూ లోబడి వుండేవారు. ఈవిధంగా ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య ప్రత్యక్ష సంబంధం ఏర్పడింది. పరిపాలనా విధానంలో ఇది ఒక గొప్ప విప్లవాత్మకమైన మార్పు.

## భద్రతకు ప్రమాదం

1800 ల తరువాత, ఇదివరకు వున్నటువంటి యుద్ధాల బారినుండి ఆంధ్రకు విముక్తి కల్గింది. అనేక జిల్లాల్లో ఆంతరంగిక తిరుగుబాట్లుకూడా అణగారిపోయాయి. 1836 తరువాత ఈ ప్రాంతమంతటా సుస్థిరశాంతి ఏర్పడింది. అయితే పొరుగున వున్న నిజాం ప్రాంతంనుంచి పిండారీలదాడులు, రోహిలాల దోపిడీలకు గురియై ప్రజలు అనేక బాధలు పడవలసి వచ్చింది. దోపిడి దొంగలు, బందిపోటు దొంగలు జట్లు జట్లుగా ఏర్పడి శాంతి భద్రతలకు భంగం కల్గించడం ఆరంభించారు. అందుకని, సమర్థవంతమైన పోలీసు పద్ధతిని ప్రవేశపెట్టడానికి కంపెనీ ప్రభుత్వానికి చాలా కాలం పట్టింది. అయినప్పటికీ, అరాచక పరిస్థితుల్ని అదుపులో పెట్టడానికి ఈ పోలీసు బలగం సరిపోయింది కాదు. కావలిదార్ల ద్వారా శాంతి భద్రతలు నెలకొల్పడానికి కంపెనీ మొట్టమొదలు ప్రవేశపెట్టిన కేంద్రీకృత పరిపాలనా పద్ధతి అంతరించింది. ఇందుకు ప్రత్యామ్నాయంగా క్రొత్తగా ఏర్పాటు చేయబడిన పోలీసు కూడా సమర్థవంతంగా పని చేయలేదు.

## న్యాయ స్థానాలు

1800 సంవత్సరం తరువాతి కాలంలో ప్రజలకు న్యాయం చేకూర్చడానికి క్రమబద్ధమైన న్యాయ స్థానాల్ని ఏర్పాటు చేయడానికి తొలిసారిగా చర్యలు గైకొనబడ్డాయి. ప్రతి జిల్లాలో జడ్జి అధ్యక్షతన ఒక న్యాయస్థానం ఏర్పాటు చేయబడింది. కలెక్టరుకు నివేదించిన కేసులుతప్ప ఇతర సివిల్, క్రిమినల్ కేసులన్నింటినీ ఈ జడ్జి విచారించేవారు. జిల్లాకోర్టు క్రింద మున్సిఫ్ కోర్టులు, రెండు సాదరు అప్పీలుకోర్టులు — వీటిలో ఒకటి క్రిమినల్ కేసులకూ, మరొకటి సివిల్ కేసులకూ సంబంధించినవి—ఏర్పాటు చేయబడ్డాయి. "చట్టబద్ధమైన పరిపాలనను" కొనసాగించడానికి చర్యలు తీసుకోబడ్డాయి. ఈ మార్పు మంచిదేకాని న్యాయపద్ధతిలో అనేక లోపాలున్నాయి. సాక్ష్యం తీసుకోవడం, సాక్షులను క్రాసు పరీక్ష చేసే విషయంలో బ్రిటిష్ పద్ధతిలో గల నిబంధనల్ని ప్రవేశపెట్టడం ఒక లోపం. వ్యాజ్యంఫలితంగా ఖర్చులు పెరిగిపోవడం రెండవలోపం. కేసులు విచారించి తీర్పులు యివ్వడంలో జాప్యం కలగడం మూడవ లోపం. విదేశీ పద్ధతికి అలవాటు పడటానికి ప్రజలకు చాలాకాలం పట్టింది.

## ఆర్థిక క్షీణదశ

కంపెనీ పరిపాలనాకాలంలో ప్రజల ఆర్థికపరిస్థితి క్షీణించి పోయింది. పెద్ద, చిన్న తారతమ్యంలేకుండా అన్నివర్గాల ప్రజలూ ఆర్థికంగా చితికిపోయారు జమీందార్లు తమకువుండిన రాజకీయ హోదాలను గోల్పోయారు. తొలి సంవత్సరాలలో జమీందార్లపైన పేష్కష్ అధికంగా విధించటం జరిగింది. బ్రిటిష్‌వారు వీటిని నిష్కర్షగా అనేకమందివద్దనుంచి బకాయిలు పెరగకుండా నిలబెట్టి వసూలుచేశారు. తత్ఫలితంగా చాలామంది తమ ఎస్టేట్లను పోగొట్టుకొన్నారు పరిపాలనా పదవులన్నింటిలో యూరోపియనులను నియమించడం వల్ల ఇంతకుముందు వున్న ప్రభుత్వంలో బాధ్యతాయుత పరిపాలనా పదవులు నిర్వహిస్తూవచ్చిన ఆంధ్రులు వాటిని కోల్పోయారు.

అయితే వ్యవసాయం, తదితర వృత్తులను చేపట్టిన ప్రజలు కంపెనీ పరిపాలనలో అందరికంటే చాలా యెక్కువ దెబ్బ తిన్నారు.

బ్రిటిష్ పరిపాలనా కాలంలో తొలిరోజులలో కంపెనీ ఉద్యోగులకు పరిపాలనానుభవం బొత్తిగా లేదు. వ్యాపార వాణిజ్య వ్యవహారాలలో మాత్రమే వారు నిపుణులు. ప్రజల సాంప్రదాయాలు, అలవాట్లు వారికి అర్థమయ్యేవి కావు. వారికి స్థానిక భాష తెలిసేదికాదు. అందుకని దుబాషీలపైన ఆధారపడవలసివచ్చేది. ఈ దుబాషీలు తమ స్వార్థంకోసం వారిని పెడదారిని పట్టించేవారు. అన్నిటికంటే ముఖ్యమైనదేమంటే కంపెనీకి సాధ్యమైనంత అధిక ఆదాయం చేకూర్చడమే వారి ధ్యేయమైవుండేది.

సందర్భవశాత్తు తమకోసంకూడా అపార మైన ధనార్జన చేసుకొనేవారు. దీనితో వారి దృక్పథమంతా చెడిపోయింది. వారు అనేక సందర్భాలలో పనులు చేయవలసినచోట చేయక, చేయకూడనిచోట చేసినఫలితంగా ప్రజల ఆర్థిక పరిస్థితి శిథిలమైపోయింది.

క్రమేణా చేతిపనుల పరిశ్రమలన్నీ, అంటే నేత, రంగులద్దకం, ఇనుము పోత పోయడం, లోహపరికరముల తయారీ, ఆయుధాల తయారీ, నౌకానిర్మాణ పరిశ్రమ మున్నగునవి క్షీణదశకు వచ్చాయి. కంపెనీ పరిపాలనారంభకాలంలో చేనేత కార్మికులు నేసిన వస్త్రాలకు తక్కువధర వచ్చేది. ఆ తరువాతికాలంలో ఇంగ్లీషువారి మిల్లు వస్త్రాల పోటీ తీవ్రంగా ఏర్పడింది. ఈ కారణంవల్ల ఇక్కడ నేతపరిశ్రమ క్షీణించి పోయింది. బ్రిటిష్ వారి పోటీఫలితంగా ఇనుము ఉత్పత్తిదారులు, నౌకానిర్మాణ దారులుకూడా చాలా దెబ్బతిన్నారు.

ఆ రోజుల్లో అందరికన్నా వ్యవసాయ దారులే యెక్కువగా నష్టపడిపోయారు. అత్యధికంగా భూమిశిస్తు వసూలు చేయడమే కంపెనీ ఉద్యోగుల లక్ష్యమైవుండేది. అందు కొరకుగాను, కంపెనీపరిపాలనాకాలంలో వారు అనేకవిధాలైన ప్రయోగాలు చేశారు. తొలిరోజులలో వారు భూమిశిస్తు వసూలు చేసే హక్కును వేలంవేశారు. ఒక్కొక్క సారి ఈ హక్కు ఒక సంవత్సరంవరకు మాత్రమే వుండేది. కొన్ని సందర్భాలలో ఇది ఐదేండ్లవరకుకూడా వుండేది. కాలం ఏదైనా, పొలందున్నే రైతులే చాల బాధ పడ్డారు. వేలం పాడిన వ్యక్తులు ప్రభుత్వా నికి డబ్బు చెల్లించే స్థితిలో వుండడానికీ, వారికి కొంతలాభం మిగలడానికీ వీలుగా, రైతులను పీల్చి పిప్పిచేసేవారు. శాశ్వత పరిష్కారం 1802 లో ప్రవేశపెట్టబడింది. అయితే దీనివల్ల జమీందార్లకేగాని వారి కౌల్దార్లకు ఏలాంటి లాభమూ కలగలేదు. జమీందార్లు రైతులను భూములనుంచి తొల గించే విషయంలో కానీ లేక ఎక్కువ కౌలును వసూలుచేసే విషయంలోకానీ రైతులకు రక్షణ కల్పిస్తూ నూరేండ్ల వరకు ఏలాంటి శాసనంకూడా ప్రవేశ పెట్టబడలేదు. మరో ప్రభావం ఫలితంగా రాయలసీమ, నెల్లూరు, చిత్తూర్లలో రైత్వారీ పద్ధతి ప్రవేశపెట్టబడింది. దీనివల్ల దళారీలైన జమీందార్ల ప్రమేయంలేకుండా జరిగినప్పటికీ, ఆరోజుల్లో భూమిసర్వే, సెటిల్మెంటు సక్రమంగా లేనందువల్లనూ, భూమిశిస్తు చాలా అధికంగా వుండడం వల్లనూ రైతులు మరీ చితికి పోయారు. 1860 వ సంవత్సరం తరువాత కానీ ఈ లోపాన్ని సరిదిద్దడం జరగలేదు. దీనికి తోడుగా కొత్తనీటి పారుదల సౌకర్యాలు కలిగించడానికి కానీ, పాతవాటిని మరమ్మతు చేయడానికి కానీ ప్రయత్నాలు జరగలేదు. తత్ఫలితంగావున్న నీటిపారుదల సౌకర్యాలు కూడా అంతరించిపోయాయి. 1847 లో గోదావరిపైనా, 1853లో కృష్ణపైనా ఆనకట్లు నిర్మించబడ్డాయి. ఈ కాలంలో జరిగిన పనులు ఇవిమాత్రమే. అయితే వీటివల్ల పరిమితమైన ప్రాంతానికిమాత్రమే మేలు చేకూరింది. భూమిశిస్తు నగదు రూపంలో మాత్రమే చెల్లించవలసి వుండాలి. 1834 నుంచీ ధరలు పడిపోవటంతో పన్నులభారం మరీ అధికమైంది. రెవిన్యూ, న్యాయ అధి కారాలు రెండు కలెక్టరుకు వుండడంవల్ల భూమిశిస్తు చెల్లింపును ఎగవేయడానికి రైతులకు ఏమాత్రమూ సాధ్యమయ్యేదికాదు.

ఈ కాలంలో కరువుకాటకాలు అనేక సార్లు వచ్చినందువల్ల, రైతులు, ప్రజల పరిస్థితి అధ్వాన్నమై పోయింది. కరువు నివారణ విషయంలో, ఆ రోజుల్లో ప్రభు త్వానికి ఒక నిర్దుష్టమైన విధానం వుండేది కాదు. తత్ఫలితంగా కరువుకు గురియైన బాధలు అధికమైనాయి. ఆకలి చావుల సంఖ్య పెరిగిపోయింది.

### విద్య, సాంఘిక సేవ

కంపెనీ కాలంలో విద్యకొరకు ఖర్చు పెట్టిన డబ్బు మృగ్యమనే చెప్పవచ్చు. మద్రాసు ప్రెసిడెన్సీకంతా కలిసి సాలుకు లక్షరూపాయలు ఖర్చు అయ్యేది. సాంఘిక సంక్షేమానికి ఏ మాత్రమూ డబ్బు ఖర్చుపెట్ట బడలేదు. 1840 సం॥ తరువాత వరకూ మెటల్ రోడ్ల నిర్మాణానికిగాను ఏలాంటి ప్రయత్నమూ జరగలేదు. 1858 సం॥ నాటికి ఈ రోడ్ల మైలేజి 3000 వుంది.

కంపెనీ పరిపాలన తరువాతి కాలంలో క్రైస్తవ మిషనరీల కార్యాకలాపాల పట్ల ఒక అపోహ ఏర్పడింది. వీటితో ప్రభుత్వం చేతులు కలుపుతున్న దనీ హిందూ మతం అణచివేయబడే ప్రమాదం ఏర్పడుతున్న దనీ ఒక అనుమానం బాగా ప్రబలిపోయింది.

ఈ విధమైన అపోహలు వున్నప్పటికీ, కంపెనీ పరిపాలనా కాలంలో ఆంధ్రప్రాంత మంతటా ఆర్థిక పరిస్థితి క్షీణించిపోయి నప్పటికీ కూడా జమీందార్ల తిరుగు బాట్లను ఒకసారి అణచివేసిన తరువాత పరిస్థితుల్ని చక్కదిద్దడానికి ఏ విధమైన ప్రయత్నమూ జరగలేదు. 1857-58 నాటి విప్లవంలో ఆంధ్రతో పాటు మద్రాసు ప్రెసిడెన్సీలో ఏ విధమైన అలజడి కూడా కలగలేదు. సుప్రసిద్ధ చరిత్రకారుడు డా. సురేంద్రనాథ్ ఇలా అన్నారు. "సైన్యంలో కొద్దిగా అశాంతి చిహ్నాలు కనిపించినప్పటికీ, విప్లవం జరిగిన కాలంలో మద్రాసు ప్రెసిడెన్సీ నిశ్చలంగా వుంది. విద్యావంతులు శాంతి భద్రతలు నెలకొల్పడానికి సాయపడుతూ,

విప్లవాన్ని అసందిగ్ధంగా ఖండించారు" ఏజెన్సీ ప్రాంతంలో కొన్ని అలజడులు జరిగాయి కానీ ఉత్తరాదిలో జరిగిన సంఘటనలతో వీటికి యెటువంటి సంబంధమూలేదు.

1858 సం॥ లో కంపెనీ పాలన అంతమైంది. బ్రిటిష్ రాజరికం ప్రభుత్వాన్ని తీసుకుంది.

సాంఘిక అనుభవాన్ని, దాని ఫలితాల్ని అవి మంచివైనా, చెడువైనా, రికార్డు చేసి వుంచేది చరిత్ర. బ్రిటిష్ రాజరిక పరిపాలన క్రింద తొంభై యేండ్ల కాలంలో, ఆంధ్రులు గడించినసాంఘిక అనుభవం అపూర్వమైనది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, పరిపాలనా రంగాలలో గొప్ప మార్పులు వచ్చాయి. జీవితం పైన క్రొత్త ఆశయాలు, క్రొత్త దృక్పథాలు ఏర్పడ్డాయి ఇదంతా కొంతవరకు పాలకులు తెలిసీ, తెలియకా ప్రవేశపెట్టిన మార్పుల ఫలితం. కొంగ్రొత్తగా ఏర్పడిన ఆంగ్ల భాషా విద్యాధికుల వర్గపు కార్యకలాపాలు కూడా ఇందుకు కారణం. అనేక సందర్భాలలో వీటిమధ్య ఒకవిధమైన ఘర్షణ ఏర్పడింది.

## ప్రభుత్వంలో భాగస్వామ్యం

మన దేశంలో గతకొన్ని శతాబ్దాల మంచీ, ప్రభుత్వంలో ప్రజలకు ఏమాత్రమూ భాగస్వామ్యం వుండేదికాదు. వారికి వున్న కొద్దిపాటి బాధ్యత గ్రామవిషయాల వరకు మాత్రమే పరిమితమై వుండేది. 1857–58 సం॥ లో విప్లవం అణచివేయబడిన తరువాత కొన్ని దశాబ్దాలలో, ప్రజాభిప్రాయాన్ని కనుగొనేందుకై కొన్ని ప్రాతినిధ్య సంస్థలను ఏర్పాటుచేయవలసిన అవసరాన్ని బ్రిటిష్ వారు గుర్తించారు. ఈ విధమైన సంస్థలను ఏర్పాటుచేయాలని విద్యావంతులు కోరడం ఆరంభించారు. 1880 సంవత్సరం నాటికి, ప్రజా జీవితంలో ఈ వర్గపు ప్రజల ప్రభావం చాలా ప్రధానపాత్ర వహించింది. 1885 సం॥ లో ఇండియన్ నేషనల్ కాంగ్రెసు ఏర్పడడంతో వీరికోరిక మరీ ప్రబలమైంది. సక్రమంగానడిచే వ్యవస్థ ఏర్పడింది. కాంగ్రెసు కార్యకలాపాలలో అనేకమంది ఆంధ్రులు చాలా ప్రముఖపాత్ర వహించారు. ఈ ప్రాంతపు ప్రజలలో రాజకీయ చైతన్యం తీసుకొని రావడానికి తోడ్పడ్డారు.

1892, 1907, 1919 సం॥ పు చట్టాల క్రింద ఏర్పడిన విస్తృత శాసనసభల్లో ఆంధ్రులకు వారి భాగస్వామ్యానికి తగిన ప్రాతినిధ్యం లభించింది. మద్రాసు గవర్నరు, వైస్‌రాయ్ ఎక్జిక్యూటివ్ కౌన్సిళ్ళలో భారతీయులను తీసుకోవడం జరిగినప్పుడు వాటిలో బొబ్బిలి మహారాజా, బి. ఎన్. శర్మ వంటి ఆంధ్రులకు స్థానం లభించింది. 1918 వ సం॥ చట్టపు ద్వంద్వపరిపాలనా పథకం క్రింద, 1920 నుంచి 1926 వరకు మంత్రి వర్గాలను ఏర్పాటుచేసి, వాటిని నడిపించడంలో ఆంధ్రులు ప్రముఖపాత్ర వహించారు. 1935 వ సం॥ చట్టంక్రింద మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ నిర్వహణలో వారి భాగస్వామ్యం యెక్కువగానే వుంది. ఈ తొంభై యేండ్ల కాలంలో స్థానిక స్వయం పరిపాలనా సంస్థలు అంటే మునిసిపల్ కౌన్సిళ్ళు, తాలూకా జిల్లాబోర్డులు, గ్రామ పంచాయతీల ఏర్పాటుకు కారణమైన అనేక శాసనాలు తయారు చేయబడ్డాయి. ఇలాంటి సంస్థలు ఆంధ్రలో ఏర్పడినాయి. వాటిద్వారా స్థానిక స్వపరిపాలన అంటే యేమిటో ప్రజలు తెలుసుకోగలిగారు. ఇవన్నీ వారికి వినూత్న రాజకీయ అనుభవం కలగడానికి దోహదం చేశాయి.

## పరిపాలనా సంబంధమైన మార్పులు

ఈ కాలంలో అత్యంత సమర్థవంతమైన పరిపాలనాపద్ధతి ప్రవేశపెట్టబడింది. పబ్లిక్ వర్క్సు, పోలీసువంటి పురాతన శాఖల్ని పటిష్ఠంచేయడం జరిగింది. వ్యవసాయం, అడవులు, సహకారంవంటి క్రొత్తశాఖలు ఏర్పాటుచేయబడ్డాయి. ప్రజల జీవితంపైన వీటి ప్రభావం పడింది.

## జనాభా పెరుగుదల

ఆంధ్ర ఆర్థిక పరిస్థితుల్లో గణనీయమైన మార్పులు సంభవించాయి. శాంతి భద్రతలు ఏర్పడటంవల్లనూ, కరువు కాటకాల తీవ్రత తగ్గడంవల్లనూ, ఆహార పంటల ఉత్పత్తి అధికంకావడం వల్లనూ, ప్రజారోగ్య చర్యలు తీసుకోవడంవల్లనూ, జనాభా పెరిగింది. 1800–1850 మధ్య జనాభా రెండింతలైంది. 1851 లో జనాభా సుమారు 12 మిలియన్లువుంది. 1871 నాటికి ఇది 25 మిలియన్లకు పెరిగింది.

## వ్యవసాయం

1858 వ సంవత్సరం తరువాత కూడా చేతి పరిశ్రమలు పతనావస్థలో వున్నందువల్ల వ్యవసాయం ఒక్కటే ప్రజలకు ప్రధానమైన వృత్తి అయింది. ఎక్కువ భూమి సాగుక్రిందికి తేబడింది. ఆంధ్ర ప్రాంతంలో పెక్కు చోట్లలో వ్యవసాయదారుల గిరాకీకి తగినంత భూమి లభించేది కాదు. ఇప్పటి పరిస్థితికీ ఇంతకు కొన్ని శతాబ్దాలకు ముందువున్న పరిస్థితికీ చాలా తేడా వుండేది. ఆ కాలంలో లభ్యమగు భూమిని సాగుచేయడానికి వలసినంతమంది ప్రజలను తీసుకొని రావడంలో ఇబ్బందికి గురికావలసి వచ్చేది.

ఈ కాలంలో ప్రత్తి, పొగాకు, వేరుసెనగ, ఇతర నూనెగింజలు, జనుమువంటి వాణిజ్య నగదు పంటలను పండించడానికి యెక్కువ శ్రద్ధ వహించబడింది. అనేక

సంవత్సరాలుగా రైతులకు అధిక లాభం కలిగినప్పటికీ, విదేశీ మార్కెట్లపైన మరీ యెక్కువగా ఆధారపడవలసి వచ్చింది. నీటి వనరులక్రింద యెక్కువ భూమి సాగు క్రిందికి తేబడింది. రైతులకు సరసమైన పరపతి సౌకర్యాలు కల్పించడానికి సహకార సంఘాలు స్థాపించబడ్డాయి. మేలిరకం వ్యవసాయ పనిముట్లు, రసాయనిక ఎరువులు, మేలురకం విత్తనాలు మున్నగు వాటిని వినియోగించి శాస్త్రీయపద్ధతిలో వ్యవసాయం చేయడానికి క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టబడినాయి.

## రవాణా సౌకర్యాలు

రవాణా సౌకర్యాల విషయంలో యెంతో అభివృద్ధి సాధించబడింది. 1947 వ సం॥ నాటికి 13,000 మైళ్ళ మెటల్‌రోడ్లు 1600 మైళ్ళ రైల్వేలు వున్నాయి. యాంత్రిక రోడ్డు రవాణాకూడా అభివృద్ధి చెందింది. వెయ్యిమైళ్ళ పొడవుగల కాలవలు త్రవ్వబడ్డాయి. వీటన్నిటి ఫలితంగా, స్వదేశీ, విదేశీ వ్యాపార వాణిజ్యాలు చాలా యెక్కువగా కొనసాగడానికి అవకాశం ఏర్పడింది. పూర్వకాలంలో, తయారైన వస్తువులు మాత్రమే యెగుమతి అయ్యేవి. కానీ ఆ తరువాత ముడి పదార్థాలు యెగుమతి అయ్యేవి. ఈ ప్రాంతంలో పారిశ్రామిక పతనం ఏర్పడిందనడానికి ఇది ఒక నిదర్శన. దీనితోపాటు మచిలీపట్నం, కాకినాడ, భీమునిపట్నంవంటి అనేక పురాతన రేవు పట్టణాల సంపద కూడా క్షీణించింది. దీనికి నష్టపరిహారంగా విశాఖపట్నం ప్రాముఖ్యత పెరిగింది.

## క్రొత్త వృత్తులు

క్షేతిపరిశ్రమలు పతనం చెందటం, వ్యవసాయంపైన అధికంగా ఆధారపడటం, రవాణాసౌకర్యాలు అభివృద్ధి చెందటంవల్ల ముఖ్యంగా పల్లెప్రాంతాల్లో విప్లవాత్మకమైన గొప్పమార్పు వచ్చింది. పట్టణప్రాంతాలలో ప్రభుత్వ సర్వీసు, వైద్యం, ఉపాధ్యాయ, న్యాయవాదవృత్తులు, పబ్లిక్‌వర్కుల్సకొరకు కంట్రాక్టులు తీసుకోవడం, చిల్లరదుకాణాలు నడపడంవంటి క్రొత్త వృత్తులు అత్యంత ప్రాధాన్యతవహించాయి. పాశ్చాత్య ప్రపంచంతో సంబంధం ఏర్పడటంతో ప్రజల ఆర్థిక దృక్పథంలో మార్పువచ్చింది. దారిద్ర్యాన్ని రూపుమాపవచ్చని వారు భావించారు. నిరాడంబరమైన పాతకాలపు భావాలు విస్మరించబడ్డాయి. జీవనస్థాయిని పెంపొందించాలనే ఆకాంక్ష ప్రబలమైంది.

## సంఘ సంస్కరణ

సాంఘిక జీవితంలోకూడా ఎన్నో గొప్ప మార్పులు వచ్చాయి. కుల ప్రాతిపదికపైన ఏర్పడిన సాంఘిక వ్యవస్థ స్త్రీలపైన విధించిన నిర్బంధాలు అశ్పృశ్యత, వివాహ సాంప్రదాయాలు, సాంప్రదాయకమైన ఆహార విహారాలకు సంబంధించిన కఠోర నిబంధనలపైనా పెద్ద దాడి జరిగింది. సమానత, స్వాతంత్ర్యాల పట్ల ఆకాంక్ష ఎక్కువైంది. సమిష్టి కుటుంబ పద్ధతిపైన కూడా ప్రతిఘటన ఏర్పడింది. వీరేశలింగం పంతులు వంటి ప్రముఖ వ్యక్తులు సంఘ సంస్కరణోద్యమాన్ని లేవదీశారు. ఈ కాలపు సాంఘిక చరిత్ర చాలవరకూ సనాతనులకూ, సంఘ సంస్కరణాభిలాషులకూ మధ్య కలిగిన వివాదాన్ని ఆవరించి వుంది. 1917 లో జస్టిస్ పార్టీ ఏర్పడిన తరువాత, బ్రాహ్మణేతర ఉద్యమం ఉధృతంగా కొనసాగింది. ఈ కాలమంతా కొనసాగిన సాంఘిక విప్లవంలో ఈ ఉద్యమం ఒక అంతర్భాగం. విద్య, వ్యాపారాల నిమిత్తం విదేశాలకు కూడా ప్రయాణం చేయవలసిన అవసరం ఏర్పడటం, దేశంలో రైలు ప్రయాణాలు కొనసాగడం, ఉద్యోగాన్వేషణకై పట్టణాలకు వలసపోవడం, స్త్రీ పురుషులలో విద్య వ్యాప్తి చెందడం – ఇవన్నీ కలిసి సాంప్రదాయకమైన సాంఘిక వ్యవస్థనూ, కుల మతాల కట్టుబాట్లనూ సడలించడానికి దోహదం కలిగించాయి. కులం అనేది ఇంకా కొనసాగుతూనేవుంది. కానీ అనూచాయంగా వస్తున్న ఆచార పద్ధతులు పూర్తిగా అంతరించిపోయాయని చెప్పవచ్చు. ఏండ్లతరబడి ఉన్నతస్థితిలోవుంటూ వచ్చిన ఉన్నత కులాలవారు తమ స్థాయిని కోల్పోయారు. హరిజనులు తమకు సంక్రమించవలసిన స్థాయికి వస్తున్నారు. స్త్రీలకు ఇదివరకు వుంటున్న ప్రతిబంధకాలు ఇప్పుడు లేవు. విడాకులివ్వడం చట్టబద్ధం చేయబడింది. బహుభార్యాత్వం నశించిపోయింది. వివాహపు వయస్సు పెంచబడింది. 1800 సం॥లో వున్న సాంఘిక వ్యవస్థకూ, ఇప్పుడున్న సాంఘికవ్యవస్థకూ ఎక్కడా పోలికలేదు.

## సాంస్కృతిక మార్పులు

సంస్కృతీ, మతవిషయాలలో గొప్ప మార్పులు వచ్చాయి. 1800 లలో చదువు, పాండిత్యమంటే, సంస్కృతం, వేదవేదాంగాలు, పురాణాలలో పాండిత్యం సంపాదించడమన్నమాట. ఈ చదువునే రాజులూ, ప్రజలూ అమితంగా గౌరవించేవారు. ఆంధ్రదేశమంతటా పాఠశాలలు వ్యాప్తిలో వుండేవి. వీటిల్లో అనేక శతాబ్దాలుగా సాంప్రదాయకమైన పద్ధతులలో ఈ శాస్త్రాలలో విద్యాబోధన జరిగేది. ఈ విద్యా సంస్థలలో విద్య నభ్యసించేవారికి అధిక ధనార్జనకు దోహదంకల్గించే ఉద్యోగాలు లభించేవి. ఈ పాఠశాలల్లో అన్నివర్గాల

ప్రజలూ చదువుకోవడానికి వీలుండేది. వ్యక్తిత్వం, సమానత, స్వాతంత్ర్యం అనే పాశ్చాత్య ఆశయాలతో కూడిన కొత్త రకపు విద్యావంతుల వర్గం ఒకటి బయలు దేరింది. సాంప్రదాయసిద్ధమైన మతంపట్ల అభిమానం తగ్గింది. క్రైస్తవ మిషనరీలు, బ్రహ్మసమాజం కలసి పాతపద్ధతులపైన దాడి ఆరంభించాయి. ఇదే సమయంలో ఆధునిక విజ్ఞానదృష్ట్యా హిందూమతాన్ని వివరించి అందులోవున్న కొన్ని లోపాలను తొలగించడానికి ప్రయత్నాలు జరిగాయి. ఆంధ్రలో అనేక శాఖలువున్న దివ్యజ్ఞాన సమాజం, రాజమండ్రిలోని హిందూ సమాజం, రామకృష్ణ మఠం శాఖలు, సత్సంఘాలు ఆరంభించిన క్రొత్త సంస్థలు, ఇటీవలి కాలంలోని హరినాధ్‌బాబా, శ్రీ బాబా అనుచరులు ఈ విషయమై కృషి చేస్తున్నారు. సాహిత్యోద్యమాలుకూడా ఆరంభమైనాయి. ఆంధ్ర సాంప్రదాయక సంస్కృతిని తీర్చిదిద్దడానికి ఇవన్నీ కారణభూతాలైనాయి. సాంస్కృతిక చరిత్రలో సంధియుగం ఆరంభమైంది.

## స్వాతంత్ర్యోద్యమం

ఈ పూర్వరంగాన్ని దృష్టిలో వుంచుకొని -ఆంధ్రలో జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని- దేశస్వాతంత్ర్యానికై ఆంధ్రులు వహించిన పాత్రను – గూర్చి పరిశీలించాలి. బెంగాలు విభజనతోను, 1907 లో బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రలో పర్యటన చేయడంతోను ప్రజల్లో రాజకీయ చైతన్యం కల్గింది. ఇదే కాలంలో బాంబులు మున్నగు వాటి ప్రయోగంలో విశ్వాసం వున్న ఆరాచకులు కూడా కొంత మంది ఆంధ్రకు వచ్చారు. అయితే, వారి ఉద్యమానికి ఇక్కడ ప్రోత్సాహం లభించ లేదు. 1920 లో గాంధీమహాత్ముడు సహాయ నిరాకరణోద్యమం ఆరంభించడంతో స్వాతంత్ర్యోద్యమం రెండవ ఘట్టంలోకి వచ్చింది. ఈ ఉద్యమంలో ఆంధ్రులు, అధిక సంఖ్యలో సమధికోత్సాహంతో పాల్గొన్నారు. ఆంధ్రులు ముఖ్యంగా నెల్లూరు ప్రజలు 1921 లో ఆబ్కారీ బహిష్కరణలో సాధించిన విజయం, దుగ్గిరాల గోపాల కృష్ణయ్య నాయకత్వాన చీరాల ప్రజలు చేసిన పోరాటం, పల్నాడు ప్రజలు నిర్వహించిన అడవుల సత్యాగ్రహం, పెదనందిపాడు రైతులు కొనసాగించిన పన్నుల బహిష్కరణోద్యమం, యావద్భారత దేశ దృష్టిని ఆకర్షించాయి. పన్నుల బహిష్కరణోద్యమం భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడ గడ లాడించింది. ఆతరువాత 1922–24 లో అల్లూరి సీతారామరాజు రెండేండ్ల వరకు క్షాత్ర ధర్మంతో పోరాడుతూ బ్రిటిష్ వారిని ఉక్కిరి బిక్కిరి చేశాడు. 1930 లో ఆంధ్రలో ప్రతి జిల్లాలో ఉప్పు సత్యాగ్రహం మహోధృతంగా కొనసాగినపుడు, స్త్రీ పురుషులందరూ దేశస్వాతంత్ర్య సమరంలో ప్రముఖపాత్ర వహించి మహదానందంతో కారాగార శిక్షలు అనుభవించారు. 1942 లోని క్విట్ ఇండియా ఉద్యమం, అదే సంవత్సరంలో జరిగిన ఆగస్టు విప్లవంలో ఆంధ్రులు వహించిన పాత్ర అల్పమైనది కాదు. 19వ శతాబ్దపు పూర్వభాగంలో ఆంధ్ర చరిత్రలో ఈ సంఘటనలన్నీ కలిస్తే ఒక మహోజ్వల ఘట్టం అవుతుంది.

## ఆంధ్రోద్యమం

జాతియోద్యమంతోపాటు, ఆంధ్రప్రజలు తమ వ్యక్తిత్వం కాపాడుకోవడానికి భారత జాతిలో అంతర్భాగంగా ఆంధ్రోద్యమాన్ని ఆరంభించారు. మద్రాసు ప్రెసిడెన్సీలోని తెలుగు భాషమాట్లాడే జిల్లాలలో ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలనే లక్ష్యంతో ఈ ఉద్యమం బయలుదేరింది. 1912లో బాపట్లలో జరిగిన ఆంధ్రమహాసభలో తొలిసారిగా ఈ విషయం చర్చకు వచ్చింది. సర్కారుప్రజలు దీనికి ప్రోత్సాహం యిచ్చారు. కాని చాలాకాలం వరకు నెల్లూరు, చిత్తూరు, రాయలసీమ ప్రజలుదీనికి సుముఖత చూపలేదు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంకావాలని కోరినవారు తమ ఆందోళనను కొనసాగించారు. దీన్నిగూర్చి రాయలసీమ జిల్లాల్లో ప్రజలకు నచ్చజెప్పారు. ఆ ప్రజల ప్రయోజనాల్ని కాపాడడానికి కొన్ని వాగ్దానాలు చేశారు. అనేక సందర్భాల్లో మద్రాసు శాసనసభలో దీనికి అనుకూలంగా తీర్మానాలను ఆమోదింపజేశారు. భాషా ప్రాతిపదికపైన రాష్ట్రీయ కాంగ్రెసు సంస్థ ఏర్పడడంతో ఈ ఉద్యమానికి మరింత బలం చేకూరింది. 1917 లో సెక్రటరీ ఆఫ్ స్టేట్ భారతదేశాన్ని సందర్శించినపుడు ఇందుకొరకు ఆయనవద్దకు ప్రతినిధివర్గం వెళ్ళింది. 1919 సం॥పు భారత ప్రభుత్వ బిల్లుపై ఏర్పడిన పార్లమెంటరీ కమిటీ సంయుక్త కార్యదర్శికీ, 1929 లో సైమన్ కమీషన్‌కూ, 1930–31 లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశానికీ ఈ విషయం నివేదించబడింది. 1947 లో ప్రజాభిప్రాయం, ప్రభుత్వాభిప్రాయం ఇందుకు సుముఖంగా వుంది. స్వతంత్ర భారతదేశానికి రాజ్యాంగం రూపొందించడానికి నిర్దేశించబడిన రాజ్యాంగ సభ ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటుచేసే అవకాశం ఏర్పడింది.

పైన పేర్కొన్న విధంగా ఆంధ్ర చరిత్రలో 1800 నుంచి 1947 వరకు జరిగిన ప్రధానఘట్టాల సంక్షిప్త వివరణను పరిశీలించేట్లయితే, గత ఒకటిన్నర శతాబ్దకాలంలో ఏవిధంగా ప్రజలరాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవితంలో విప్లవాత్మకమైన

(మిగతా 48 వ పేజీలో)

# ప్రశ్నలు–సమాధానాలు

*శ్రీ పన్నిసెట్టి అప్పలరాజు, సాలూరు, శ్రీకాకుళంజిల్లా.*

ప్రశ్న : మా పట్టణ జనాభా 50 వేలు. తగిన సైజులో మాకు పబ్లిక్ లైబ్రరీ కావాలంటే, మేము యేమిచేయాలి ?

సమా : 1960 వ సం॥పు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ లైబ్రరీల చట్టం క్రింద శ్రీకాకుళంజిల్లాలో లోకల్ లైబ్రరీ అథారిటీ ఏర్పడిన తరువాత అది సమావేశమైనప్పుడు సాలూరులో బ్రాంచి లైబ్రరీ తెరిచే విషయం దానిముందు వుంచబడుతుంది. ఈ లోకల్ లైబ్రరీ అథారిటీ చేసే సిఫార్సులపైన ఎయిడెడ్ లైబ్రరీలకు విద్యాశాఖ గ్రాంట్లు మంజూరు చేస్తుంది.

*కుమారి బి.కే.యస్. లక్ష్మి, బసివిరెడ్డిపేట, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా.*

ప్ర : ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లో సెకండరీ, బహుళార్థసాధక పాఠశాలల్లో సమీకృత పాఠ్య ప్రణాళికలు ఎప్పుడు ప్రవేశపెట్టబడుతాయి ?

స : ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో హైయ్యర్ సెకండరీ, బహుళార్థసాధక పాఠశాలల కొరకు రూపొందించబడిన సమీకృత పాఠ్య ప్రణాళిక ముసాయిదా ఇంకా ప్రభుత్వ ఆమోదం పొందవలసి వుంది. ప్రస్తుత పరిస్థితినిబట్టి మార్పు చేయబడిన పాఠ్య ప్రణాళికలు స్కూళ్లల్లో 1963–64 సం॥లో ప్రవేశపెట్టబడక పోవచ్చు.

*శ్రీ కాటిగ శ్రీరామమూర్తి, నాగాయలంక, కృష్ణాజిల్లా.*

ప్ర : ఆంధ్రప్రదేశ్‌లో చేనేత పరిశ్రమకు సంబంధించిన సమాచారాన్ని అంటే మగ్గాలసంఖ్య, కార్మికులసంఖ్య, వస్త్రాల ఉత్పత్తి మున్నగు వాటిని గూర్చి దయచేసి వివరంగా తెలపండి.

స : ఈ రాష్ట్రంలో 13.5 లక్షల మంది చేనేత పరిశ్రమలో పనిచేస్తున్నారు. మగ్గాలసంఖ్య 4.5 లక్షలు. వీటిలో 2.58 లక్షలు సహకార రంగంలో వున్నాయి. 1961–62 సం॥లో రూ. 677 లక్షల మేరకు బట్టల విక్రయం జరిగింది. ఇదే సంవత్సరంలో రూ. 654 లక్షల మేరకు ఉత్పత్తి అయింది. రాష్ట్రంలోని సహకార మిల్లులు ఇవి: ఆంధ్ర కోఆపరేటివ్ స్పిన్నింగ్‌మిల్స్, గుంతకల్లు, నేతా కోఆపరేటివ్ స్పిన్నింగ్‌మిల్స్ హైద్రాబాదు, చీరాల కోఆపరేటివ్ స్పిన్నింగ్‌మిల్స్, చీరాల. 1961–62 సం॥లో 9795 బేళ్ళ నూలు (20 కౌంట్లు) ఉత్పత్తి అయింది. ఈ రాష్ట్రంలో అన్ని రకాల కౌంట్లు కలిసి నెల 1 కి 16,000 బేళ్ళ నూలు అవసరమవుతుంది.

చేతిమగ్గాలకు సాంకేతిక శిక్షణ కేంద్రాన్ని ఆరంభించడానికి విజయవాడలోని ఆంధ్ర చేనేత కార్మికుల సహకార సంఘం ఒక పథకాన్ని రూపొందించింది. ఇది పరిశీలనలో వుంది.

*శ్రీ జె. వెంకటరామనరసయ్య, వర్ధన్నపేట, వరంగల్లుజిల్లా.*

ప్ర : ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని చోట్లకు మేయర్లు వున్నారు ? అనతి కాలంలో కార్పొరేషన్లు ఏర్పడే పట్టణాలు ఏవైనా వున్నాయా ?

స : ఆంధ్రప్రదేశ్‌లో మేయరు ఒక్క హైద్రాబాదు నగరానికి మాత్రమే ఉన్నారు. అనతికాలంలో కార్పొరేషన్లుగా ఏర్పడే పట్టణాలు రాష్ట్రంలో లేవు.

*శ్రీ జి. పాండురంగస్వామి, తుంగతుర్తి, సూర్యాపేట తాలూకా, నల్గొండజిల్లా.*

ప్ర : ఇండియన్ మెడిసిన్ బోర్డు ఆంధ్రలో ప్రాక్టీషనర్లను రిజిస్టరు చేస్తున్నదని చెప్పబడుతున్నది. తెలంగాణాలో కూడా ప్రాక్టీషనర్లను రిజిస్టరు చేయడానికి ప్రభుత్వం అనుమతి యిచ్చిందా ?

స : ఇండియన్ మెడిసిన్ బోర్డు 1312 ఫసలీ, హైద్రాబాదు వైద్య చట్టం నెం. 1 లోని 2 వ సెక్షన్ క్రింద ఆయుర్వేద యూనానీ, హోమియోపతి మెడికల్ ప్రాక్టీషనర్లను రిజిస్టరు చేస్తున్నది.

రిజిస్ట్రేషన్ సబ్-కమిటీ, అర్హత లేని ప్రాక్టీషనర్లకు పరీక్ష పెడుతున్నది. ఉత్తీర్ణులైన అభ్యర్థుల పేర్లు, వాటిని ఛాయపరచే నిమిత్తం పూర్తి బోర్డు సమావేశమందు వుంచబడ్డాయి. ఛాయమైన తరువాత, ఆంధ్రప్రదేశ్ హైద్రాబాదులోని ఇండియన్ మెడిసిన్ బోర్డు కార్యదర్శి సంతకంతో సర్టిఫికెట్లు జారీ చేయబడుతాయి. ఇందుకొరకు ప్రభుత్వ మంజూరీ అవసరంలేదు. ★

# పదిసముల్లాసాలు

*[శివుఁడు నందికేశ్వరుని మర్త్యమున*
*బసవేశ్వరుఁడుగా జనింపఁ బంపుట]*

"ఇది శ్రుతిస్మృతిమూల మిది ధర్మశీల
మిది విమలాచార మిది తత్త్వసార
మిది సుమహత్త (హాత) త్త్వమిది కృతార్థత్వ
మిది యాదిపథ మని విదితంబుగాఁగ
నీకతంబునన నిర్ణీతమై భక్తి
లోకంబునం దవలోకింపఁబడియెఁ
బ్రమథాధిపతులకుఁ బార్వతీసతికి
విమలమదీయతత్త్వముఁ బ్రబోధించు

తెఱఁగునకంతెను దెల్లంబుగాఁగ
నెఱిఁగించితిమి నీకు నెక్కుడుఁ గూర్మి
నట్టిద; సర్వజ్ఞుఁ డనుపేరు నీకు
నిట్టట్టునా వల దెల్లచోఁ జెల్లుఁ
గాన యామర్త్యలోకమ్మున కరిగి
పూని ద్వితీయశంభుం డన మహిమ
వ్యక్తిగా లోకహితార్థంబు సకల
భక్తహితార్థంబు పరమార్థముగను
మా వినోదార్థంబు మర్త్యంబుఁ బరమ
పావనంబుగఁ జేయు బసవఁ డన్వేర"
నావుడు గేల్మోడ్చి నందికేశ్వరుఁడు
దావిన్నపము చేసె దేవదేవునకు
"మీయాజ్ఞఁ దలమోచి మెయికొని పనులు
సేయుదు నన్నింత సెప్పంగనేల?
మర్త్యలోకమునకు మఱి వేఱయొకఁడు
గర్త యున్నాఁడె లోకత్రయవరద!
ఇందున్న నేమి ? నా కందున్న నేమి ?
యెందున్న నేమి ? నీయంద నా యునికి"
అని విన్నవించిన యానందికేశు
వినయోక్తులకు జగద్విభుఁ డిట్టులనియె,

"గురులింగమూర్తిఁ జేకొని వచ్చియేన
పరమతత్త్వార్థతత్పరుఁ జేయువాఁడఁ
బ్రాణలింగంబనై భ్రాజిల్లి నీదు
ప్రాణాంగముల నొడఁబడి యుండువాడ
రూఢిగా జంగమరూపంబుఁ దాల్చి
వేడుక నినుఁ గూడి విహరించువాఁడఁ
దనుమనోధనములు దారవోకుండఁ
దనుఁ జేర్చికొనువాడ ననఁగి పెనంగి
నాప్రాణములకుఁ బ్రాణం బగుచున్న
నా ప్రమథులకుఁ బ్రాణం బగు నీకు
నాకును సందొక్కనాడు లేకునికి
నీకుఁ దెల్లముగాదె లోకపావనుఁడ?"
అని యాఱడిలఁ బల్కు నాశంకరున్షకుఁ
దను వెల్లఁ జేతులై తా మ్రొక్కినిలిచి
"విన్నపంబేఁ బనివినియెద" ననుచు
నన్నందికేశుండు సాష్టాంగ మెరఁగి
ప్రమథసన్నిహితుఁడై భ్రాజిల్లు శివుని
నమిత తేజోమూర్తి నాత్మలోనిలిపి
నరలోక మల్లదె నా నింతనంత
నరుదెంచె రయమున; నంత నిక్కడను.

*[బసవేశ్వరుని బాస]*

శివరాత్రి నిత్యంబు చెల్లించుబాస
శివభక్తు లెల్లను శివుఁ డనుబాస
భక్తుల యెగ్గులు బట్టనిబాస
భక్తులకుల మెత్తిపలుకనిబాస
మృదునైన నొకమరి యడుగనిబాస
యడిగిన యర్థంబు గడపనిబాస
చీమంతయైన వంచింపనిబాస
యేమి వేఁడిన నడుగిడ కిచ్చుబాస

తలఁ బెట్టు లట్టుల పలికెడు బాస
పలుకట్ల నడవడిఁ బాలించుబాస
పలికి బొంకనిబాస వాలివోనిబాస
చల మెడపనిబాస సలిపెడిబాస
తప్పఁ ద్రొక్కనిబాస దరలనిబాస
యెప్పుడు భృత్యత్వ మెడపనిబాస
కలనైన శివునకు గెలు పీనిబాస
గెలుపు భక్తుల కిచ్చి కీడ్పడుబాస
పరసతిపై దృష్టి పఱపనిబాస
పరధనంబుల కాసపడకుండు బాస
పరనింద నెయ్యడఁ బొరయనిబాస
పరమర్మకర్మముల్ పలుకనిబాస
పరసమయంబులఁ బరిమార్చుబాస
పరపాదులను బట్టి ఖండించుబాస
హరదూషణకుఁ జెవు లాననిబాస
హరగణానర్పితం బంటనిబాస
హరగణపరతంత్రుఁడై యుండుబాస
హరభక్తు లెట్లన్న నట్లను బాస
జంగమంబును బ్రాణలింగ మన్బాస
వెంగలిమనుజుల వేఁడనిబాస
భవికి మ్రొక్కనిబాస భవి కీనిబాస
భవబాధలకు నగపడకుండుబాస
విషయేంద్రియములకు వెన్నీనిబాస
విషమషడ్వర్గంబు విరియించుబాస
వేదోక్తభక్తి సంపాదించుబాస
యాది శివాచార మలరించుబాస
శిర మట్టఁ బాసిన శర ణనుబాస
శిరమున కట్ట వాసిన మ్రొక్కుబాస
ముట్టినచో వెన్క మెట్టనిబాస
యిట్టివన్నియుఁ దుదముట్టించుబాస.

*[బసవేశ్వరుని శివాచారనిరతి]*

మంగళహాత్పోదితాంగవిక్రియల
సంగతి నాత్మ నుప్పొంగి యుప్పొంగి
భయభక్తియుక్తి దద్భక్తాంఘ్రిచయము
పయిఁ జక్కఁజాఁగిలఁబడి మ్రొక్కి మ్రొక్కి
పటుతర సద్భక్తదాపాబ్జరేణు
పటలపర్యంకంబుపైఁ బొర్లి పొర్లి
హరభక్తనికరదయామృతవృష్టి
పరిగొని కురియఁ దొప్పఁగ తోఁగి తోఁగి
యొడయల దివ్యపాదోదకవార్ధి
నడునీటఁ గడువేడ్కఁబడి తేలి తేలి
వరభక్తసందోహపరితోషితార్థ
పరమసపర్యాసంపద వ్రాలి వ్రాలి
మతిలింగజంగమోచితపరతత్త్వ
సతతశివార్చనారతి సోలి సోలి
శరణనిర్మలనిత్యసత్యప్రసాద
వరసేవనక్రీడ వడిఁ గ్రాలి క్రాలి
చారువచోవిలాసంబులఁ దనర
నోరార వారి సన్నుతిసేసి చేసి
వారిమనోలత వడిఁ జుట్టి చుట్టి
సారగాంధర్వరసముఁ గ్రోలి క్రోలి
దరహసితాస్యవిస్ఫురణయుఁ దనర
హరగణాస్థానంబునం దాడి యాడి
నిక్కంపు భక్తికి నిక్కమై తన్నుఁ
దక్కి యెంతయు భక్తిఁ దాఁ జొక్కి చొక్కి
యనవరతము నీప్సితార్థుల కర్థిఁ
తనుమనోధనము లప్పన సేసి చేసి
యందంద పరమతత్త్వానుభవార్థు
లందత్త్వసౌఖ్యజలధి ముంచి ముంచి
ప్రవిమలభక్తి సంపత్సుభార్థులను
బ్రవిమలభక్తిసంపద దేల్చి తేల్చి
యారంగఁ గామసుఖాపేక్షితులను
శ్రీ (స్త్రీ?) రత్నరాజిఁ బూజించి పూజించి
వరరత్న భూషణోత్కరధనార్థులను
వరవస్త్రభూషణావలిఁ దన్పి తన్పి
రాజవదుపచారపూజనార్థులను
రాజవదుపచారరతిఁ గొల్చి కొల్చి
యష్టాంగభక్తిక్రియాసుఖార్థులను
నష్టాంగభక్తిక్రియలఁ బూన్చి పూన్చి
శీలసంబంధులశీలంబు లెఱిఁగి
శీలసంబంధనుస్థితి నుంచి యుంచి

నియమవ్రతాధికనిష్ఠితాత్మకులఁ
ప్రియవస్తుసమితి నర్చించి యర్చించి
బసవఁ డీక్రమమున భక్తిసామ్రాజ్య
మెసకంబుతోఁ జేయునెడ లసత్ప్రీతి
"ముప్పూఁట నోగిరంబులుఁ బదార్థములుఁ
దప్పక కావళ్ల నెప్పుడుఁ బంప
వెండి వేశ్యలయిండ్ల నుండి భోగించు
మిండజంగములు పండ్రెండువే లనిన
నున్న జంగమసంఖ్య మున్ను రూపించి
యెన్నంగ శక్యమే యీశునకైన"
ననుచు భక్తానీక మచ్చెరువంద
ననయంబు భూతిశాసను లాదిగాఁగ
నెల్లభక్తావళి కీప్సితార్థములు
నెల్లించుచును భక్తిసేయుచున్నెడను;

[బసవని మేనల్లుఁడు చెన్నబసవని మహిమ]

బరమేశుభక్తియ ప్రాణమై పరగు
తరుణి యా నాగాంబవరతనూభవుఁడు
ప్రస్తుతింపఁగ నొప్పుబసవ కారుణ్యా
హస్తసంభూతప్రశస్తదేహుండు
నసదృశభక్తి యోగాత్ముండు చెన్న
బసవండు గురుభక్తి పాత్రోత్తముండు
సర్వాంగలింగి సంసారనిస్సంగి
గర్వాపహారి ప్రాక్తనశివాచారి
సారగుణాన్వేషి సరససంభాషి
కారుణ్యరాశి లింగమనఃప్రవేశి
యగణితసుఖశీలి యతిదయాశాలి
. నిగమార్థసంవేది నిచితప్రమోది
విరహితోభయకర్మి వరలింగధర్మి
యరివర్గసంహారి యాత్మోపకారి
లింగాభిమాని యభంగురజ్ఞాని
సాంగత్యసువిధాని సతతావధాని
పరమానురాగి సద్భక్తి సంభోగి
గిరసభవత్యాగి విమలాత్మయోగి
సత్యసల్లాపి ప్రసన్నస్వరూపి
నిత్యప్రతాపి వినిర్గతపాపి
యీశ్వరమూర్తి యతీంద్రియవర్తి
శాశ్వతకీర్తి ప్రసాదప్రపూర్తి
యనఁగ నిట్లొప్పారి యతులితమహిమ
ననుదినవర్ధమానాంగుఁడై యుండ.

[పాల్కురికి సోమనాథుడు — బసవపురాణము]

(44 ఎ పేజీ తరువాయి)

మార్పులు వచ్చాయో స్పష్టంగా తెలుస్తుంది. పాశ్చాత్య దేశాలతో సంబంధం ఏర్పడటం, ఆంగ్లభాషా విద్యావ్యాప్తి చెందడం, ప్రభుత్వం తీసుకొన్న చర్యలఫలితంగా ప్రజల్లో నూతనచైతన్యం గల్గింది. ఈ దృష్ట్యా చూస్తే ఈ కాలం మధ్యయుగం నుంచి బయటపడిన ఆధునిక యుగానికి నాంది వాచకం పలుకుతుంది.

గ్రంథముల వివరణ పట్టిక

ఆంధ్ర చరిత్ర, సంస్కృతిని గూర్చి తెలుగు భాషాసమితి ప్రచురించిన (తెలుగు సంస్కృతి) విజ్ఞానకోశం సంపుటి 3 లో 451-73, 511-17 పేజీలలో వివరంగా పేర్కొనబడింది. యం. వెంకటరంగయ్య సంపుటీకరించిన సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశం 4, 5 భాగాలలోని "ఆంధ్రదేశ చరిత్ర" అనే వ్యాసాన్నికూడా చూడవచ్చు. ఆంధ్ర ఆర్థిక చరిత్ర తెలుసుకోవాలంటే శ్రీ ఏ. వి. రామారావు వ్రాసిన ఆంధ్రప్రదేశ్ ఆర్థికాభివృద్ధి (1766-1957) అను గ్రంథాన్ని పరిశీలించాలి. ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర (1800-1905) కు వ్రాసిన ఉపోద్ఘాతంలో రాజాలు, జమీందార్లు, పోలిగర్లు ఆరంభించిన తిరుగుబాట్లనుగూర్చి నేను వివరంగా పేర్కొన్నాను. ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమం చరిత్ర (1921-31) కు వ్రాసిన పీఠికలో సహాయ నిరాకరణోద్యమాన్నిగూర్చి, చీరాల, పల్నాడు, పెదనందిపాడులకు సంబంధించిన సాహస గాధలనుగూర్చి వివరంగా పేర్కొన్నాను. ★



హైద్రాబాదులో జరిగిన మే దినోత్సవ సభలో ముఖ్యమంత్రి ప్రసంగిస్తున్న దృశ్యం.



కారుణ్యం - కాపట్యం : "అగ్గి గుండెలు" అనే నాటకంలో బౌద్ధభిక్షువు వేషంలో చైనా గూఢచారి, "గంగి'' అనే గిరిజన స్త్రీని మోసగిస్తున్న దృశ్యం. ఈ నాటకం ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధాల శాఖ ఆధ్వర్యంలో 1963 ఏప్రిల్ 27 వ తేదీన హైద్రాబాద్‌లో ప్రదర్శింపబడింది.



శ్రీకాకుళం జిల్లాలోని అపురూపమైన తాటిచెట్టు. దీనికి 17 శాఖలున్నాయి.

(పక్క పేజీలో →
హైదరాబాదులో మొహరం వేడుకలు.)



1963 ఏప్రిల్ 27 వ తేదీన హైద్రాబాదులో కవిసమ్మేళనం జరిగిన సందర్భంలో కేంద్ర రేడియో, సమాచారశాఖల మంత్రి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ప్రసంగిస్తున్న దృశ్యం.

కేంద్ర ఆహారమంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ 1963 ఏప్రిల్ 28 వ తేదీన హైద్రాబాద్‌లో ఆవిష్కరించిన సర్దార్ వల్లభాయ్ పటేల్ విగ్రహం.





నల్గొండ జిల్లాలో ఉత్తమ గ్రామస్థుల రేడియో గోష్ఠి కేంద్రంగా నిర్ణయింపబడిన కొర్లపహాడ్ గ్రామస్థుల రేడియో గోష్ఠి కేంద్రానికి 1963 మే 3 వ తేదీన వ్యవసాయ పనిముట్ల రూపంలో బహుమతి అందజేశారు.

# సంగ్రహ ప్రకటనలు

## రక్షణ సిబ్బంది సంక్షేమం

రక్షణసిబ్బంది సంక్షేమార్థం, వారిపై ఆధారపడివున్నవారి సంక్షేమార్థం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నది. ఆక్రమణలోలేని రాష్ట్రప్రభుత్వ బంజరు భూములన్నింటినీ సైన్యంనుండి విడుదలైవచ్చే సైనికుల నిమిత్తం ప్రత్యేకించడం జరిగింది. ప్రభుత్వాసుపత్రులు, చికిత్సాలయాలన్నింటిలోనూ రక్షణసిబ్బందిపై ఆధారపడినవారికి ఉచితంగా వైద్యసహాయం లభింపజేస్తారు.

ఉద్యోగ సాధక కేంద్రాలలో పేర్లు నమోదు చేసుకోవడంలోనూ, ఉద్యోగాలు చూపడంలోనూ రక్షణసిబ్బంది భార్యలకు, వితంతువులకు ప్రాధాన్యత ఇస్తారు. ఈ కేంద్రాలలో జవానుల యుక్తవయస్కులైన కొడుకులకు, కూతుళ్లకు వారివారి యోగ్యతలకు తగిన ఉద్యోగాలు లభింపజేయడంలో ప్రాధాన్యత ఇస్తారు కూడా.

పోరాటంలో నిమగ్నులైవున్న లేక సరిహద్దులో నియమించబడిన రక్షణసిబ్బంది పిల్లలకూ, ఇటీవలి పోరాటంలో అసువులు కోల్పోయిన లేదా దుర్బలులైన వారి పిల్లలకూ ఉచిత విద్యా సౌకర్యాలు కల్పిస్తారు. మూడు రక్షణ బలగాలలోని కంబాటంట్ జె. సి. ఓ. లకు, ఓ. ఆర్. లకుకూడా ఈ సౌకర్యాలు వర్తిస్తాయి.

రక్షణసిబ్బంది పిల్లలు వారు ఇతరత్రా అర్హులైనట్లయితే మెరిట్, మీన్స్‌టెస్టు ప్రాతిపదికపై వేతనాలు, బర్సరీలు, స్కాలర్‌షిప్పులు ఇవ్వడంలో ప్రాధాన్యత ఇస్తారు. ఇంతేగాక వీరివిషయంలోపాఠశాలలు, కళాశాలల ఫీజుల చెల్లింపులో జరిగే ఆలస్యాలకు మినహాయింపులు ఇస్తారు.

రక్షణసిబ్బంది పిల్లలకు దిగువ రేట్లలో పుస్తకాల అలవెన్సులు చెల్లిస్తారు :

1 మొదలు 5వ తరగతి వరకు...సంవత్సరానికి రూ॥ 7/-

6 మొదలు 8వ తరగతి వరకు...సంవత్సరానికి రూ॥ 15/-

9 మొదలు 12వ తరగతివరకు...సంవత్సరానికి రూ॥ 20/-

సేవాగృహాలు, స్టేట్ "ఆఫ్టర్ కేర్" హోమ్స్, వృత్తిపనుల శిక్షణా కేంద్రాలు, వయోవృద్ధులు, దుర్బలులకు ఉద్దేశించిన కేంద్రాలలో ప్రవేశానికై రక్షణసిబ్బందిపై ఆధారపడివున్న వారి విషయంలో కొన్ని నియమనిబంధనలు సడలించబడతాయి. ఇలాంటి ప్రైవేటు సంస్థలను కూడా ఈ విధంగానే నిబంధనలను సడలించవలసిందిగా సూచించడం జరిగింది.

రాష్ట్ర సాంఘిక సంక్షేమబోర్డు అధీనంలోని ప్రభుత్వ సంస్థలలో క్లుప్తీకరించిన కోర్సులు, టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్, వాణిజ్య విషయాలు, వృత్తిపనులలో రక్షణసిబ్బందిపై ఆధారపడిన వారికి ఉచితంగా శిక్షణఇస్తారు. విద్యారాయితీలు, సౌకర్యాలు శాశ్వత ప్రాతిపదికపై కొనసాగింపబడతాయి.

## వ్యవసాయ భూముల పంపిణీ

సరిహద్దుల సంరక్షణలో అసువులు కోల్పోయిన జవానుల కుటుంబాలకు భూముల పంపిణీ చేయడం అత్యావశ్యకం. ఈ విషయంలో పని వేగంగా జరిగేందుకై సైనిక దళాలనుంచి విడుదలై వచ్చిన జవానులకు భూముల పంపిణీకి సంబంధించీ, సరిహద్దుల సంరక్షణలో ఆత్మార్పణం చేసిన వారి కుటుంబాలకు భూముల పంపిణీకి సంబంధించీ ప్రభుత్వం దిగువ ప్రత్యేక నిబంధనావళిని జారీ చేసింది :

ఈ నిబంధనావళిననుసరించి భారత రక్షణదళాలలో పనిచేస్తున్న ఆంధ్రప్రదేశ్‌కు చెందిన జవానులంతా సైన్యంనుంచి విడుదలై వచ్చిన పిమ్మట తమ స్వగ్రామంలో గానీ లేదా మరెక్కడైనాగానీ భూములు పొందడానికి అర్హత కలిగి వుంటారు.

ప్రస్తుత అత్యవసర పరిస్థితిలో తన బాధ్యతా నిర్వహణ సందర్భంలో మరణించినజవానుల విషయంలో వారి కుటుంబాలకు ఈ అత్యవసర పరిస్థితిలోనే భూములు పొందడానికి అర్హత వుంటుంది.

సైన్యంనుంచి విడుదలై భూమి పొందడానికి పూర్వం మరణించిన జవానుల విషయంలో కూడా వారి కుటుంబాలకు భూములు పొందే అర్హత వుంటుంది. ప్రతి జవానుకూ 2.50 ఎకరాల తరీ, 5.00 ఎకరాల ఖుష్కీ భూములు పొందడానికి వీలుంటుంది. అయితే అతనికి ఇదివరకే వున్న భూమి ఇప్పుడు కొత్తగా పొందే భూములు కలిపి తరీ, 2.50 ఎకరాలకూ ఖుష్కీ 5.00 ఎకరాలకూ మించకూడదు.

ఈ నిబంధనావళిక్రింద భూమి పొందడానికై డిప్యూటీ తహశీల్దారు హోదాకు తక్కువగాని అధికారికి దిగువ పేర్కొన్న

వివరాలను పొందుపరుస్తూ దరఖాస్తులు ఇవ్వాలి :

1. పేరు, తండ్రిపేరు
2. శాశ్వత చిరునామా
3. సైన్యంలో పనిచేసిన కాలం
4. ఆఖరున అతడు పనిచేసిన యూనిటు
5. భూమి వివరాలు అంటే జిల్లా, తాలుకా, గ్రామం, సర్వే నెంబరు, వర్గీకరణ, సర్వే నెంబరులో తాము దరఖాస్తు చేసిన భూమి విస్తీర్ణం.

ఈ నిబంధనావళి క్రింద పెట్టుకునే దరఖాస్తులన్నీ రాష్ట్రీ సైనికులు, వైమానికులు, నావికుల బోర్డు కార్యదర్శిద్వారా వెళ్ళవలసి వుంటాయి. ఈ దరఖాస్తులను ఆయా జవానులు పని చేసిన రెజిమెంటు కమాండింగ్ ఆఫీసరు ధ్రువపరచవలసి వుంటుంది.

## పౌరరక్షణ శిక్షణ సంస్థ

పౌరరక్షణ చర్యలను అమలు పరచడంలో హోంగార్డ్సు నిర్వహించవలసిన పాత్ర దృష్ట్యా హైద్రాబాదులో ఒక శిక్షణ సంస్థను నెలకొల్పడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. హైద్రాబాదులో నెలకొల్పబడే ఈ సంస్థ "పౌరరక్షణ శిక్షణసంస్థ"గా వ్యవహరించ బడుతుంది. ప్రభుత్వం పౌర రక్షణ డైరెక్టరేటును నెలకొల్పే పర్యంతం ఈ సంస్థ పాలనావిషయకంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాధారణ పరిపాలనాశాఖ నిర్వహణక్రింద పనిచేస్తుంది.

పౌరరక్షణ శిక్షణసంస్థలో శిక్షణ పొందినవారు పౌరరక్షణ చర్యలు తీసుకోవడంలో, పౌరరక్షణకు అవసరమైన సిబ్బందికి శిక్షణ గరపడంలో మాత్రమే గాక వరదలు,తుపాను, అగ్ని ప్రమాదాలవంటి ప్రకృతి దుర్ఘటనలు సంభవించినప్పుడు సహాయక చర్యలు గైకొనడానికి కూడా వుపయోగపడటానికి వీలుగా ఈ సంస్థలో పౌరరక్షణ (విమానదాడుల సందర్భంలోనూ, విమాన దాడుల తరువాతనూ తీసుకోవలసిన జాగ్రత్త, రక్షణచర్యలు), లోనే గాకుండా సాధారణ అత్యవసర సహాయకచర్యలలో కూడా శిక్షణ ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ సంస్థలో శిక్షణ పొందిన వారిని పౌర రక్షణలో హోంగార్డ్సుకు శిక్షణ యివ్వడానికే గాక ప్రభుత్వోద్యోగులు, వాలంటీర్లతో సహా ఇతరులకు వివిధ పౌరరక్షణ చర్యలలో శిక్షణ యివ్వడానికి వినియోగించడానికి కూడా నిర్ణయించారు.

పౌరరక్షణసిబ్బంది, హోంగార్డ్సుకు శిక్షణఇవ్వడానికి అవసరమైన సిబ్బందికి, అధికార్లకు మాత్రమేగాక పౌరరక్షణచర్యల నిర్వహణతో పాలనావిషయకంగా సంబంధం కలిగివుండి ప్రభుత్వశాఖలనుంచి కానీ, పబ్లిక్ ప్రైవేటు రంగాలలోని భారీ పరిశ్రమల నుంచికానీ రైల్వేలనుంచికానీ విద్యా సంస్థలు మొదలైనవాటి నుంచికానీ తీసుకోబడే వ్యక్తులకుకూడా ఈ సంస్థలో శిక్షణ ఇవ్వడానికి ప్రభుత్వంనిశ్చయించింది.

ఈ సంస్థలో శిక్షణపొందిన బోధకులు రెడ్‌క్రాస్, భారత్ సేవక సమాజ్‌వంటి సాంఘిక సేవాసంస్థల సభ్యులకుకూడా వారు కోరినట్లయితే శిక్షణఇస్తారు. కాగా పౌర రక్షణ అత్యవసర సహాయక చర్యల నిర్వహణలో ఈ సంస్థల సహాయ సహకారాలను పొందడం జరుగుతుంది.

## పాఠ్య ప్రణాళిక

ప్రతి కోర్సులోనూ శిక్షితుల సంఖ్య 30 కంటే పెరగకుండా వుండడానికి కోర్సును 30 రోజులపాటు నిర్వహించడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. బోధకులుగా శిక్షణ పొందేవారి వయస్సు 40 సంవత్సరాలకు మించకుండావుండాలి. ఈ సంస్థకు శిక్షణనిమిత్తం డిప్యూటు చేయబడి, కడకు వివిధస్థాయిలలో పౌరరక్షణ తదితర సహాయక చర్యల నిర్వహణ అప్పగించబడే సిబ్బందికి వయఃపరిమితుల నిబంధన వర్తించదు.

## మోటారు శకటాలపన్ను చట్టం

రాష్ట్రమంతటా కంట్రాక్టు వాహనాల విషయంలో ప్రతి మూడునెలలకు సీటు ఒక్కంటికి రు. 20 ల చొప్పున పన్ను వసూలు చేయడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. ఇదివరలో కంట్రాక్టు వాహనాలవిషయంలో ప్రతి మూడు నెలలకు సీటు ఒక్కంటికి తెలంగాణాలో రు. 10 ల చొప్పునా, ఆంధ్రలో రు. 30 ల చొప్పునా వసూలు చేయడం జరుగుతున్నది. తెలంగాణా ప్రాంతంలో కచ్చారోడ్లపై నడిచే స్టేజ్‌వాహనాల విషయంలో ప్రతిమూడు నెలలకు సీటు ఒక్కంటికి రు. 25 ల చొప్పున వసూలుచేయడానికి కూడా ప్రభుత్వం ఉత్తర్వుచేసింది.

దిగువ పేర్కొన్న కొద్దిదూరం గల మార్గాలలో నడిచే వాహనాల విషయంలో ప్రతి మూడు నెలలకు సీటు ఒక్కంటికి రూ. 15/- ల చొప్పున పన్ను విధించడానికి కూడా ప్రభుత్వం ఆదేశించింది :- (1) అఫ్జల్ గంజ్‌నుంచి షేక్‌పేట మార్గంగా గోలకొండకు (2) అఫ్జల్‌గంజ్ నుంచి సెంట్రల్ జైలు మార్గంగా సరూర్ నగర్‌కు, (3) చార్‌మినార్ నుంచి ఫలక్‌నుమా మార్గంగా పహాడీషరీఫ్‌కు, (4) సెలక్టు టాకీస్ నుంచి చాదర్ఘాట్, చాదర్ఘాట్ వంతెన మార్గంగా ఉప్పల్ పీర్జాదిగూడాకు, (5) అఫ్జల్‌గంజ్ నుంచి మండి మీరాలం మార్గంగా చాంద్రాయన్ గుట్టకు.

(మిగతా 54వ పేజీలో)

కథానిక :

# మండిపోయిన గుండెలు

రావూరి భరద్వాజ

జడిపట్టి కురుస్తున్న మంచు తుంపరలను చేతితో తొలగదోసుకొంటూ, కళ్ళు చికిలించుకొని, లోయలోకి చూశాడు 'ఛెన్ యీ'. అంతవరకూ మసక మసకగా కనిపిస్తున్న తమ సైనిక సమూహం, ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తోంది. ఛెన్ యీ గట్టిగా నిట్టూర్చాడు. గాలికూడా గడ్డ కట్టిందేమో ననిపించిందతనికి!

'ఛెన్ యీ' గడియారంకేసి చూసుకొన్నాడు. తెల్లవారడానికింకా ఎంతో టైంలేదు. నిర్జీవమైన ఈ కొండ శిఖరం మీదకు తనొచ్చి ఇప్పటికి రెండు రోజులయింది! మంచుతప్ప, మరేమీలేని ఈ మరుభూమిలో తను, ఒంటరిగా 48 గంటలు గడిపాడు. ఇంకెంత కాలం ఉండాలో తెలీదు.

ఒక్కసారి మరఫిరంగికేసి చూశాడు. ముదురాకుపచ్చరంగులో, నిర్జీవంగా రాళ్ళమధ్య దాక్కున్న ఈ యంత్రం, మానవుని పాశవికత్వానికి చిహ్నమనిపించింది ఛెన్ యీకి. మనిషిలోని అమానుష వాంఛ పెచ్చురేగి, వెర్రితలలు వేసి, ఈ యంత్రంలో ప్రవేశించినప్పుడు, ఇది నిర్దయగా అగ్నిధారలను వర్షిస్తుంది. వందలాది, వేలాది మానవులను నిప్పుకలుగా మార్చివేస్తుంది:

"ఒక మనిషి మరొకమనిషిని ఎందుకు చంపుతున్నట్టు?"

ఫిరంగి నోటికేసి చూస్తూ ఆలోచించాడు ఛెన్ యీ. అతనికేమీ స్ఫురించలేదు. నెత్తిమీది టోపీ సవరించుకొన్నాడు. జలజల మంటూ మంచు బెత్తికలు రాలాయి. ఒక్కసారి శరీరాన్ని విదిలించుకొన్నాడు. దుమ్ము లేచినట్టుగా మంచు తువ్వరలేచి, బరువైన గాలిలో మత్తుగా సుడులు తిరుగుతోంది!

ఛెన్ యీ, తిండి సంచిని వెదికాను. మూడు రొట్టెతుంపులున్నాయి. రెండు గ్లాసుల నీరున్నది! వాటిని చూడంగానే అతనిలో ఆకలి పెచ్చరిల్లింది. ఓ రొట్టె విరిచి నోట పెట్టుకోబోయాడు. ఛటుక్కున అతని కమాండర్ అన్నమాటలు జ్ఞప్తికొచ్చాయి.

"వీలైనంత తక్కువ తినండి. ఎక్కువ పని చెయ్యండి! మోయగలిగినన్ని గుళ్ళు మోసుకెళ్ళండి. ఎంతో అవసరమైతేనే గానీ, రొట్టెను వాడకండి!"

రంపంపొట్టు, బెల్లం కలిపి చేసిన రొట్టెలు పంచుతూ అన్నాడతను!

ఈ రొట్టెలుతిని, భారతీయులతో తను యుద్ధంచెయ్యాలి. తనకూ భారతసైనికుల వేషం వేశారు. మధ్యలో ఎదురుపడిన భారతీయ సైనికులు తననుచూసి మోసపోవడానికే తనకీ వేషం వేశారు.

"కామ్రేడ్ ఛెన్ యీ! చైనా ప్రభువుల తరఫున, కోట్లాది చైనాసోదరుల తరఫున, నీకీబాధ్యతను అప్పగిస్తున్నాను. నీవీ కార్యాన్ని దిగ్విజయంగా నెరవేర్చ గలవని మేమందరమూ ఆశిస్తున్నాం. నలుగురు టిబెటన్ రైతులు ఈ ఫిరంగిని కొండమీదికి చేరుస్తారు. అక్కడికి, భారతీయ పటాలాలు, ఎంతో దూరంలో లేవు. వారి యుద్ధసన్నాహాలను, ఈ ఫిరంగితో ధ్వంసంచెయ్యి. ఆకనుమ గుండా వారు ముందుకురాకుండ చూడు. ఈలోగామేము వారిని చుట్టుముట్టి, ధ్వంసంచేస్తాం. భారతీయులను 'విముక్తం' చేసే మహత్తర ప్రయత్నంలో, నీ వంతు బాధ్యతను నీవు నిర్వహించు." అన్నాడు కమాండర్.

తనేమీ అనలేదు. అన్నా లాభముండదనీ తనకు తెలుసు. పై పెచ్చు ఎంతో ఉత్సాహాన్ని నటించాడు. భారత సరిహద్దు నుండి, గాలినికూడా వీచనివ్వనన్నాడు. భారతీయులను'విముక్తం'చేసే ఈ పవిత్ర కార్యక్రమంలో, తననుకూడా పాల్గొననిచ్చినందుగ్గాను, ఆజన్మాంతం కృతజ్ఞతతో ఉండగలనన్నాడు.

"మంచిది. వెళ్ళు."

అంటూ కమాండర్ వెళ్ళిపోయాడు.

ఫిరంగికి తాళ్ళను కట్టి, నలుగురు టిబెటన్లూ ముందుకు లాగుతున్నారు. సమతలం మీద, ఫిరంగి చక్రాలు చకచకా ముందుకు సాగాయి. ఛెన్ యీ దాని

వెనకనే. చేతులు కట్టుకొని నడుస్తున్నాడు. మధ్య మధ్య వెనుదిరిగి చూస్తున్నాడు. మంచుతెరల్లో చైనా సైనికుల డేరాలు, మసక మసగ్గా కనిపిస్తున్నాయి.

క్రమంగా మంచువాన ప్రారంభమయింది. నేలంతా ఈకువతో గజగజలాడిపోతుంది. వంటినిండా సరైన గుడ్డలు కూడా లేని టిబెట్ రైతులు, కాళ్ళుజారకుండా, బొటమన వ్రేళ్ళను నేలలోకి గుచ్చుతూ, మూలుగుతూ ఫిరంగిని లాగుతున్నారు. మంచుబురదలో కూరుకుపోయిన ఫిరంగి చక్రాలు, కిర్రుమంటూ అరుస్తున్నాయి. గమనం మందగించినప్పుడల్లా చావు భయంతో రైతులు వెనక్కు చూస్తున్నారు. ఛెన్‌యీూ భుజాన వేళ్లాడుతున్న తోలుపటకా, వారికి కాలసర్పంలా కనిపిస్తోంది. వాళ్ళల్లో వాళ్ళు ఏదో గొనుక్కొంటున్నారు. మూలుగుతున్నారు. ముక్కుతున్నారు.

బయలుదేరడానికిముందు, కమాండర్ తనను చాటుకు పిల్చి, రహస్యంగా అన్న మాటలు, ఇప్పటికీ చెవుల్లో గింగురుమంటూనే ఉన్నాయి.

"కామ్రేడ్ ఛెన్‌యీూ! ఈ టిబెటన్లున్నారే, పచ్చిదొంగలు! జాగ్రత్తగా ఉండు ఈ తోలు పటకా, వీరికోసమనే ఇస్తున్నాను. పాలుమాలారో, దీన్ని ఉపయోగించు. ఒక్కసారి, గాలిలో విదిలించి, వారిమీదికి విసురు. చర్మాన్ని కరిచిపట్టి ఊడదీస్తుందిది!" అన్నాడు కమాండర్.

తనా కాలసర్పాన్ని ఆప్యాయంగా పుచ్చుకొని, సంచిలో కూరుకోబోయాడు.

"అబ్బె బ్బె! అలాకాదు. భుజం మీద ఉంచుకో దాన్ని చూస్తుంటే తప్ప ఈ అడవి దున్నలకు చైతన్యం కలగదు."

టిబెటన్ రైతులు మరోసారి వెనుదిరిగి చూశారు. ఫిరంగి చక్రాలు కిర్రుమంటూ మూలగసాగాయి. అటూ ఇటూ జెసికి పోతున్నాయి. బురదలోంచి—ఎంత పెనుగులాడినా పెళ్ళగిలిరావడం లేదు.

ఛెన్‌యీూ, రైతులు పడుతున్న అవస్థనుచూస్తూనే ఉన్నాడు. తనుకూడా తలమోటించి, ఒక్కతోపు తోశాడు. ఫిరంగి వొడ్డెక్కింది గానీ, ఆ అదుటుకు చక్రంప్రక్కనే ఉన్న రైతు పడిపోయాడు. ముఖం బలంగా నేలకుగుద్దుకొని, ముందు పళ్ళు విరిగాయి. తెల్లని మంచుమీద, ఎర్రని నెత్తురు చారికలు....

ఛెన్‌యీూ, ఛటుక్కున ముందుకొచ్చాడు. పడిపోయిన రైతు, గావుకేకపెట్టి, చేతులతో తలను చుట్టుకొని, ఉండలా సుడులు తిరిగి, ముడుచుకుపోయాడు! అతని శరీరం, తోలుపటకా దెబ్బల కోసం ఎదురు చూస్తోన్నట్లుగా, జివజివలాడిపోతోంది. కృశించిపోయిన వీపుమీది మంచును ఆప్యాయంగా తుడిచాడు ఛెన్‌యీూ.

"బాబూ! లేవవూ?" అన్నాడతను.

క్షమించడి దొరా!"

ఉంగలుతిరిగిన శరీరం లోంచి నలిగిపోయిన మాటలు వినిపించాయి. అతను మెల్లగా లేచి, అనుమానంగా ఛెన్‌యీూ కేసి చూశాడు. అతని కళ్ళల్లో మృత్యుభయం అర్రాడుతూ ఉంది. కాంతిరహితమై, గాజు కుప్పెల్లాగా ఉన్న ఆ కళ్ళు, తోలు పటకామీద వేశచ్చాడుతూ ఉన్నాయి.

"ఫర్వా లేదు. నీ బదులు నేను లాగుతాను. నువ్వు మెల్లిగా వెనకనే నడిచిరా!" అన్నాడు ఛెన్‌యీూ.

పడిపోయిన రైతును, తొలిసారిగా చూసినప్పుడే, ఛెన్‌యీూకి తన తండ్రి జ్ఞాపకంవచ్చాడు. ఇంచుమించుగా ఇద్దరిదీ వొక్కటే వయసు. తన తండ్రి కూడా, ఇలానే, సన్నగా, ఎముకలు వెళ్ళుకొచ్చి, కుములుసులాడుతూ ఉండే వాడు! ఇప్పుడు, ఎలాఉన్నాడో?

"నీ పేరేమిటి బాబూ?" అన్నాడు ఛెన్‌యీూ, కొప్పుతూ, ఫిరంగిని ముందుకు లాగుతూ.

చిమ్ముతున్న రక్తాన్ని కాండ్రించి మంచుమీద ఉమిశాడా వృద్ధుడు. ఎర్రని చిందులు చెల్లాచెదురుగాపడ్డాయి. మణికట్టుతో కారుతున్నరక్తాన్ని అపుతూ తన పేరు చెప్పాడతను.

గతుకల్లో పడిన చక్రాన్ని, ఊపిరి బిగబట్టి, పైకిలాగి, ఒక్క క్షణం ఆగారు వారు. ఛెన్‌యీూ, వెనక్కు తిరిగి,

"పూర్వం ఏంచేస్తుండేవాడివిబాబూ? అని అడిగాడు.

అతను చాలా సేపు ఏమీమాట్లాడలేదు. ఛెన్‌యీూకేసి బెదురు చూపులుచూస్తూ, మంచులో కూరుకుపోయిన కాళ్ళను బలవంతాన పెకలించుకొంటూ నడుస్తున్నాడు.

"ఫర్వాలేదు బాబూ! నేనెక్కడా మళ్ళా అనను. నీకొడుకు లాంటి వాణ్ణనుకో. నాతో నిజం చెప్పవూ?" అన్నాడు ఛెన్‌యీూ.

మిగతా ముగ్గురు రైతులూ, ఓసారి ఛెన్‌యీూకేసిచూసి, తరవాత వొకరినొకరు చూసుకొన్నారు.

'నాది 'ఫోచాన్' గ్రామం. నాకు ఇరవై వరిమళ్ళున్నాయి. ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళూఉన్నారు. దలైలామా మా గ్రామం ప్రక్కగా

చేయారనీ, అయనకు మా గ్రామస్థులు కూడా సహాయం చేశారనీ, చైనా సైనికులు అనుమానించారు. మా గ్రామాన్ని చుట్టుముట్టి సర్వనాశనం చేశారు. నా ఇద్దరి కొడుకుల్నీ చంపేశారు. మూడోవాణ్ని ఏంచేశారో తెలీదు. నా కూతుళ్లు-అవును, బంగారు బొమ్మల్లాగా ఉండేవారు, వారిని చంపలేదు. సైనికులు పట్టుకెళ్ళారు. నా పొలంలాక్కున్నారు. నన్ను సైనికులకు చాకిరీ చెయ్యడం కోసం, ఇక్కడికితీసుకొచ్చారు. పదిరోజులకిందట ఓ పెద్ద ఆఫీసరుప్రక్కన నా పెద్దకూతురు 'త్సాంగ్‌యా' ఉండటం చూశాను. నన్నుచూసి, కళ్ళల్లో...."

అతను పసివాడిలా బావురుమని ఏడిచాడు. ఛెన్‌యీ గుండెల్లో ఎర్రగా కాలినగునపం ఖస్సున దించినట్లనిపించింది.

ఫిరంగి, కొండ కొమ్ముకుచేరేసరికి, పూర్తిగా 14 గంటలసేపుపట్టింది. మధ్యలో రెండు సార్లు మాత్రం కొద్ది నిముషాలసేపు ఆగారు.

బాబూ? నువ్వుదేవుడివి. బుద్ధదేవుని అంశం నీలోఉంది. అందుకే మమ్మల్నింత ఆప్యాయంగా చూశావు. నీ రుణం తీర్చుకోలేం?" అన్నాడు ముసలి రైతు.

రవ్వంత విశ్రాంతి తీసుకోనిచ్చినందుకే. ఒకమనిషి, అంత కృతజ్ఞతను ప్రదర్శించాడంటే- అతనిజీవితం, ఎంత దుస్సహంగా ఉన్నదో తాను ఊహించగలడు.

ఫిరంగిని, రాళ్ళచాటునచేర్చి, దాన్ని కనబడకుండాచేశారు. ఫిరంగి ప్రక్కనే గుళ్ళపెట్టెఉంది. చలికి, బద్దలయిన తాళ్ళకేసి ఓసారి చూసుకొన్నారు. టిబెటన్‌లు.

"మంచిది, వెళ్ళిరండి?" అన్నాడు ఛెన్‌యీ, సంచిలోనించి రొట్టెలుతీసి వారికిస్తూ. "ఉంచుకోండి. దోవలో కూడా ఏమీదొరకదు. నేనిలాఇచ్చానని మాత్రం, ఎక్కడా అనకండి?"

ఛెన్‌యీ నిదీవిస్తూ నలుగురు టిబెటన్‌యీ వెళ్ళిపోయారు. వారు కనిపిస్తున్నంతసేపూ, అటువేపేచూశాడు ఛెన్‌యీ. అప్రయత్నంగా అతనికళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

"నాన్నా! నాన్నా!! నాన్నా!!!" అంటూ రోదించాడు ఛెన్‌యీ.

అతనిమాటలు అతనికే చిత్రంగా వినిపించాయి. కళ్ళు తుడుచుకొన్నాడు వళ్ళు విరుచుకొన్నాడు. తెల్లని పొగ మంచుతప్ప, మరేమీ కనిపించలేదు....

తను అనుకొన్నదానికీ, ఇప్పుడు జరుగుతున్నదానికీ మధ్యగల అంతరాన్ని చూసి, ఛెన్‌యీ చకితుడయ్యాడు. తన జీవితం, బంగారు కలగా రూపొందుతుందనుకొన్నాడు. కానీ మరుభూమిగా మారిపోయింది.

ఒకప్పుడు, తనకేలోటూలేదు. తండ్రి వ్యవసాయం చేసేవాడు. పెద్దన్న స్కూలుమాస్టరు. వదిన చక్కగా పాటలుపాడుతుండేది. యుద్ధం తమ జీవితాలను ధ్వంసం చేసింది. అన్న యుద్ధంలోచనిపోయాడు. వదిన బాంబు దెబ్బకు చనిపోయింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత వచ్చిన ప్రభుత్వం, తమను పూర్తిగా నాశనంచేసింది! నాన్న ఇప్పుడు తన పొలంలో, తనేబానిస! ఒకసారి అధికారిఅన్నమాటకు తిరుగుజవాబు చెప్పాడని, నాన్నను కొరడాలతో బాదారట! సాయంత్రం ఇంటికొచ్చి వాతలుచూసుకొని కుళ్ళికుళ్ళి ఏడ్చాడు.

"అనుకొన్నదొకటి జరిగింది మరొకటి!" అని గొణిగింది అమ్మ.

రెండోఅన్నను ఫిరంగి మూతికికట్టి పేల్చివేశారు!

'వెయ్యిపూవులు వికసించనీయండి. వెయ్యి భావాలు ప్రసరించనీయండి. ఈ సిద్ధాంతాన్ని, పొరబాటుగా విశ్వసించాడు రెండో అన్న. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో జరుగుతున్న ఘోరకలినిగురించి తన అభిప్రాయాలను 'సెల్ సమావేశం'లో వెల్లడించాడు. వారంరోజుల తరువాత 'చర్చకోసమంటూ అధికారులు రెండో అన్నను తీసుకెళ్ళారు. పదవనాడు, ఫిరంగి మూతికికట్టి పేల్చివేశారట!

'హుయాంగ్‌ను పేల్చడం నేను కళ్ళారాచూశాను.' అన్నాడు బాబాయి.

కాని ప్రభుత్వంమాత్రం ఇంతవరకూ ఆ విషయాన్ని ఒప్పుకోలేదు.

ఛెన్‌యీ, ముఖానికి చేతులు కప్పుకొని, పసివానిలా ఏడ్చాడు.

'ఎవ్వరూలేరు. ఎవ్వరూలేరు.నాకిప్పు డెవ్వరూలేరు!" అన్నాడతను బిగ్గరగా.

కుటుంబమిల్లా ధ్వంసమయ్యాక, తను బలవంతాన మిలిటరీలోకొచ్చాడు. దేశంలో తిండిలేదు. గుడ్డలేదు. ఉండటానికి కొంపలేదు. చెయ్యడానికి పనిలేదు. యువకులందరూ సైన్యంలో చేరాలన్నారు. బయట ఉండి కూటికిమాడి చావటంకన్నా, సైన్యంలో చేరడమే నయమనిపించింది! తన తిండిసమస్య కొంతవరకు తీరినా తీరినట్లే!

అసలీయుద్ధం ఎందుకొచ్చిందో తెలీదు. భారతప్రజలకు 'విముక్తి' కలిగించడమే దీని పరమార్థమంటున్నారు అధికారులు. అంటే—ఎటువంటి విముక్తిఅది? ఇప్పుడు, తనూ, తన కుటుంబమూ, తన దేశమూ

అనుభవిస్తున్న విముక్తిలాంటిదేనా?

ఈ తరహా విముక్తి తన శత్రువులకు కూడా తనుకోరలేదు. ఈ ఉక్కు పిడికిలి నుండి బయటపడాలని తహతహ లాడుతున్న వారు, తన దేశంలోనే, వేలకొద్దీ ఉన్నారు. మరికొందరి నీ రొచ్చు గుంటలోకి ఈడ్చడం తన కిష్టంలేదు.

"వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు" అనుకొన్నాడు ఛెన్‌యీ.

అంతచలిలోనూ, అతని శరీరం తెకతెకలాడి పోయింది. పిడికిళ్ళు బిగించి, ఫిరంగిమీద దబదబా మోదాడు.

దూరంనుండి, చాలా దూరం నుండి సన్నని వెలుగేదో, లయబద్ధంగా, ఓ నిమిషం పాటు వెలిగి మాయ మయింది. ఆ సౌంజ్ఞ తనకు తెలిసిపోయింది. భారతీయ సైనికులు, ముందుకుచొచ్చుకు వస్తున్నారు. వారిని లోయలోకి వచ్చేలాగా, తను ఫిరంగిని పేల్చాలి. లోయ నిండా చైనా సైనికులున్నారు. భారతీయ సైనికులు లోయలోకిరాగానే వారిని ఊచకోత కోస్తారన్నమాట!

ఛెన్‌యీ, ఫిరంగికేసి ఓక్షణం అప్యాయంగాచూశాడు. దాన్ని గాఢంగా ఆలింగనంచేసుకొని ముద్దుపెట్టుకొన్నాడు.

"కామ్రేడ్! ఇప్పుడు మనం ధర్మయుద్ధంచెయ్యాలి. నువ్వూ నేనూ, ముక్కలు ముక్కలయ్యిందాకా, యుద్ధం చెయ్యవలసిందే! అలిసిపోకు, పాలుమాలకు" అంటూ ఫిరంగిని బుజ్జగించాడు ఛెన్‌యీ.

తిన్నగా లోయలోకితిప్పాడు. లోయ నిండా మిడతల గుంపుల్లా, చైనా సైనికులు బిలబిలలాడుతున్నారు. ఒక్క క్షణం కళ్ళుమూసుకొన్నాడు. చేతులు యాంత్రికంగా పాటిపనినవిచేసుకుపోతున్నాయి. మరుక్షణంలో, జిగేల్మని మెరుపూ, ఇంతపొగతో కలిసినబ్రహ్మాండమైన శబ్దమూ వెలువడ్డాయి. హిమాలయ సానువులాకాంతికి మెరిసిపోయాయి. ధ్వనికి చలించిపోయాయి.

లోయలో తట్టునుండి ఉప్పెనగా రోదనధ్వనులు చిమ్ముకొచ్చాయి. అయితే ఛెన్‌యీకివేమీ తెలియవు. అతను ఎడతెరపిలేకుండా, ఫిరంగిని పేలుస్తున్నాడు. విశ్వాసపాత్రుడైన సేవకునిలా, ఫిరంగి అగ్నిధారలను, లోయలోకి వర్షిస్తోంది. ఛెన్‌యీ, లయకాలరుద్రునిలా, విజృంభించాడు.

ఆనందమంటే ఏమిటో మొట్టమొదటి సారిగా రుచి చూశాడతను!

---

## నష్టపరిహారాల ట్రిబ్యునల్

(50 వ పేజీ తరువాయి)

1962 వ సం॥పు భారత రక్షణ నియమావళి క్రింద కోరబడిన మోటారు శకటాలు మొదలైన చరాస్తుల విషయంలో నష్టపరిహారానికి సంబంధించి ఈ విషయంలో అధికారంగలవారు జారీచేసిన ఉత్తర్వులపై చేసుకునే అప్పీళ్ళను స్వీకరించేందుకై కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ నిమిత్తం హైద్రాబాదులో నష్టపరిహారాల విచారణ ట్రిబ్యునల్‌ను నియమించింది.

స్మాల్‌కాజెస్ కోర్టు (హైద్రాబాదు) చీఫ్ జడ్జి శ్రీ సమియుద్దీన్ మొహమ్మద్, ఆదాయపు పన్ను అసిస్టెంట్ అప్పెల్లేటు కమీషనరు శ్రీ బి. లక్ష్మీపతి ట్రిబ్యునల్ సభ్యులుగా వుంటారు.

ట్రిబ్యునల్ కార్యాలయం హైద్రాబాదులోని ఆదాయపు పన్ను అసిస్టెంట్ అప్పెల్లేటు కమీషనరు ('ఏ'రేంజి) కార్యాలయంలో పని చేస్తుంది. ఈ కార్యాలయం హైద్రాబాదు ఆబిద్ రోడ్డు చిరాగ్‌అలీ లేనులోని ప్రెసిడెన్షియల్ కోఆపరేటివ్ బ్యాంకు భవనంలో వుంది.

### వాణిజ్యపన్నుల చట్టాలు

వాణిజ్య పన్నుల చట్టాలు, నియమావళి, ప్రకటనలు మొదలైనవాటికి చేసిన సవరణల ప్రతులను, డీలర్లకు నిర్ణీతఫీజు తీసుకొని సరఫరా చేయడానికిగాను ప్రయోగాత్మకంగా మంజూరుచేసిన పథకాన్ని దీని ప్రయోజనం దృష్ట్యా 1963 ఏప్రిల్ మొదటి తేదీనుంచి మరో సంవత్సరం వరకు అమలుపరచడానికి నిశ్చయించారు.

డీలర్లు, వ్యాపార సంస్థలు, అమ్మకం పన్ను ప్రాక్టీషనర్లు, ఈ విషయంలో ఆశక్తిగల ఇతరులు 1963–64 వ సంవత్సరానికై రెవిన్యూ సెక్రెటేరియేటులో తమ పేర్లను నమోదు చేసుకోవచ్చు. 1962–63 వ సం॥ లోనే నమోదయినట్లయితే ఇప్పుడు రిన్యూ చేసుకోవచ్చు. ఇందుకుగాను హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రెవెన్యూ శాఖ కార్యదర్శికి దరఖాస్తుఇవ్వాలి.

# స్త్రీల పాలిటి బలిపీఠం

కె. లక్ష్మీరఘురామ్

ప్రపంచంలోకంతా పురాతనమైన వృత్తి వ్యభిచారం. డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకునే ఈ వ్యాపారం చాలా భయంకరమైనది. నైతికంగా బహు నీచమైంది. సాంఘికంగా బహు ప్రమాదమైంది. కాని నీతినియమాలు సిగ్గొగ్గులులేని ఈ వ్యాపారాన్ని నిర్మూలించటం చాలాకష్టం. ప్రపంచంలో అనేక దేశాలలో నిరభ్యంతరంగా ఈ వ్యాపారం సాగిపోతున్నది. మనదేశంలోనూ ఎప్పటివలె సాగిపోతున్నది. దానికి కొన్నిప్రబలమైన కారణాలు లేకపోలేదు.

మొదటిది — మనసంఘంలో స్త్రీకి ఒక ధర్మం పురుషునికి మరొకధర్మం.




స్త్రీ ఆర్థిక అసహాయక శారీరకంగా సాంఘికంగా స్త్రీల కృష్టపరిస్థితులు కొంత కారణం.

మారుతూవున్న సంఘంలో— కాలవాహినిలో పెద్ద ఆశయాలులేక గడ్డిపోచలవలె కొట్టుకుపోతున్న స్త్రీ పురుషులు నవీన పరిస్థితులలో దారీ తెన్నూ తెలియక అగమ్యగోచరంగా ప్రవర్తిస్తూ అనుకోకుండా అవినీతికి పాల్పడడం జరుగుతున్నది.

ఒకప్పుడు స్త్రీ ఉదరపోషణార్థం మరొకప్పుడు అహంపోషణార్థం తెలిసే అతిచరిస్తున్నది. విలాస జీవితానికి కారణాంతరాలవల్ల అలవాటు పడి అటువంటి జీవనం సాగించుకొనడానికి ధనలోపంవల్ల మానసిక స్థైర్యంలేని స్త్రీలు వ్యభిచారంలోకి మెల్లగా దిగజారుతున్నారు. బజారులో బోర్డు కట్టుకుని వుండక పోవచ్చును. దొంగనోట్లు, నీలపునోట్లు తీసుకొని వుండకపోవచ్చును. కొందరిఆదరణకో, విలాసవస్తువులకోసమో, వినోదాలకోసమో శరీరాన్ని అమ్మకొనడం కూడా వ్యభిచారమే.

ఈ వ్యభిచారాన్ని నిర్మూలించటము ఎట్లా ? అనేక సంసారాల్ని విచ్ఛిన్నమైపోకుండా రక్షించేదెట్లా ? అమాయకమైన బిడ్డల కన్నీటి నీలాలు తుడిచేదెట్లా ? భయంకరమైన వ్యాధులతో తమ వంశాన్నంతా నిర్మూలం చేసే అభాగ్యులను సంరంక్షించేదెట్లా ? ఈ వ్యభిచార పిశాచంవల్ల ఎక్కువగా బాధపడేది స్త్రీలు, బిడ్డలు. అందుచేతనే అనేక మహిళా సంఘాలు, సంఘ సేవా తత్పరులు ఈ పిశాచాన్ని నిర్మూలించడానికి ప్రయత్నం చేశారు. చింతామణి, విప్రనారాయణ మొదలయిన నాటకములు రచించి బహుళ ప్రచారం చేశారు. సంఘంలో పెడత్రోవ పట్టినవారిని బహిష్కరించారు. కాని లాభం లేకపోయింది. మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత 1956 లో వ్యభిచార నిర్మూల చట్టాన్నొకదాన్ని అమలు చేశారు. ఈ చట్టమువలన వ్యభిచారము దేశములో ఏమాత్రమూ తగ్గలేదు. వ్యభిచారం చేసే వారిని ప్రభుత్వం అరెస్టు చేస్తున్నది. జుల్మానాలు విధిస్తున్నది. కొన్ని సందర్భాలలో జైలుశిక్షకూడా విధిస్తున్నది. అయినా అది యింకా ప్రబలంగానే వున్నది. ప్రజా సహకారం పూర్ణంగా వున్నప్పుడే ప్రభుత్వ చట్టమైనా కార్యకలాపాలైనా సార్థక్యాన్ని పొందేది. యెంతో బలంగా పాతుకుపోయిన అస్పృశ్యతను మనం నిర్మూలించ గలిగినప్పుడు వ్యభిచారాన్నెందుకు నిర్మూలించలేక పోతున్నాము ? కొన్ని యితరదేశాల్లో విజృంభించివున్న వ్యభిచారాన్ని నిర్మూలించ గలిగినప్పుడు మనం మాత్రం ఎందుకు ఆ పని చేయలేము ? ఘనం చెయ్యలేనిదంటూ వుండదు. సంఘసేవలో ఆసక్తి గల స్త్రీలు ఈ విషయంలో శ్రద్ధ వహించితే దిక్కులేని పిల్లలను పట్టి వ్యభిచార గృహాలు నడిపే వారిని, నడిపించేవారిని చట్టం బంధిస్తుంది. వేరే త్రోవలేక జానెడు పొట్టకోసము వ్యభిచారానికి బలి అయ్యే ఆడపిల్లలకు, తగిన సమయమందు చేయూత నిచ్చే సంస్థలు (ముఖ్యముగా వ్యాపార సంస్థలు) సంఘములు వుంటే వారు ఆ పాపపు కూపములో పడకుండా వుండవచ్చును. విదేశాలలో ఒకటి రెండు గంటలు ఫ్యాక్టరీలలో పనిచేసి సంపాదించుకునే ఏర్పాట్లు వున్నవి. అలాంటి సదుపాయాలు వుపయోగించుకొని

(మిగతా 58 వ పేజీలో)

# పసిపిల్లల పెంపకం: తల్లుల జాగ్రత్త

డాక్టర్: వేమిరెడ్డి రాజేశ్వరమ్మ

పిల్లల పెంపకమంటే ఏదో ఒక టైముకో ఏడ్చినపుడో పాలివ్వడం, నీళ్ళు పొయ్యడం, కొత్తబట్టలు వెయ్యడం మాత్రమే కాదు. వాళ్ళను సరైన పద్ధతిలో వుంచడం మన స్తత్వాన్ని గమనించి జరుపు. పిరికితనం వంటివి చిన్నప్పటినుంచీ అలవడకుండా చెయ్యటం సరైన పద్ధతిలో పెంచడం. మంటలు, నీళ్ళు మొదలయినవాటి నుంచి, రోడ్లలో బళ్ళు, కార్లు మొదలయిన వాటి నుంచి ఏవిధమైన ప్రమాదాలకు లోను కాకుండా ఒక సక్రమ మార్గంలో పెంచడం. ప్రేమతో, ఆదరణతో చూడడం. అంటే వాళ్ళు తప్పు చేసినపుడు కూడా దండించకుండా గారాబంతో మారామును పెంచమని కాదు. పిల్లలు చేసిన తప్పులను తెల్పి తాము తప్పు చేసినట్లు తెలుసుకొనేట్లు చేయాలి. యేమైనా తప్పులు చేస్తే ఆ తప్పులవల్ల వచ్చే కష్టాలూ, నష్టాలూ సులభంగా సూచాయగానైనా వాళ్ళకు తెలియజెప్పాలి. నేటి బాలుడే రేపటి పౌరుడన్న వాస్తవిక సూక్తిని దృష్టిలో పెట్టుకుని ఎవరికివారుగా తమ ధర్మాన్ని తాము నిర్వహించుకునేట్లుగా తగు పునాదిని బాలలుగా వున్నప్పుడే వారికి వెయ్యాలి. లేకపోతే "మొక్కై వంగనిది మ్రానై వంగునా'' అన్న సామెత రీతి కాగలదు.

పిల్లల విషయంలో, ముఖ్యంగా పసిపిల్లల విషయంలో పెంపకంలో మనం చాలా జాగ్రత్త వహించాలి. ఏ పాలిచ్చినా, ఎన్నిచ్చినా, ఎప్పుడిచ్చినా పిల్లలు ఏదో విధంగా పెరగక మానరు. నిజానికిది ముఖ్యం కాదు. మనం ఒక సక్రమ మార్గంలో ఆహార పానీయాల నిచ్చి ఒకవిధమైన క్రమయుత జీవితానికి పసితనంలోనే బీజం వేయడం ముఖ్యం. ఇప్పుడు మనం చెప్పుకుంటున్నది ఒక సంవత్సరము లోపలి పసిపిల్లల గురించి. మనం పాలు తిన్నగా యిచ్చామా లేదా అనడానికి బిడ్డ బాగా నిద్రపోవడమే గుర్తు. బిడ్డ నిద్ర లేచిన వెంటనే మంచి ఆకలితో ఆహారము తీసికోవాలి. కొంచెం సేపు తృప్తిగా మేల్కొని తరువాత మళ్ళీ నిద్రపోవాలి. బిడ్డ చూడ్డానికి హుషారుగా కనిపించాలి. వేడినీళ్ళతో స్నానం చేయించి బాగా తుడువవలెను. ఈ పద్ధతిని సక్రమ మార్గంలో పెరిగే బిడ్డ చర్మం అతి సున్నితంగా తాకటానికి సిల్కులాగా వుంటుంది. సరైన ఆహార పానీయాలతో మనం పెంచినపుడు ఒంటిమీదా, కాళ్ళు చేతులమీదా చాలినంత కండ వుంటుంది. ఎముకలు ఎక్కువ కనిపించకుండా బొద్దుగా వుంటారు. చర్మం వెచ్చగా వుంటుంది. సులభంగా గాలి పీల్చగల్గి ఆరోగ్యంగా వున్న పిల్లలు వాళ్ళ నోట్లో ఏది పెట్టినా పీల్చడానికో, కొరకడానికో ప్రయత్నిస్తారు. పొట్ట కొంచెం ఎత్తుగా వుంటుంది. ఏవిధమైన బాధ లేకుండా మలమూత్ర విసర్జన చేయడం జరుగుతుంది. సామాన్యంగా పిల్లలు అప్పుడప్పుడూ ఆకలివల్ల కాని, ఒంటరితనంవల్ల కాని, యితర కారణాలవల్ల కాని ఏడవవచ్చును. అయితే ఆ ఏడవడము ఎంతోసేపుండదు. ఒకరోజు మొత్తంలో ఒకటి రెండు గంటలకన్నా ఎక్కువ సేపు ఏడవరు. సులభంగా, ప్రశాంతంగా నిద్రపోతారు. ఇవన్నీ పిల్లల్లో కన్పిస్తున్నప్పుడు వారికి ఆహారం సరైన పద్ధతిలో యివ్వబడుతున్నదని మనం భావించవచ్చును. ఈ పద్ధతిని పెరుగుతున్న పిల్లల బరువు కూడా బాగా హెచ్చుతుంది. మొదటి పదిరోజులూ తీసివేసి రోజుకొక ఔన్సు పద్ధతిని మొదటి నాలుగు నెలలూ పిల్లల బరువు పెరుగుతుంది. ఆ తర్వాత నాలుగు నెలలు 2/3 ఔన్సు వంతున, ఆ తర్వాత నాలుగు నెలలు 1/2 ఔన్సు వంతున పెరగడం జరుగుతుంది.

మామూలుగా మొదటి సంవత్సరంలో 15 రోజులకో, నెలకో ఒకసారి బిడ్డలను తూకం వెయ్యాలి. పైన చెప్పినవన్నీ సక్రమంగా ఆచరించినప్పుడు ఇదంత ముఖ్యం కాదు. బిడ్డ పుట్టినప్పుడు సామాన్యంగా 5 నుంచి 12 పౌనులుంటుంది. మూడు నెలలప్పుడు 10 నుంచి 16 పౌనులు, ఆరునెలలప్పుడు 14-20 పౌనులమధ్య, తొమ్మిదినెల

లప్పుడు 16-22 పౌనులమధ్య వుండటం జరుగుతుంది. ఇవి సరాసరి బరువులు. సాధారణంగా ఎక్కువమంది పిల్లలు ఈ బరువుల్లో వుంటారు. ప్రత్యేక పరిస్థితుల్లో కొంచెంతక్కువా, ఎక్కువాకూడా వుండవచ్చును. ఆవిధంగా వున్నప్పుడు ముఖ్యంగా తక్కువబరువు వున్నప్పుడు వైద్యపరీక్ష చేయించడం మంచిది. పిల్లలు బరువు హెచ్చుతుండానూ, తగ్గుతుండాను వున్నప్పుడుకూడా వైద్యపరీక్ష చేయించడం మంచిది.

తల్లిపాలున్నవారికి కొంత బాధ లేదు. బిడ్డ పాలుతాగి, కొంచంసేపాడుకొని నిద్రపొయ్యి లేచి, మళ్ళ పాలు తాగుతూ బరువు హెచ్చుతున్నట్లయితే తల్లిపాలు సరిపోతున్నవని భావించవచ్చును. పోతపాలు పోసినట్టయితే యించుమించుగా ఒకపౌను బరువున్నబిడ్డకు రోజుకు 2½ ఔన్సుల లెక్కను పాలు కావలసివుంటుంది. కొందరుపిల్లలు ఎక్కువ తాగవచ్చు, మరికొందరు కొంచం తక్కువ తాగవచ్చును. కాబట్టి పౌను బరువుకు 1½ ఔన్సునుంచి 2½ ఔన్సువరకు పాలు అవసరమనిచెప్పవచ్చును. బిడ్డకేవలం ఒక్కఆహారం వల్లనే పెరగడం జరగదు. మంచిగాలి, ఆడుకొనడం, తలిదండ్రుల ప్రేమకూడా వాళ్ళు పెరగడంలో ముఖ్యమే. ఒక్క సంవత్సరంలోపల పిల్లలకు యివన్నీ తెలుస్తాయా అని అనుకుంటారేమో. ఇవి పెద్దవాళ్ళకెంత ముఖ్యమో పిల్లలకుకూడా అంతే అవసరం. బిడ్డకు తక్కిన అన్నిరకాల పాలకన్నా తల్లిపాలు చాల శ్రేష్టమైనవి. అవి బిడ్డకోసమై తల్లి శరీరంలోంచి సహజంగా, ప్రత్యేకంగా తయారై లభిస్తాయి కాబట్టి వాటివల్ల అనేక లాభాలున్నాయి. డబ్బు ఖర్చుండదు. సీసాలూ, పీకెలూకొని అవి కడుక్కుంటూ పాలు వేడిచేసి కలిపి యిచ్చేబాధ వుండదు. బిడ్డ తల్లిఒడిలో పండుకుని పాలు తాగడంలో చాలా భద్రత వుంటుంది. తల్లిపాలు తాగే పిల్లలకి జబ్బులురావడానికి చాలాతక్కువ అవకాశాలుంటాయి. తల్లిపాలు యితర పాలకంటే తేలిగ్గా అరుగుతాయి. అయితే కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో పిల్లలకు తల్లిపాలు అసలు యివ్వనేకూడదు. తల్లికి క్షయజబ్బు వున్నప్పుడు ఏ పరిస్థితుల్లోనూ బిడ్డకు పాలివ్వకూడదు. అటువంటి తల్లి ఒడిలో బిడ్డ పడుకొని పాలు తాగేట్లయితే బిడ్డకు సులభంగా క్షయ సంక్రమించడమే కాక రోగియైన తల్లికి మరింత ఆరోగ్యం దెబ్బతినడం, మరింత బలహీనత యేర్పడడం జరుగుతుంది. గుండెజబ్బున్న తల్లులు, బాలెంత రోగం, నిమోనియా, మశూచి, పొంగు వంటి జబ్బులు, మూత్రపిండముల జబ్బు, హృద్రోగం వున్న తల్లులు పిల్లలకు పాలివ్వరాదు. పాలు ఎక్కువై గడ్డలు కట్టినప్పుడు అవి కరిగేవరకూ పాలివ్వకూడదు. పాలిచ్చే భాగం చర్మం పగిలివుంటే అది మానేవరకూ పాలివ్వకూడదు. బిడ్డ నోటికి గ్రహణం ఏర్పడితే, పూస్తే పాలు పిండి పొయ్యడం అవసరం. బిడ్డలో ఏదైనా జబ్బున్నా సరే అది తల్లిని సంక్రమించకుండా వుండడానికి స్తన్యం పిండి పట్టటం మంచిది. ఆ పిండడంలో జాగ్రత్తగా పిండాలి. లేనట్లయితే అసలు పాలే ఎండిపోయే అవకాశం వుంటుంది.

తల్లిపాలు పిల్లలకు పడవని మనలో కొందరు అభిప్రాయపడతారు. ఇటువంటి సందర్భాలు చాలా అరుదనే చెప్పవచ్చు. సామాన్యంగా తల్లిపాలు పడక పోవడమంటూ వుండదు. తల్లి బహిష్టయినపుడు, గర్భం తాల్చినపుడు పాలివ్వకూడదనికొందరంటారు. బహిష్టయినంతమాత్రాన పాలు మాన్పవలసిన అవసరంలేదు. గర్భవతులైనప్పుడుమాత్రం లోపలవున్న పిండానికి ఆహారం సహజంగా అందుతూవుంటుంది. కాబట్టి బిడ్డకు పాలిస్తే బలహీనత యేర్పడే పరిస్థితిలో యివ్వకూడదు. ఇటువంటి శ్రద్ధలన్నిటినీ తీసికొని మనం పిల్లలని పెంచినపుడు ఆరోగ్యవంతులుగా, హాయిగా, కులాసాగా, హుషారుగా పిల్లలు కేరింతలు కొడుతూ మనకు ఆనందాన్ని కల్గిస్తారనడంలో సందేహం లేదు. ★

(55 వ పేజీ తరువాయి)

విద్యార్థులు, గృహిణులు జీవనోపాధికి వలయు డబ్బు సంపాదించుకొని కక్కుర్తి పనులు చేయకుండా వుండడానికి అవకాశం వున్నది. అట్లే మన దేశంలోనూ వారివారి తరగతుల ప్రకారం వృత్తులు ఏర్పరచడం ముఖ్యం. కొజ్జాలు, సెక్స్ పెర్వర్ట్స్ వలన కూడా వ్యభిచారం చాలా పెరిగిపోతున్నది. యిలాంటివారి సంఖ్య కొద్దే గనుక వారిని ఉపేక్షించవచ్చును. బాలికలకు వుగ్గుపాలతోనే నైతిక విలువలు నూరిపోయవలసిన విధి మనమీద వున్నది. అదేదో నాగరికత యని ఆడ మొగ హద్దులు దాటి తిరగడం మనకు క్షేమం కాదు.

19 వ శతాబ్దములో యింగ్లండులో యిలాంటి పరిస్థితులే వున్నప్పుడు జోసఫీను బట్లరు (Josephine Butler) అనే ఆవిడ 1864 లో తన బృందంతో మన 1956 చట్టము వంటి దాన్ని అక్షరాల వారి దేశములో అమలయ్యేటట్లు చేసింది. సుఖవ్యాధులతో బాధపడేవారికి ఆశాకిరణాన్ని చూపింది. గ్రామాలు, పట్టణాలు, వాడవాడలు నిర్విరామంగా తిరిగి ప్రచారంచేసి స్త్రీలలో సంచలనము కలిగించి వ్యభిచార వ్యవస్థ నిర్మూలనానికి ఎంతో శ్రమపడింది. తన ఏకైక పుత్రిక మరణించగా ఆశోకం సైతము అణచుకొని తన జీవితాన్ని వ్యభిచార నిర్మూలనానికే అంకితంచేసి సఫలీకృతురాలైంది.

సరిగ్గా ఒక శతాబ్దం తరువాత మనము మనదేశములో అదే పరిస్థితులలోవున్నాము. మనదేశములో గ్రామగ్రామానా ఒకజోసఫిన్ బట్లరు అవతరించి ఈ వ్యభిచార పిశాచాన్ని సంహరించి మనప్రజల ఆరోగ్యాన్ని, అనందాన్ని కాపాడవలసివున్నది. ఇది నిర్మూలమైతే దానితోపాటు ప్రజా జీవితంలో మరి కొన్ని కలుషితాలుకూడా నశించగలవు. ఈ పని కేవలం నైతిక పునరుద్ధరణ సంఘం వారికి ప్రభుత్వానికి వదలక సంఘసేవా పరాయణులైన స్త్రీలు శ్రద్ధ వహించడం చాలాముఖ్యం



## "విజయలక్ష్మి"

లేవోయీ భరతవీర !
రావోయీ కర్మశూర !

నీదుశక్తి చూపించగ
నిఖిల జగము నిను పొగడగ
విద్రోహుల గుండెల్లో
విచ్చుకత్తి వగురీతిగ—

పొరుగు పచ్చదనంచూచి
ఓర్వలేని దురాత్మకుల
పొగరణగించాలిర ! -గుణ
పాఠం నేర్పించాలిర !

పొగిలిన హృదిలో రగిలే
భీకరాగ్ని జ్వాలలలో
భస్మమవాలిర ! చైనా
దర్పమంత నిముసంలో ! —

దానవతకు పరాభవం
మానవతకు దిగ్విజయం
కలుగునసే నగ్న సూక్తి
మళ్ళీనిజమయే రీతి—

అడుగు అడుగులోన కలిపి
నడుము బిగించావంటే
నీకుసాటి ఎవరోయీ ?
'విజయలక్ష్మి—' నీదోయీ !

—— "సత్యం"

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1963 మార్చిలో దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం జరిగింది.

అనంతపురం జిల్లా

ఎద్దులపల్లి (గుంటితాలుకా), మేడాపురం (ధర్మవరం తాలుకా), మార్తాడు తాటిచర్ల, పొదరాళ్ళ, బ్రహ్మనాయలేరు (అనంతపురం తాలుకా) : పులకుంట, కాగల్లు, నేతులపల్లి, దాసరపల్లి, కొర్లకుంట, (హిందూపురం తాలుకా) ; కనగనపల్లి (ధర్మవరంతాలుకా); పెద్ద పొలమడ, చిన్న పొలమడ (తాడిపత్రి తాలుకా) ;

కర్నూలు జిల్లా

గోరంట్ల, చనుగొండ్ల, నగలపురం, పెంచికలపాడు, తోలసపురం, పసుపుల, (కర్నూలు తాలుకా) ; కొలుములపల్లె (ధోన్ తాలుకా) ;

కడప జిల్లా

ఒర్లగట్టుపాడు (రాజంపేటతాలుకా).

చిత్తూరు జిల్లా

మేకలవాండ్లపల్లి (మదనపల్లితాలుకా); పాతవీరపురం, కొత్తవీరపురం (కాళహస్తి తాలుకా) ; నల్లమనికల్వ, తానపల్లి, (చంద్రగిరి తాలుకా) ; సాముదాయం, కీలగారం, వెంకటకృష్ణాపాలెం, నగలేరు, గోవిందప్పనాయుడు కంద్రీగ, సుబ్బనాయుడు కంద్రీగ, అర్నాయం కంద్రీగ, బొప్పరాజపాలెం, చిత్తూరు కంద్రీగ, కూచి కంద్రీగ, నాయన కంద్రీగ, కృష్ణంరాజు కంద్రీగ, తుంబురు, పాలమంగళం దక్షిణ కంద్రీగ, పాలమంగళం ఉత్తరపుకంద్రీగ, శ్రీరామాపురం, పెద్దపట్టాడ, సదాశివపురం, వేదాంతపురం, కొప్పెడు ఆచార్యులు కంద్రీగ, (పుత్తూరు తాలుకాలోవి) ; మెర్లపాక, కొత్త కంద్రీగ, (కాళహస్తితాలుకా) ; చౌడేపల్లి, పుదిపట్ల (పుంగనూరుతాలుకా) మిరియం గంగనపల్లి నెల్లమండవారిపల్లి, (వాయలపాడుతాలుకా) ఎర్ణంపల్లి, మడుపురివాండ్లపల్లి (చిత్తూరు తాలుకా) ; నరగకపల్లి, గూటంవారిపల్లి, పాత్రగంగన్నపల్లి, (మదనపల్లి తాలుకా) ; మంగళపల్లి, జోగిపల్లి (బంగారుపాలాయం, నబ్ తాలుకా) ;



# ప్రగతి పథంలో

ఆదిలాబాదు జిల్లా

*మిగులు బడ్జెటు*

ఆదిలాబాదు జిల్లా పరిషత్తు ఏప్రిల్ 24, 25 వ తేదీలలో సమావేశమై 1963–64 వ సంవత్సరానికి గాను రూ. 56,68,775 ల ఆదాయము, రూ. 52,63,338 ల వ్యయంతో కూడిన బడ్జెటు అంచనాలను ఆమోదించింది. ఈ బడ్జెటులో దాదాపు రూ. 5 లక్షల మిగులు చూపబడింది.

*రోడ్డు పనులు*

1963–64 వ సం॥లో రోడ్డు పనుల నిమిత్తం రూ. 10 లక్షలు కేటాయించ డానికై ప్రభుత్వాన్ని అభ్యర్థించడానికి పరిషత్తు తీర్మానించింది.

వ్యవసాయోత్పత్తి, కుటీర, గ్రామీణ పరిశ్రమలు, గ్రామీణ ప్రాంతాలలో మనుష్య శక్తి వినియోగం మొదలైన విషయాలలో జరిగిన అభివృద్ధిని కూడా పరిషత్తు సమీక్షించింది.

ఆనంతపురం జిల్లా

*ఓరియంటేషన్ శిక్షణ*

చిన్న కొత్తపల్లి పంచాయతీ సమితి కేంద్ర కార్యస్థానంలో ఏప్రిల్ 18 నుంచి 7 రోజులపాటు V. V. F. పోస్ట్ ఓరియం టేషన్ శిక్షణ నిర్వహించారు. విస్తరణాధి కార్లంతా సమావేశానికి హాజరై వివిధ అభివృద్ధి కార్యకలాపాలు, ధరల పెరుగుదల నిరోధన, ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరుగు దల మొదలైన విషయాలపై ప్రసంగాలు చేశారు.

చిత్తూరు జిల్లా

*గ్రాంటుల సంపూర్ణ వినియోగం*

మదనపల్లి బ్లాకుకు సమాజాభివృద్ధి గ్రాంట్ల క్రింద 1962–63 వ సంవత్సరానికి కేటాయించిన రూ 1,38,000 ల మొత్తాన్ని పూర్తిగా ఖర్చు చేశారు. 1963 ఏప్రిల్‌లో పారిశ్రామిక సహకార సంఘాలను రెండింటిని కొత్తగా ప్రారంభించారు. విస్తృతీకృత పౌష్టికాహార కార్యక్రమాన్ని అమలు పరిచేందుకై 9 గ్రామాలను ఎన్నికచేశారు.

*పన్నుల వసూళ్ళు*

13 పంచాయతీలు ప్రస్తుత సంవత్సర పన్నులను, బకాయీలను నూటికి నూరు శాతం వసూలు చేశాయి. బ్లాకు ప్రాంతంలో 1962–63 వ సంవత్సరానికి ఉత్తమ పంచాయతీగా చిన్న తిప్పసముద్రం గ్రామం ఎన్నికైంది.

*బాలల క్రీడోత్సవం*

కార్వేటినగరం పంచాయతీ సమితి ఆధ్వర్యంలో పాలసముద్రంలో స్థానిక ఉపాధ్యాయ సంఘం వారు ఏప్రిల్ 24 వ తేదీన బాలల క్రీడోత్సవాన్ని జరిపారు. జిల్లా విద్యాశాఖాధికారి ఉత్సవాన్ని ప్రారం భించారు.

*భూమి అభివృద్ధి పథకం*

మదనపల్లి పంచాయతీ సమితి ప్రాంతంలో నీటి వనరులు, భూములను సేద్య యోగ్యం చేయడానికి సంబంధించిన పథకాల క్రింద ఆయిల్ ఇంజన్లు, విద్యు చ్ఛక్తి మోటార్ల కొనుగోలుకై 1963 మార్చిలో రూ. 26,000 లు పంపిణీ చేశారు.

*బావుల అభివృద్ధి*

58 సబ్సిడీ బావులను మంజూరు చేశారు. వీటివల్ల సుమారు 106 ఎకరాలకు లాభి స్తుంది. బ్లాకు ప్రాంతంలోని 23 పంచాయ తీలలోనూ కలిపి గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం, రక్షణ శ్రామిక బ్యాంకులలో 690 మంది వాలంటీర్లు చేరారు.

సమితి ప్రజలు జాతీయ రక్షణ నిధికి రూ. 24,000 లకు పైగా విరాళంగా సమ ర్పించారు.

కడప జిల్లా

*గ్రామస్థుల రేడియో గోష్ఠి*

కడప జిల్లా గ్రామస్థుల రేడియో గోష్ఠి వారు ఏప్రిల్ మూడవ వారంలో సమా వేశమై, పోరుమామిళ్ళ బ్లాకులోని రంగసముద్రం గ్రామస్థుల రేడియో గోష్ఠిని జిల్లాలోని ఉత్తమగోష్ఠి కేంద్రంగా 1961–62 సంవత్సరానికి ఎన్నిక చేశారు.

ఉత్తమ గోష్ఠి కేంద్రానికి రూ. 500/–లు విలువచేసే ఆధునిక వ్యవసాయ పనిముట్లను బహూకరిస్తారు.

తూర్పుగోదావరి జిల్లా

*జాతీయ పొదుపుఉద్యమం*

ఈ జిల్లాలోని పంచాయతీ సమితులు, పూర్వ విస్తరణ బ్లాకులన్నింటిలోను 1962–63 వ సం॥లో జాతీయ పొదుపు పథకానికి పెట్టుబడులు పెట్టడంలో గరిష్ఠ శాతం (45.8) పొందిన పిఠాపురం పంచా యతీ సమితికి వెండి రోలింగ్ షీల్డును బహూకరించారు.

ఈ జిల్లాలో 1962–63వ సం॥లో జాతీయ పొదుపు పథకానికి రూ. 27,64,858 లను పెట్టుబడి పెట్టడం జరిగింది.

1963 మార్చి నెలాఖరు నాటికి రూ. 40,650 ల మేరకు ప్రీమియం ప్రైజ్ బాండ్ల అమ్మకం జరిగింది.

*పన్నుల వసూళ్ళు*

కొత్తపేట పంచాయతీ సమితిలోని పంచాయతీలన్నీ 1962–63 వ సం॥ లో నూటికి నూరువంతులు పన్నులు వసూలు చేశాయి.

గుంటూరు జిల్లా

*నూతన పాఠశాలా భవనాలు*

ఈపూరు పంచాయతీ సమితిలోని వెల్లటూరు, సంగెనీడుపాలెం గ్రామాలలో నిర్మించిన రెండు ఎలిమెంటరీ పాఠశాలా భవనాలకు ప్రజాళిక, పంచాయతీరాజ్ శాఖల

మంత్రి 1963 ఏప్రిల్‌లో ప్రారంభోత్సవం చేశారు.

*రక్షణనిధికి పోలింగ్*

జాతీయ రక్షణనిధికి సొమ్ము సేకరించే నిమిత్తం ఈమనిలో ఏప్రిల్ 19 వ తేదీన కొత్తరకం పోలింగ్ నిర్వహించారు. శివాలయం, రామాలయం, పంచాయతీ గ్రంథాలయం, పంచాయతీ సమితి ఎలిమెంటరీ పాఠశాల (ఉత్తరం) హరిజన కాలనీలోని సాల్వేషన్ ఆర్మీ ఎలిమెంటరీ పాఠశాలలలో అయిదు బ్యాలెట్ పెట్టెలు వుంచారు.

యథాశక్తి విరాళాలు ఇవ్వవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఈ కొత్త రకం పోలింగ్ ద్వారా జాతీయ రక్షణనిధికి రూ. 392.60 న. పైసల మొత్తం లభించింది.

## హైద్రాబాదు జిల్లా

*ప్రాథమిక ఆరోగ్య కేంద్రం*

హిమాయత్ నగర్ పంచాయతీ సమితి ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ఏప్రిల్ 22 వ తేదీన ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖల మంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంలో కలెక్టరు ప్రసంగించారు.

## ఖమ్మం జిల్లా

*దళపతుల శిక్షణ*

ఖమ్మం సమితిలోని అత్యవసర సంఘాల అధ్యక్షులు, గ్రామీణ స్వచ్ఛంద సేవక దళాల దళపతులకొరకు నిర్వహించిన ఓరియంటేషన్ శిక్షణ కేంద్రంలో 62 మంది వివిధ విషయాలలో శిక్షణ పొందారు. ఏప్రిల్ 14 వ తేదీన శిక్షణ ముగిసింది.

ప్రతి సమితిలో అనేకమంది అనధికార్లు కూడా శిక్షితులనుద్దేశించి ప్రసంగించడం ఈ శిక్షణ ప్రత్యేకాంశం.

## కృష్ణా జిల్లా

*క్షయ ఆసుపత్రి*

100 మంది రోగులకు పడక సౌకర్యం గల క్షయ ఆసుపత్రికి రాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి ఏప్రిల్ 14 వ తేదీన గుండాల వద్ద శంకుస్థాపన చేశారు. దీనికి లక్షరూపాయలు ఖర్చవుతుందని అంచనా. అయిదు సంవత్సరాలలో దీని నిర్మాణం పూర్తవుతుంది.

## కర్నూలు జిల్లా

*చర్మకారుల శిక్షణ కేంద్రం*

కర్నూలు జిల్లా పీపల్లి గ్రామంలో చర్మకారుల తొలి శిక్షణ కేంద్రానికి ముఖ్యమంత్రి ఏప్రిల్ 21 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

## మహబూబ్‌నగరం జిల్లా

*సాంద్ర వ్యవసాయ కార్యక్రమం*

మహబూబ్‌నగరం జిల్లాలో ఈ సంవత్సరంనుంచి సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని అమలు జరుపుతారు. 18 బ్లాకుల నిమిత్తం రూ. 54 లక్షలు కేటాయించడం జరిగింది. ప్రతి బ్లాకులో రూ. 3 లక్షల చొప్పున ఖర్చు చేస్తారు.

## మెదక్ జిల్లా

*సమితి ప్రారంభోత్సవం*

అల్లాదుర్ పంచాయతీ సమితికి రెవెన్యూ మంత్రి మే 4 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. మెదక్ కలెక్టరు ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించారు.

*శిక్షణ శిబిరం*

సదాశివపేట పంచాయతీ సమితి బ్లాకు స్థాయి పి. ఐ. ఓరియంటేషన్ శిక్షణా శిబిరాన్ని ఏప్రిల్ 5 నుంచి 11 వ తేదీ వరకు వారం రోజులపాటు నిర్వహించింది.

## నల్గొండ జిల్లా

*పైలెట్ ప్రాజెక్టు*

రూ. 20 లక్షల గ్రామీణ పరిశ్రమల పైలట్ ప్రాజెక్టుకు ఏప్రిల్ 2 వ తేదీన ముఖ్యమంత్రి నల్గొండలో ప్రారంభోత్సవం చేశారు. ఇది ప్రస్తుత పరిశ్రమలను పటిష్ఠం చేయడంతోపాటు కొత్త పరిశ్రమల స్థాపనకు కూడా సహాయపడుతుంది.

*జాతీయ రక్షణ నిధి విరాళం*

ముఖ్యమంత్రి నల్గొండను సందర్శించిన సందర్భంలో కలెక్టరు జాతీయ రక్షణ నిధి నిమిత్తం ఆయనకు రూ. 92,455 లు సమర్పించారు.

## నిజామాబాదు జిల్లా

*శిక్షణ శిబిరం*

బాన్స్‌వాడ పంచాయతీ సమితి బ్లాకు కేంద్ర కార్యస్థానంలో ఏప్రిల్ 8 వ తేదీ నుంచి 7 రోజులపాటు గ్రామీణ స్వచ్ఛంద సేవక దళం, రక్షణ శ్రామిక బ్యాంకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. బ్లాకులోని దళపతులు అధ్యక్షు లందరికీ శిక్షణ ఇచ్చారు.

## విశాఖపట్నం జిల్లా

*ప్రపంచ ఆరోగ్య దినోత్సవం*

అనకాపల్లి పురపాలక సంఘం వారు ఏప్రిల్ 7 వ తేదీన ప్రపంచ ఆరోగ్య దినోత్సవాన్ని సముచిత రీతిని జరిపారు. ఉదయంపూట ఊరేగింపు చేశారు. ఈద్వారా వివారణకై తీవ్రంగా ప్రచారం జరిపారు.

## వరంగల్ జిల్లా

*హోంగార్డ్స్*

హన్మకొండలోని పోలీసు పరేడు మైదానంలో ఏప్రిల్ 11 వ తేదీన కలెక్టరు హోంగార్డ్స్ శిక్షణవర్గాలకు ప్రారంభోత్సవం చేశారు. ప్రమాణ స్వీకారం తరువాత ప్రథమ చికిత్స, అగ్ని ప్రమాదాల నిరోధన, రక్షణ చర్యలు మొదలైన వాటిలో ప్రత్యక్ష ప్రదర్శనలు జరిగాయి.

*మోటార్ బోట్*

సాంఘిక సంక్షేమశాఖా మంత్రి ఏప్రిల్ 4 వ తేదీన ములుగు పంచాయతీ సమితి భూసాపూర్‌లోని కొండజాతుల వారి కాలనీని సందర్శించారు. తరువాత ఆయన రామప్ప సరస్సు వద్దకు వెళ్లారు. అక్కడ "వైల్డ్ డక్" మోటారు బోట్ సర్వీసుకు ప్రారంభోత్సవం చేశారు. విహార యాత్రికుల వినియోగార్థం ఇది ఉద్దేశించబడింది.

*పాల స్టోర్స్*

వరంగల్‌లో టోకు వినియోగదార్ల సహకార కేంద్ర పాల స్టోర్స్‌ను పది శాఖలతో నెలకొల్పడానికి రాష్ట్ర ప్రభుత్వం రూ. 3 లక్షలు మంజూరు చేసింది. ★

# చేయూత

వాసిరాజు ప్రకాశం

తమ్ముళ్లూ! చెల్లాయిలూ !

మనలో అందరూ ధనవంతులే వుండరు; అందరూ పేదవారే కారు.

ఏ రోజు కూలి, ఆ రోజు చేసికొంటూ సాయంత్రమయ్యేసరికి రెండు రూపాయిలో, మూడు రూపాయిలో, సంపాదించుకొని వచ్చి సంసారం సాగిస్తున్న కుటుంబాలు ఎన్నో వున్నాయి. అలాంటి వారికి, ప్రతి క్షణమూ ఒక యుగంలాగా గడుస్తుంది. ఏపూట రెక్కాడక పోతే ఆరోజు డొక్కలు కూడా ఆడవు. పొయ్యిలో పిల్లి లేవదు. సహజంగా పేదవాళ్ళకే పిల్లలు ఎక్కువ మంది వుంటారని వాడుక. వారికి ఇంటి భారాన్ని నిర్వహించటమే కష్టంగా వున్న స్థితిలో వారి పిల్లలకు చదువుఎలా చెప్పించు కుంటారు.

ఇటువంటి పేదవారే కాక, మనలో మధ్యతరగతి కుటుంబీకులని మరొకవర్గం వున్నది. అంటే పూట గడవని పేదవాళ్లకు—భాగాసౌఖ్యాలను అనుభవిస్తున్న ధనికులకు మధ్యన వుంటారన్న మాట వీరు. ఈ మధ్యతరగతి వారికి అవసరమయినంత డబ్బు వుండదు; కానిఎలాగో ఒక లాగున సంసారం గడిచిపోతూ వుంటుంది. అంటే వారికి వచ్చేఆదాయం సరిపోయి, సరిపోనట్లుగా వుంటుంది. భోజనానికి, బట్టలకు, ముఖ్యమైన ఇంటి ఖర్చులకు మాత్రమే వారికి డబ్బు వుంటుంది. వినోదాలకు, విలాసాలకు వారు చాలా దూరంగా వుండి తీరాలి.

ఇలా మధ్యతరగతి కుటుంబాలకు చెందిన వారిలోసామాన్యంగా చాలామంది ఉద్యోగులే అయి వుంటారు. వ్యాపారం చేసికొనేవారు, ఇతర వృత్తులలో వుండేవారు బహు కొద్దిమంది మాత్రమే వుంటారు. ఈ ఉద్యోగాలలో వుండేవారు కూడా, పెద్ద ఉద్యోగస్తులు కారు. నెలకు వందో రెండువందల రూపాయిలో వస్తూ వుంటాయి. ఆడబ్బుతోనే సంసారాన్ని గడుపు కోవాలి. భోజనం ఖర్చు, బట్టలఖర్చు—ఒకటా ! సంసారం అన్న తరువాత లెక్కకుమించి నన్ని ఖర్చులు. మరీ పెద్ద సంసారమయితే—ఆడపిల్లల పెళ్లిళ్లు చేయాలి. కరువులో అధికమాసం అన్నట్లు—మధ్య మధ్యలో ఇంట్లోఅనారోగ్యాలు. దీంతో గృహ భారాన్ని నిర్వహించే సంసారికి చాలా బాధగా వుంటుంది. ఈఖర్చులన్నీ ఎలా ఎదుర్కోవాలో తెలియక వుక్కిరి, బిక్కిరి అయిపోతూ వుంటారు. ఇంట్లో వుండే మగ్గురో నల్గురో యెంతమందైతే అంతమంది ఆయన సంపాదించే నెలజీతం మీదనే ఆధారపడి వుంటారు.

రేపటి రోజున ఏం జరుగుతుందో ఇవ్వాళ చెప్పలేక యాంత్రికంగా గడిచి పోయేన్ని మధ్యతరగతి కుటుంబాల విషయం మరీ కష్టం. కాలం కలిసిరాక, ఆ ఇంటి యజమానులు—అంటే—ఉద్యోగులు—మధ్యలో మరణించిన వుదంతాలు లేకపోలేదు. అలాంటి వ్యక్తి పోతే ఏం మిగులుతుంది ఆ ఇళ్ళలో ?—చీకటి తప్ప. ఇంటి పెద్ద వుండి, నెల వచ్చే సరికి జీతం తెస్తున్న రోజుల్లోనే గడవటం కష్టం. అలాంటి స్థితిలో, ఆ నెల జీతం తెచ్చే వ్యక్తికూడా మాయమయినప్పుడు ఆ ఇల్లు దాదాపు నిరాధారమైపోతుంది.

పిల్లలంతా చదువుకొంటూవుంటారు, ఇక వారి చదువుకు అంతరాయం కలిగే పరిస్థితి ఏర్పడుతుంది! వయస్సు రాని, ఆ స్థితిలో చదువుకు అంతరాయం కలగటం పిల్లల్నిమానసికంగా కూడాప్రభావితులను చేస్తుంది. వారు చిన్నతనం నుంచీ దురలవాట్లకు అలవాటుపడే ప్రమాదం కూడా యేర్పడుతుంది.

అలాంటి సంసారాలను ఎవరైనా సమయానికి ఆదుకొనకపోతే, అవిచాలా కష్టాల నెదుర్కోవలసిన పరిస్థితు లేర్పడతాయి. చదువుకోవలసిన పిల్లలుతప్పుడు దారులు తొక్కి, చివరకు తల్లిదండ్రులకే కాదు అందరికి భారమయిపోతారు. అందువల్ల ఆంధ్రప్రదేశ్, ప్రభుత్వం తమ ప్రభుత్వోద్యోగులలో ఎవరైనా, —విధివైపరీత్యంవల్ల— యిలాంటి పరిస్థితులలో చిక్కుకొనిపోతే వారి పిల్లలకు చదువు చెప్పించి, అభివృద్ధికి తీసుకురావడంలో ప్రభుత్వం సాయపడుతున్నది. ప్రభుత్వోద్యోగంలో వుండి, మధ్యలో మరణించిన ప్రతివ్యక్తి సంతానమూ ప్రభుత్వం నుంచి యీ సహాయం పొందవచ్చును. కళాశాలల్లోను, ఉన్నతపాఠశాలల్లోను, ఎలిమెంటరీ పాఠశాలల్లోను చదివేవారందరూ ప్రభుత్వ సహాయానికై దరఖాస్తులు పంపుకోవచ్చును.

ప్రభుత్వోద్యోగులు, మధ్యలో మరణించినందున వారిపిల్లల అభివృద్ధి ఆగిపోరాదని, మిగతా పిల్లలందరితో పాటు వారుకూడా బాగా చదువుకొని అభివృద్ధికి రావాలన్న మహదాశ

## బాలానందం

యంతో రాష్ట్ర ప్రభుత్వం ఒక పథకాన్ని ప్రారంభించింది.

ఈ పథకం, ఆంధ్రప్రాంతానికి, తెలంగాణా ప్రాంతానికి వేర్వేరుగా వుంది. ఈ పథకం ద్వారా యేర్పరచిన సహాయాలను 'రియాయతీ స్కాలర్ షిప్పు'లని అంటారు.

దరఖాస్తు ఫారాలు, ఆయా సంస్థలలోనే లభిస్తాయి. వాటిని సక్రమంగా పూర్తిచేసి, రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరు, హైదరాబాదు వారికి తమ తమ సంస్థలద్వారా పంపుకోవాలి. ఇతర రాష్ట్రాలలో చదువుతున్న బాలబాలికలు రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరు వారికి వ్రాసి తెప్పించుకోవచ్చును. గత సంవత్సరం స్కాలర్ షిప్పు పొంది, యీ సంవత్సరం కూడా తిరిగి దానిని రెన్యూ చేయించుకోదలచినవారు, పోయిన సంవత్సరం "స్కాలర్ షిప్పు" నంబరును, స్కాలర్ షిప్పు ఇచ్చిన తేదీలను ఉదహరిస్తూ దరఖాస్తు పంపాలి.

ప్రతి దరఖాస్తుతోనూ, తమ తండ్రి పనిచేసిన ప్రభుత్వ కార్యాలయంఅధికారి 'సర్టిఫికేటు' కూడా జతచేసి పంపాలి. ఫలానావారు ప్రభుత్వోద్యోగంలోవుండి, మధ్యలో మరణించారని ఆ 'సర్టిఫికేటు'లో స్పష్టంగా వుండాలి. 'సర్టిఫికేటు' లేని దరఖాస్తులను ప్రభుత్వం ఎలాంటి పరిస్థితులలోనూ పరిశీలించదు.

ఈ 'స్కాలర్ షిప్పు' పొందటానికి, వయఃపరిమితి ఏమీ లేదు.

విద్యార్థి, తగినంతగా అభివృద్ధి చెందటంలేదనే అభిప్రాయం కలిగితే ప్రభుత్వం యీ స్కాలర్ షిప్పును ఉపసంహరించుకొనవచ్చును. ఒక సంవత్సరం తప్పిపోయిన విద్యార్థికి, రెండవ సంవత్సరంలో 3/4 వంతు స్కాలర్ షిప్పు డబ్బు మాత్రమే ఇస్తారు. అనారోగ్యం వల్ల తప్పిపోయిన. విద్యార్థులకు మాత్రం రెండవ సంవత్సరం కూడా పూర్తి మొత్తాన్నే ఇస్తారు. వీటిని రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ డైరెక్టరే ఇస్తారు.

ఈ మొత్తం, హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో చదివేవారికి ఒక రకంగాను, జిల్లాలలో చదివేవారికి ఒక రకంగాను యివ్వడం జరుగుతుంది.

హైదరాబాదు, సికిందరాబాదు నగరాల్లోని కళాశాలల్లోను, హయ్యర్ సెకండరీ, బహుళార్థ సాధక పాఠశాలల్లోను చదివే వారికి నెలకు పన్నెండున్నర రూపాయలు ఇస్తారు. జిల్లాలలో అయితే పదిరూపాయిలిస్తారు. రాజధానిలోని పాఠశాలల్లో 9, 10, 11 తరగతుల్లో చదివేవారికి నెలకుఎనిమిదిరూపాయలు; జిల్లాల్లోఆరురూపాయలుఇస్తారు. నగరంలో 6,7,8 తరగతుల విద్యార్థులకు నెలకు ఆరు రూపాయలు; జిల్లాలలో నాలుగురూపాయలు ఇస్తారు. ఒకటి నుంచి ఐదు వరకు అంటే ప్రాథమిక పాఠశాలల్లో చదివేవారికి నగరంలో నెలకు నాలుగు రూపాయలు, జిల్లాలలో నెలకు రెండు రూపాయలు యిస్తారు.

ప్రభుత్వం గుర్తించిన కళాశాలల్లోను, పాఠశాలల్లోను చదువుతూ వుండే వారికి మాత్రమే యీ పథకం వర్తిస్తుంది. అందువల్ల మనలో యిటువంటి దురదృష్టానికి గురైనవారెవరైనావుంటే సక్రమైన పద్ధతిలో అప్లికేషన్లు పెట్టుకొని ప్రభుత్వం చేస్తున్న యీ సహాయాన్ని సద్వినియోగం చేసుకొని విద్యావంతులమై అభివృద్ధికి రావడం మనకే కాక మనయింటికీ ఊరుకీ దేశానికీ క్షేమం కదూ !



## అమ్మా! నీవన్నీ అబద్ధాలేనమ్మా!!

-జి. కోటయ్యా

అబద్ధా లాడకుమని
అదలిస్తావు నన్ను
ఉత్తుత్తి మాటలెన్నో
ఊరికె చెపుతావునాకు
అమ్మా నీ మాటలు
అన్నీ అబద్ధాలేనమ్మా !

గోరుబువ్వ తినక నేను
గోలచేస్తూవుంటె
జాబిల్లి వచ్చె నదుగో
చందమామ వచ్చెనంటు
గోరుబువ్వ పెట్టినన్ను
ఊరడిస్తుంటావు
జాబిల్లి రాదెపుడు
చందమామ రాదెపుడు
అమ్మా నీమాటలు
అన్నీ అబద్ధాలేనమ్మా

నీ ఒడిలో నే కూచొని
మారాము చేస్తూంటె
జామ కొమ్మపైన
రామ చిలుకను చూపి
నీ నేస్తమును కోరి
తానొచ్చె రాచిలుక
జామ కొమ్మమీద
చక్కగా కూర్చుంది
ఊరు కొమ్మని నన్ను
ఊరడిస్తుంటావు
రాచిలుక రాదాయె
నా చెలిమి లేదాయె
అమ్మా నీ మాటలు
అన్నీ అబద్ధాలేనమ్మా

చిన్నారి నాబాబు
చెలువుగా నిలుచుంటె
"మల్లె పువ్వులగాలి
ముత్యాల వాన" యని
పాటలను తియ్యగా
పాడు తుంటావు
మల్లెపువ్వుల గాలి
మనకు రానేలేదు
ముత్యాల వానెపుడు
ముసురుకొని రాదాయె
అమ్మా నీ మాటలు
అన్నీ అబద్ధాలేనమ్మా

# చెవిటి మాలోకం

అది ఒక పల్లెటూరు. ఒక చెవిటి గొర్రెల కాపరి, గొర్రెలను మేపుకుంటూ కాలవ గట్టున చెట్టుక్రింద కూచున్నాడు. దాదాపు 12 గం॥ అవుతుంది. ఆ రోజు చద్ది తినకుండా రావడంమూలాన అతనికడుపులో కాకిపిల్ల గంతులేస్తోంది. అక్కడికి కొద్ది దూరంలోనేఉంది వాళ్ళగుడిసె. అయినా మందను విడిచి ఎలా వెళ్ళడమా అని ఆలోచిస్తున్నాడు. సరిగ్గా అదే సమయానికి ఒక పెద్దమనిషి ప్రక్కనున్న చెరువులో స్నానానికి వచ్చాడు. ఆయనికి పుట్టెడు చెముడు. ఆ పెద్దమనిషిని చూడగానే గొఱ్ఱెలకాపరికి ప్రాణంలేచివచ్చింది. గబగబా ఆయన దగ్గరకువెళ్ళి గడ్డంక్రింద కర్ర ఆనించుకొని, కొంచెం దూరంగా నుంచొని 'అయ్యా, అయ్యా, తమరిక్కడే తానం చేత్తారు గందా. కూతంత నా గొఱ్ఱెల్ని ఓ కంట కనిపెట్టండిసామీ; నే నేమోగుక్కైడు గంజినీళ్ళుత్రాగి పరుగెత్తు కొత్తాను. కాత్త బద్దిరంగా చూశారంటే తమ కా చిన్న కుంటి మేకపిల్ల నిత్తాను బాబూ." అని అన్నాడు. యీ మాటలు ఆ పెద్దమనిషికి వినబడలేదు. తానన్నదంతా ఆ పెద్దమనిషి విన్నాడు కదా, ఆ పెద్దమనిషి చూస్తాడన్న ధైర్యంతో వెళ్ళిపోయాడు గొఱ్ఱెలకాపరి. ఆ పెద్దమనిషి విన్నదీలేదు, చూసిందీలేదు. తన దారిని తాను ముక్కుమూసుకుని ఏదో మననం చేసుకుంటూ చెరువులోమునకలు వేస్తున్నాడాయన. సరిగ్గా ఆయన స్నానం అయి చెంబుతో నీళ్ళుముంచుకుని గట్టెక్కి రావడం, గొఱ్ఱెలకాపరి గొంతుదాకా గంజి త్రాగి త్రేపుకుంటూ అక్కడికి రావడం ఒక్కసారేజరిగింది. తన మందంతాసరిగ్గా వుందని చూసుకుని అన్న మాట తప్పకుండా ఆ కుంటి మేకపిల్లని ఆపెద్దమనిషి దగ్గరకు తీసుకువెళ్ళి "చల్లగా చూచారు. నామంద నాకు దక్కింది. యిదిగో నే చెప్పినట్టు యిత్తున్నాను యీ కుంటిమేక పిల్లనితీసుకోండి.'' అంటూ దగ్గరగా వేళ్ళాడు. శుభ్రంగా స్నానం చేసిన తన మీద మకిలిగావున్న గొఱ్ఱెలకాపరి ఎక్కడపడతాడోనన్న భయంచేత తాను మేకపిల్ల కాలువిరగకొట్టానంటున్నాడన్న భయంచేతనేను దీన్నసలు చూడనన్నా చూడలేదు. నువ్వు అవతలకు వెళ్ళిపో నేనూ వెళ్ళిపోతాను అంటాడా పెద్దమనిషి.

---

టి. రత్నమాల

---

"కుంటిదిస్తే తీసుకోను మంచిదే యివ్వు" అని ఆ పెద్దమనిషి అంటున్నాడనుకొని ఆ గొఱ్ఱెలకాపరి 'అయ్యబాబోయి మంచి మేకనిత్తే మా అయ్య బతకనిత్తాడా నేను కుంటిదాన్ని యిత్తానన్నాను యింత దురాశ ఎవరికీ పనికిరా'దని గోలపెడుతున్నాడు. తానే మేకపిల్ల కాలు విరగ కొట్టానని దాని ఖరీదిచ్చి దాన్ని తీసుకుపొమ్మని గొడవ పెడుతున్నాడని ఆ పెద్దమనిషి గొంతు చించుకుంటున్నాడు.

అదే సమయానికి గుర్రంమీద కొత్త జీను వేసుకుని బ్రహ్మ చెముడున్న ఒక రౌతు ఆవైపువచ్చాడు. ఆ వచ్చే రౌతు తమ తగాదా తీరుస్తాడనుకొని ఆ గుర్రం వచ్చే దారికి ఆవైపు నొకరు, ఈ వైపు నొకరు గొర్రెలకావరి, పెద్ద మనిషి నుంచుని, రౌతును ఆగమన్నారు. తన గొఱ్ఱెల్ని కాసేపుచూస్తే కుంటి మేకపిల్ల నిత్తానన్నాననీ యిప్పుడీ పెద్ద మనిషి మంచిది కావాలంటున్నాడు న్యాయమేనా అని గొఱ్ఱెల కావరి గొడవ.

తాను అసలు మేక పిల్ల ముఖం చూడలేదనీ దానికాలు విరగగొట్టలేదనీ దాన్నితీసుకుని దాని ఖరీదిమ్మంటున్నాడని ఆ పెద్దమనిషి గోల.

ఈ రెండూవినిపించని రౌతు వీళ్ళిద్దరూ చెరోపక్క నుంచుని గుర్రంమీద వేసిన కొత్తజీనుయిస్తావా చస్తావా అంటున్నారనుకొని వుక్కిరిబిక్కిరై "యిది కొత్తజీను బాబోయ్! విన్నగాక మొన్న తెచ్చాను. మీకు కావాలంటే పాతజీను యింట్లో వుంది యిస్తాను తీసుకోండి" అని యింటి ముఖం పట్టాడు.

అదీ ఇదీ వినిపించని గొర్రెల కాపరి పెద్దమనిషీ కూడా యింటి దగ్గర తీర్పు చెబుతానంటున్నాడనుకొని అతనితో నడకసాగించారు. యింటికి వెళ్ళాక అడవ మీదఉన్న పాతజీనుతీసి వాళ్ళిద్దర్లోఎవరికి యివ్వాలో తోచక వూరి పెద్ద ఎవరికి యిమ్మంటే వారికిస్తానని వాళ్ళిద్దర్నితీసుకొని వూరిపెద్ద యింటికివెళ్ళాడు.

చెముడులో వీళ్ళ తాత ఆయన. ఆయన యింకో అవస్థలోకూడాఉన్నాడు. అయన కేదో భార్యతో కజ్జా వచ్చి మూడు రోజులనుంచి అరుగుమీద వేరేకుంపటి పెట్టి వండుకు తింటున్నాడు. వీళ్ళు ముగ్గురూ వచ్చి వీళ్ల గోల వీళ్లు చెప్పు

(మిగతా 65 వ పేజీలో)

## ముఖ్యవార్తలు

### రాష్ట్రంలో

16 ఏప్రిల్:– ప్రణాళికా సంఘానికిచెందిన బృందం సంగారెడ్డిని సందర్శించింది. శ్రీ యమ్. యస్. శివరామన్ ఈ బృందానికి నాయకత్వం వహించారు.

20 ఏప్రిల్:– తృతీయ ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి పథకాల కొరకు అదనంగా రు. 24 కోట్లుకేటాయించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది.

21 ఏప్రిల్:– ఆంధ్రప్రదేశ్ ఆరవ వైద్య మహాసభను హైదరాబాదులో గవర్నరు ప్రారంభించారు.

23 ఏప్రిల్:– నదీజలాల వివాదంపై కేంద్రం ఇచ్చిన తీర్పును పునఃపరిశీలించడానికి కేంద్ర నీటివనరులశాఖా మంత్రి వాగ్దానంచేసినట్లు మహారాష్ట్ర ఆర్థికమంత్రి ప్రకటించారు.

25 ఏప్రిల్:– సిర్పూర్ కాగితంమిల్లులు, సర్‌సిల్క్ పనివారలు, నిర్వాహకులు కలసి అయిదు సంవత్సరాల పారిశ్రామిక శాంతి ఒడంబడిక చేసుకున్నారు.

6 మే:– "నర్సులవారోత్సవానికి" రాష్ట్ర ఆరోగ్యశాఖామంత్రి హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు.

7 మే:– సనత్‌నగర్ పనివారలు జాతీయ రక్షణనిధి నిమిత్తం ముఖ్యమంత్రికి లక్షరూపాయలు సమర్పించారు.

14 మే:– ఇబ్రహీం పట్నంలోని మహేశ్వరం పంచాయితీ సమితిని ముఖ్యమంత్రి ప్రారంభించారు.

### భారత దేశంలో

16 ఏప్రిల్:– కేంద్ర ఆర్థికమంత్రి లోక్‌సభలో రు. 16 కోట్ల మేరకు పన్ను మినహాయింపులను ప్రకటించారు.

17 ఏప్రిల్:– దేశంలో చక్కెరధరలపెరుగుదలను అరికట్టేందుకై భారత రక్షణ నిబంధనావళిని వర్తింపజేశారు.

22 ఏప్రిల్:– నిర్బంధపొదుపుకు సంబంధించినబిల్లులో చేసిన ప్రధానమార్పులను కేంద్ర ఆర్థికమంత్రి ప్రకటించారు.

వర్తమాన ఆర్థిక సంవత్సరానికివర్తించే దిగుమతుల విధానాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది.

అధిక లాభాల పన్ను బిల్లును లోకసభ ఆమోదించింది.

27 ఏప్రిల్:–లోకసభ అధికార భాషాబిల్లును, అనధికార సవరణ లన్నింటినీ త్రోసిపుచ్చుతూ 188–15 ఓట్లతో ఆమోదించింది.

29 ఏప్రిల్:– అటార్నీ జనరల్ లోక సభలో ప్రసంగిస్తూ నిర్బంధ డిపాజిటు బిల్లు, పార్లమెంటు శాసనాధికారాలకు లోబడివున్నట్లు తెలియజేశారు.

30 ఏప్రిల్:– బ్రిటన్ రక్షణసిబ్బంది ప్రధానాధికారి లార్డ్ మౌంట్‌బ్యాటన్ నాలుగురోజుల పర్యటనపై కొత్త ఢిల్లీకి విచ్చేశారు.

30 ఏప్రిల్:– నిర్బంధ డిపాజిటు పథకం బిల్లును లోకసభ ఆమోదించింది.

7 మే:– స్వర్గీయ మోతీలాల్ విగ్రహాన్ని పార్లమెంటుకు సమర్పించారు.

8 మే:– భారత రెడ్‌క్రాస్ శతవార్షిక సంస్మరణోత్సవాన్ని రాష్ట్రపతి ప్రారంభించారు.

11 మే:– నిర్బంధ డిపాజిటు పథకం బిల్లును రాజ్యసభఆమోదించింది.

### విదేశాలలో

11 ఏప్రిల్:– ఈజిప్టు, సిరియా, ఇరాక్‌ల నూతన సమాఖ్యను గురించిన ప్రకటనను కైరోలో విడుదల చేశారు.

18 ఏప్రిల్:– యుగోస్లావియా ప్రభుత్వం 9 మంది మంత్రులను పదవుల నుండి తొలగించింది.

20 ఏప్రిల్:– కొలంబో రాజ్యాల ప్రతిపాదనల ద్వారా సృష్టించబడిన అనుకూల వాతావరణం పరిష్కారానికి దారితీయగలదని ఇండోనేషియా

వైనా దేశాలు సంయుక్తంగా చేసిన ప్రకటనలో వెల్లడించాయి.

21 ఏప్రిల్:- లావోస్ తటస్థ నాయకులు, కమ్యూనిస్టు అనుకూలపు నాయకులమధ్య కొత్తగా దాడులు జరపకుండా వుండడానికి అంగీకారం కుదిరింది.

22 ఏప్రిల్:- భూప్రదక్షణకై రష్యాకాస్మాస్ 19 అనే కొత్త ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి ప్రయోగించింది.

23 ఏప్రిల్:- ఇజ్రాయిల్ అధ్యక్షుడు శ్రీ ఇజా బెన్‌జ్వీ జెరూసలెంలో మరణించారు.

24 ఏప్రిల్:- పశ్చిమ జర్మనీ ఛాన్సలర్ అడెనోవర్ అనంతరం ఆపదవిని నిర్వహించడానికి ప్రొఫెసర్ లడ్విగ్ ఎర్హర్డును క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ డిప్యూటీలు నామినేటు చేశారు.

11 మే:- రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ అధికార పర్యటనపై కాబూల్ చేరుకున్నారు.



# ప్రభుత్వ నిర్ణయాలు

హైదరాబాదు సహకార అపెక్స్ బ్యాంకు, రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియానుంచి రు. 58 లక్షలమేరకు ఋణం పొందడానికై తాను హామీగావుండడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది.

తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలోని సహకార సంఘాలు పొందుతున్న రాయతీలను 1964 మార్చి నెలాఖరువరకు వర్తింపజేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

భారత సైన్యానికిచెందిన జవానుల పిల్లలకు వర్తింపజేసిన విద్యా రాయితీలను భారత-టిబెటు సరిహద్దు, నాగాభూమి ప్రాంతాలలో నియమించబడిన రాష్ట్రపోలీసు దళానికిచెందిన వారిపిల్లలకుకూడా వర్తింపజేయడానికై ప్రభుత్వం నిశ్చయించింది.

ఈ రాయితీలమేరకు, స్కూలుఫీజు మినహాయిస్తారు. పుస్తకాలఅలవెన్సులు, స్కాలర్‌షిప్పుల మంజూరీలో ప్రాధాన్యత చూపుతారు.

తూర్పు గోదావరి, విశాఖపట్నం జిల్లాలలో అనులోవున్న ముత్తదారి విధానాన్ని నష్టపరిహారం చెల్లించడంద్వారా రద్దుపరచడానికి ప్రభుత్వం నిశ్చయించింది.



(63 వ పేజీ తరువాయి)

కున్నారు. నీ భార్యతో ఏ తగాదా లేకుండా సామరస్యంగావుండు అని యీ ముగ్గురూ అంటున్నారని ఆ వూరి పెద్ద అనుకుని, నా స్వంత విషయంలో మీరేం కలుగజేసుకోబోకండయ్యా. యిక నేను దానిచేతికూడుచచ్చినాతినను. యిన్నేళ్లు వచ్చాయి! యిప్పుడు దీనికి కడియాలు కావాలా? భర్తననే గౌరవంకూడా లేకుండా కాలెత్తి చూపిస్తుందా; ఛడవ' అంటూ రభస సాగించాడు వూరి పెద్ద.

యీ నలుగురి రగడా విని యిరుగు పొరుగు అందరూ జేరారు. ఎవరి సంగతీ ఎవరికీ అనుపట్టలేదు. ఎవరి గోల వాళ్లదిగావుంది. ఒక చదువుకున్న పెద్ద మనిషి అందరిలోంచి యివతలికి వచ్చి ఒక్కొక్కర్నీ పిలిచి సావధానంగా అందరు చెప్పేవి విని గొబ్బెలకాపరీ, పెద్దమనిషి, రౌతుల తగాదాలు తీర్చేశాడు.

వూరిపెద్దమాత్రం.తనభార్య కాలెత్తి చూపించిందని, సనేమిరా ఆమెతో మాట్లాడనన్నాడు. ఏమిటమ్మా అని ఆ తల్లినిపిలిచి అడిగితే ఆ యిల్లాలు కళ్ళమ్మట నీరుకారుస్తూ కత్తిపీట తగిలి కాలు తెగి బాధతో నేచస్తూవుంటే పల్లెత్తు మాటన్నా ఆడకుండాఅన్యాయంగా వీధి కెక్కించడం న్యాయమేనా అని తీర్పరి నడిగింది. దాంతో జరిగిన సంగతి ఆయన గ్రహించి వూరిపెద్దకు వివరించి అవునని పించి ఎవరిదారిన వాళ్లు వెళ్లారు.



# శ్రీనాథయుగము: అన్యదేశ్యములు

తూమాటి దొణప్ప

(గత సంచిక తరువాయి)

*51.* తుర్క: రూ. తురక, తుఱక తుర్కీజాతీయుఁడు, తుర్కీదేశీయుఁడు; ఇస్లాముమతానుయాయి. 'కర్తారుఁడుండు[49]. తుర్కల మసీదు' (క్రీడా. 149) < మరా. తుర్క = మ్లేచ్ఛుఁడు; తురుష్కజాతీయుఁడు; పారసి. తుర్క్ = ఒకజాతి; 'తురుష్క,' 'తుర్క'కు సంస్కృతీకరణ రూపము. 'తురుక్క' పదము క్రీ. పూ. మున్నూఱేండ్ల నాఁటి ప్రాకృత భాషాగ్రంథములఁ గన్పట్టుటవలనను, తెలుఁగునందలి 'తుర్క'కు సమీప మాతృకను నిర్ధారించుట దుస్సాధమగుటవలనను 'తురక,' 'తురికి,' 'తుర్క,' 'తుఱక'లను వైకృతములుగా సంభావించుటయు సంగతము. 'తురక' తురుష్క శబ్దభవమని వైకృతదీపిక, పు. 59; పురుషోత్తమకవీయము, పు. 66.

తుఱక: చూ. తుర్క. '...తుఱక రాజులు...' (A. R. No. 211 of 1892; క్రీ. శ. 1485; దక్షిణ హిందూదేశ శాసన సంపుటి. iv).

తేజి: చూ. తేజీ. '...క్రాలెడు తేజులెవ్వనికి...' (కావ్యా. చూ. 5-98), 'తేజుల' (మడికి సింగన, ద్వి. భాగ., పు. 83), 'హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' (హర. పీఠిక, 26), 'గుఱ్ఱములెల్లను దేజులప్పురిన్' (విక్ర. 1-99), 'సామ్రాణి తేజులును' (నవనా. పు. 185), 'ఒకసారె యేడు తేజులు...' (ద్వా. 5-83), 'తేజులఁ జామరంబులను' (పైది. 8-5), 'అన్నిటఁదేజి యాడఁగ దేవుఁడు - తిన్నఁగ వాగేలు దిప్పేవాఁడే' (తాళ్ళపాక. అధ్యాత్మ. vi, 93) 'గబ్బితనమున తేజి మొగంబు గట్టి' (జై. పీఠిక, 32), 'అరుక తేజుల' (పి. శకుం. 1-80), 'ఎక్కెడు తేజి వ్యర్థమయ్యె' (వరాహ. 4-45), 'తేజికి' (వేం. పంచ. 4-161).

*52.* తేజీ :- రూ. తేజి. మేలుజాతి గుఱ్ఱము. 'దినమణి తేజీలంటె నొప్పు తురికిగములు కలిగి' (భాస్కర. యుద్ధ. 2280), 'అట్లనికినిచ్చె...నమర వల్లభ హరితో నుల్లసమాడం జాలెడు - తెల్లనియొక కత్తలాని తేజీహయమునన్' (నైష. 6-96), 'పడివాగె తేజీలు పల్లకీజోళ్ళు' (పల్నాటి. పు. 4), 'తేజీలున్ మదేభంబులున్' (రుక్మాం. 3-81), 'తేజీలు, మదమెత్తి తిరుగు నేనుఁగులు' (నవనా. పు. 25), 'సాంబ్రాణి తేజీలు' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 283), పడి వాగె తేజీలు(తాళ్ళపాక. x, 94), 'చెలువమున నిందుముఖులు తేజీలనెక్కి, (జై. 5-111), 'అంచతేజీ' (వరాహ. 7-33), 'విభుఁడు తేజీనెక్కెన్' (వేం. పంచ. 2-198) < మరాఠీ. తేజీ=అరబ్బీ దేశపు గుఱ్ఱము; పారసి. తాఝీ, తేఝ్, తాజి=అరబ్బీదేశపు గుఱ్ఱము; తాజియాన్ = అరబ్బీ గుఱ్ఱములు.

---

49. కర్తారుఁడను పదము హిందీయని కొందఱు. హిందీలో ఇది లేదు. 'కర్తృ' ప్రథమా బహువచన రూపము 'కర్తార'. సృష్టికర్త సర్వేశ్వరుఁడని అర్థము.
   1. 'కర్మకర్తారుఁడని కడలేని పుణ్యముల తర్మ ఫలములు దనకుఁ గైకొలుపఁగా కర్మగతిఁదెచ్చి వెంకట విభుడు మా వుభయ కర్మములఁ జెరిచె నెక్కడి దైవ మితఁడు' (తాళ్ళపాక. అధ్యాత్మ v, 196);
   2. '...సర్వతంత్రములకుం గర్తారుఁడంచున్...' (వీరభద్ర విజయము, 4-102);
   3. '...ముజ్జగంబులకునెల్లన్ దాన కర్తారుఁడై...' (పైది, 4-222);
   4. '...అతఁడు దానైన కర్తారుఁడలమి కూర్మిఁ బ్రోవ' (యయా. 1-16);
   5. 'ఏప్రొద్దుఁ గూరిమిహెచ్చఁ గర్తారునిఁ దలఁపులో నిలుపుగతాతఖాను' (పైది. 1.47);
   6. 'ప్రౌఢకర్తారు శబ్దంబు యూధికెక్కె' (కువలయా. 1.40);
   7. '...కర్తారుండనుచున్ దురుష్కులు మొదల్గాఁగొల్వ...' (విప్ర. 3.50);
   8. 'సారెసారెకుఁ గర్తారు దూఱువారు' (కృష్ణరా. 3.46).

*53.* *త్రాసు* : రూ. తాసు = తుల, తక్కెడ. 'గడసిల్లు ధరయొద్ద గెరపైన నెవ్వాఁడు త్రాసుపైఁగల్గె చందమునవంచె' (భీమ. 2-77). 'సహజరీతిఁ బుష్పశరుఁడు త్రాసునఁదూఁచి...' (విక్ర. 4-183). 'భాసుర రూపసంపదలఁ బ్రాఁతిగ నాతని భావసంభవుం-ద్రాసునఁ దూఁన్పవచ్చు...' (పైది. 7-147). 'త్రాసునంబెట్టి తూచిన' (నాసికే. 3-27). 'బాహు శౌర్యముల్ త్రాసునఁ దూఁపవచ్చునన...' (జై. 5-199). 'గంధర్వ బాలికలఁ ద్రాసులం దూఁచు బంగారు ప్రతిమల విధంబుల...' (వరాహ. 12-43) 'ఇనుప త్రాసు' (వేం. పంచ. 1-767, 1-783). 'ఎలుకల్ దినెఁద్రాసని' (పైది. 1-774). శ్రీనాథునకు పూర్వులగు కవుల కృతులయందును 'త్రాసు' ఉపయుక్తమయ్యె ననుటకు క్రింది ఉదాహృతులుచాలు : 'త్రాసులంబోని చిత్తంబుల తోడుతఁ బ్రజవివాదములెడఁ బక్షముడిగి - విని ధనవాంఛమై ధనికుల దెసవ్రాలి తీర్పక ధర్మంబుతెరువు దప్పకుండఁ బాడిదీర్చి...' (భారత. శాంతి. 2-374). 'ధనము కలిమియు లేమియుఁ ద్రాసునందు - నిలిపి యెత్తంగ ములుసూపె నిర్ధనత్వ - మెక్కుడై దాని దిక్కున నెట్టులన్న-వినుము గుణదోషముల భంగి విస్తరింతు' (పైది. 4-33). 'అచ్చులఁ ద్రాసులఁ దూములఁ - బొచ్చెంబుగఁ జేసి...' (విజ్ఞా. ప్రాయశ్చిత్త. 65). 'సత్యదినంబున సరిత్రాసుఁ బూజించి...' (పైది. వ్యవహార. 117). '...త్రాసునం దూఁచువారునుం బోలె...' (ఉ. హరి. 4-256); '...అముదోపడికి త్రాసు నాయముపలన ఇచ్చినది...' (ఈపూరి శాసనము. A. R. No. 531 of 1913, క్రీ. శ. 1278), '...ఓగిరానకు త్రాసు నాయముపల్న...' (ఈపూరి శాసనము, A. R. No. 531 of 1913, క్రీ. శ. 1278)- అని 'త్రాసు' శాసనములయందును ఉపయుక్తము (త్రాసు నాయము = తూనికవలనవచ్చు లాభము) < మరాఠీ. తరాజూ = త్రాసు; పారసి; తరాజూ = తుల; తూఁకము; సమానత, న్యాయము. 'త్రాసు' దేశ్యమని బ్రౌణ్యము, పు. 467. పదాదిరేఫ పరకసంయుక్తత ఆంధ్రభాషా వికాసమున విశిష్ట - పరిణామము. తెలుఁగునందును, మధ్యద్రావిడ భాషలగు కుఇ కువి, కొండదొర భాషలయందును దప్ప. తక్కిన ద్రావిడభాషలలో పదాదిరేఫ పరకసంయుక్తత కన్పట్టదు. తెలుఁగున తద్భవ దేశ్యముల యందును ఈ పరిణామరీతి ప్రచురము. ఉదా : క్రీడి ( = అర్జునుఁడు) < ప్రాకృత. కిరీడి < సంస్కృత - కిరీటి; మ్రానుఁ = వృక్షము : తమిళము. మరం; తెలుఁగు. వ్రేలు : తమిళము. విరల్. తెలుఁగునందలి క్రాలు, క్రిందు, క్రొత్త, క్రోవి, త్రాచు, త్రిప్పు. ప్రోలు, మ్రింగు, మ్రొక్కు, వ్రాయు మొదలగు పదాది రేఫ పరకసంయుక్త రూపములు మఱికొన్ని లక్ష్యములు. అన్యదేశ్యమగు 'త్రాసు'ను ఏతత్పరిణామానుగుణముగ సిద్ధము.

*54.* *దరిబేసి* : ముస్లిము ఫకీరు. 'సందులఁ గుండలముల్ గుడిసందిని శివలింగమును నొసలభూతియుఁ బెంపొందఁగ నొక దరిబేసి మరుండెగడెదు నన సమయవిరోధము ...' (ఛందో. 4-31).[50] 'భుజమునఁ గూబరంబు ధరించుకొని నోలు దరిబేసియగుచు బేతాళుఁడొకఁడు' (జై 5-196) దైన్యముగలవాఁడు, దీనుఁడు అని శ. ర; పు-529; జైమిని భారత ప్రయోగమునకు 'పేర్లపంజాను ధరించిన జలాలీ' అని అర్థముచెప్పుట యుక్తము < మరాఠీ. దరవేస, దరవేశీ = దేశసంచారి యగు ముస్లిముభిక్షుకుఁడు; దిక్కులేనివాఁడు, పారసి. దర్వేష్ = దరిద్రుఁడు, నిర్ధనుఁడు; ఫకీరు; సన్యాసి; దర్వేషాన = బిచ్చము; దర్వేషీ = ధార్మిక జీవితము; దర్వేషిసుల్తాన్‌దిల్ = మొహమ్మదు పైగంబరు అన్వర్థబిరుదము.

*55.* *దుకాణము* : అంగడి, మళిగ. 'తొలకరిమించుఁ దీవగతి దోఁప దుకాణము మీఁదనున్న యయ్యలి కులవేణితోఁదముల పాకుల బేరములాడఁబోయి...' (శ్రీనా. చాటువు), '...ఒయ్యారంబుఁ జూపన్ దుకాణముపై బొందిలిదోర్తు నిల్పె ...' (శ్రీనా. చాటువు) < మరాఠీ. దుకాణ (న); పారసి, దుకాన్; దుక్కాన్ : అరబ్బీ. దుక్కాన్: దుకానీ = దుకాణదారుఁడు.

*56.* *దుహిలీ* హస్తాభరణ విశేషము- 'తోరంపువజ్రాల దుహిలీలడాలు' (నవనా- పు. 46). < మరాఠీ. దుహేరా, దుహేరీ, దుహేలీ = జంట; పారసి : దువాల = తోలుపట్టీ; దువాలక్ = చిన్నపట్టీ.

*57.* *నకీబు* : చోపుదారి, ఎచ్చరిక పెలుపు వేత్రధరుఁడు; స్తోత్రపాఠకుఁడని బ్రౌణ్యము, పు. 473 'పరతత్త్వ రాజఘుందటమొరయు నకీబుల విధాన మ్రోయుచు' (వరాహ. 9-112). మిన్నుముట్టిన ప్రాఁతమినుకు నకీబుల హుంకృతి' (పైది. 10-5) 'కరువలినకీబుగాగ...' (పైది. 10-29); పొదలఁదుమ్మెదనకీవులు బిట్టుమొరయ' (ద్వి. పరమ. తృతీయా. పు. 241) అని అర్వాచీన ప్రయోగము < పారసి. నకీబు = బిరుదుగద్యలు చదివి,

---

50. (అమరఁగఁ బులితోలును మ। స్తమునం బిలు-ఇడలు దాల్చి సొగసుఁడొప్పెన్.। హిమకరశేఖరు గుడి నన। సమయ విరుద్ధార్థమగుచుఁ జను సత్కృతులన్' ।। (6-134) అని సమయ విరోధమునకు లక్ష్యముగా కావ్యాలంకార చూడామణి.)

దర్శనార్థులను ప్రభువునకు పరిచయము చేయువాఁడు.

*58.* *పంజార* : 'సుమాత్రా' ద్వీపమున 'పజ్జార్' అను పేరుగలది. ఒండె, బోర్నియో' ద్వీపమున 'పంజార్ మాసీస్' అను పేరుగలది. ఈ రెండు దేశములు కర్పూర వృక్షములకుఁ బ్రసిద్ధములే యఁట' (వే. ప్ర. శాస్త్రిగారు, హరవిలాస పీఠిక, పు. 7) 'పంజారఁ గర్పూర పాదపంబులు దెచ్చె...' (హర. పీఠిక, 26).

*59.* *పంజు* : ప్రకాశించు రత్నములు చెక్కిన. 'పంజుమంచము డిగ్గె మంజు ఘోష' (హర. 7_137) దివటీ. 'వెంటి పంజువలె' (ప్రబోధ. 4_48).[51] 'సూరెల వెలుంగు పంజుల' (వేం. పంచ. 4_345) < పారసి. పంజ్ = జ్యోతి; ప్రకాశము; పంజ = ఐదువ్రేళనుపోలిన కాగడా.

*60.* *పండువా* : పదునాలుగు పదునైదు శతాబ్దులలో పశ్చిమ బంగాళమును పాలించిన సుల్తానుల రాజధానియగు 'పాండువా' పట్టణము — నేఁటి బంగాళమున మాల్దా జిల్లాలోని ఇంగ్లీషుబజారు( < అంగ్రేజాబాద్) నకు నాలుగున్నర కోసుల దూరమున నీ పట్టణమున్నది. దీనికే ఫీరూజాబాద్ అనియు నామాంతరము. 'పండువాయను దేశము' అని సూ. ని. (చూ. సంపుటి. v, పు, 28). 'పండువా సురతాణి పావడంబిచ్చిన భద్రేభములు వీధిఁబాలెముండు' (భీమ. 1_38). 'పండువా సురధాని పావడంబంపిన భద్రేభములు వీటఁబాళెముండు' (కాశీ పీఠిక, 35). 'పండువా ఢిల్లి రాఢాది పట్టణముల యధిపతులు' (హర.పీఠిక,29).

*61.* *పరాకు* : ఉపేక్ష, నిర్లక్ష్యము. 'దమయంతి ... పరాకువహించి యుండె' (నైష. 5_106) 'పరాకుసేయకు' (తాళ్ళ. అధ్యాత్మ. vii. 61) తత్పరత. 'రాకుమారునిఁ జూచు పరాకు కతన' (నైష. 6_63); ఏమఱిపాటు. '...ముచ్చటల్ద్రవ్వుచు నొక్క కోమలి పరాకున నుండఁగ...' (నైష. 6_113). '...ఇది యేమి పరాకున నున్నదానవో తొత్తుల తొత్త...' (నా. పంచ. మిత్రభే. 205). 'పరాకుగా' (వరాహ. 4_11). 'అతని పరాకుచూచి రుధిరాక్ష నిశాటుఁడు...' (జై. 6_167). 'నాకెక్కడిది పరాకు...' (వేం. పంచ. 2_91); మఱి యొకట మనసు చెల్లుట. 'ఆత్మ నొక్కించుకయుఁ బరాకయ్యేనేనిఁ బ్రాణవల్లభ దన్నేమి యనునో యనుచు' (నైష. 7_16). 'కొందఱు పరాకు లేకాకినులై మగని మొఱఁగి యెక్కడికేనియుం జనుదురు' (కాశీ. 2_79). 'ఉడుగనివంత నింతతడవూఱటలేక పరాకువోలె' (వేం. పంచ. 2_74).) అచ్చెనఁటి పరాకుఁబోలె నటు మొగమయ్యెన్' (పైది. 2_88); ఎచ్చరిక దెలుపుమాట. 'బహుపరాకాయ' (తాళ్ళ. అధ్యాత్మ. vi. 58). (పార్వతీ ధవ పరమేశ భవపరాకు (పరతత్త్వ రసాయనము, 1_118) < మరాఠీ పరాక్, పరీక్ = శోధన; ఏకాగ్రత; పర్యవేక్షణ. పరాఙ్ముఖ శబ్దవికృతి కావచ్చునని మా గురువర్యులు శ్రీ మధుసూదనషాడంగిగారు. పరాక్-శబ్ద భవమని వైకృత దీపిక, పు. 73; పురుషోత్తమ కవీయము, పు. 84. ఈ పక్షమున విది వాక్-వాక్కు, వాకువలె పరాక్-పరాక్కు—పరాకు అని తత్సమముగా సాధింపనగు. పరాక్కు = ప్రతిలోమగామి. పరాఙ్ముఖము.

*పవుజు* : చూ. పౌజు .'ఇరులు పవుజులు' (విక్ర. 6_63).

*62.* *పారసి* : ఇరేనియను భాషా కుటుంబమునకు చెంది, పారసీకదేశమున ప్రచుర వ్యవహారముకల ఒక భాష. 'అన్నయ మంత్రి శేఖరుఁడు...పారసి భాష వ్రాసినన్...' (భీమ. 1_74) < మరాఠీ. ఫారశీ(సీ) = పారసిభాష; పారసివాఁడు (పారసీకము సంస్కృతీకరణ రూపమని మరాఠీ వ్యుత్పత్తి పదకోశము. పు. 526). అరబీలు : ఫర్స్ = పశుపాలన. పారశీక శబ్దభవమని వైకృతదీపిక, పు. 77. పారసీక శబ్దభవమని పురుషోత్తమ కవీయము, పు. 88.

*63.* *పింగాణి* : 'ఒక దినుసు తెల్లమట్టి పాత్రము' (శ. ర., 676). 'గాజు పింగాణి' (రుక్మాం. 4_35). 'గంగాళాలు పింగాండ్లు' (వరాహ 4_112). 'పచ్చల పింగాణిఁ బన్నీరు గులికిన' (పైది. 4_156) < పారసి. పింగాన్ = పళ్ళరము; ఫింజాన్ = చీనా మట్టిపాత్ర, ఇది మరాఠీ లేక కన్నడ పదమై యుండవచ్చుననియు, సీతాకోక చిలుక అని అర్థమనియు, రంగురంగుల సీతాకోక చిలుకల బొమ్మలను చిత్రింపఁబడిన పాత్రలు కావున వీనికి 'పింగాణి' పాత్రలు అను పేరు సిద్ధించిన దనియు మిశ్రబ్రౌణ్యము, పు. 75.

*64.* *పేషణి* : దూత, సందేశహారి.[52]

---

51. 'వెంటపంజు' అని ముద్రితపాఠము, ప్రబోధ చంద్రోదయము. చింతామణి ముద్రాక్షరశాల. చెన్నపురి, 1900 ; పు. 40.

52. 'పేషణి యనఁగా సన్నెకల్లు—హనుమంతుఁడు సన్నెకంటిమీఁద పచ్చడి నూఱిన నెట్లు నూఱునో శత్రువులను అట్లు నూఱెడువాఁడు అని బిరుదార్థముగా నుండనోపు' (వేదమువారి పర్యంకషవ్యాఖ్య, మదరాసు, 1913 ; పు. 18).

'పేషణి హనుమంత బిరుదాంకులగు రాచవారికి నెయ్యంపు వరసుతుండు...మంత్రియల్లాదరాజు...' (నైష. 1-32)[53] 'పేసని హనుమంత్త బిరుద ప్రతాప వత్సవాయ అయ్యపదేవ మహారాజులు...' (పెద్దాపురము తిరుపతి శ్రీరంగరాయ (? శృంగార రాయ) దేవాలయ ముఖ మంటప స్తంభము మీఁది శాసనము, 5,6,7-పంక్తులు, క్రీ. శ. 1442). 'దానప్రతిగ్రహా ధీన బిరుదు మీది-పేషణీ హనుమంత బిరుదనాది' అని అర్వాచీనుఁడగు కందుకూరి రుద్రకవి చాటువు (చాటు పద్య మణిమంజరి. ద్వి. భా. పు. 26) < మరాఠీ. పేషణ = నియోజించుట; పేషణీ = రాయబారి < సంస్కృత - ప్రేషణ = పంపుట; ఆదేశము; ప్రాకృత. పేసణ = నియోజనము: ఆజ్ఞ, ఆదేశము- 'పేసణం చ కజ్జమ్మి' అని దేశీనామమాల vi. 57.

*65. ఫౌజు*: రూ. పవుజు. సేన; పటాలము. 'ఫౌజుపై నడచిరి' (పల్నాటి. పు. 114). 'చిలుక గుఱ్ఱపుఁ బౌజు' (విక్ర. 8-57). 'పుట్టుగులనే పౌజుల కురికి' (తాళ్ళ. అధ్యాత్మ vi. 25). 'వలరాచ పౌజులు' (వైది. vii. 52). 'పార్థునిఁ బౌజులుసేయఁబంచి' (జై. 3-98). 'పౌజులాయితంబు చేయుమనిన...' (వరాహ. 11-57). 'విటిగె నీ పౌజంచు' (వైది. 11-103). 'మనపౌజుల' (ప్రబోధ. 4-60) < మరాఠీ.ఫౌజ = దండు. సేన; పారసి. ఫౌజ్ = సేన; సర్‌ఫౌజ్ = దళవాయి, సేనాపతి ;అరబ్బీ. ఫౌజ్; తెలుఁగున 'పౌజు'ను సబిందుకముగా కొందఱు పఠించుటకు హేతువు, ఇది పుంజ శబ్ద భవముగా భావింపఁబడుట.నిర్బిందుకముగా స్వీకరించుట యుక్తియుక్తము.

*66. బరాబరి*: ప్రభుదర్శనము నిమిత్తము గుమిగూడు ప్రజలను బగళముసేసి ఎచ్చరిక దెలుపుట. 'పటువేత్రకుల్ బరాబరు లొనరించి, (పల్నాటి. పు. 16). 'బద్దల వారంత పరుగునవచ్చి-చెలగి బరాబరుల్ చేసిరి మ్రోల' (వైది. పు. 46). 'ప్రజ తండములు బరాబరిసేయ' (ద్వి. హరిశ్చ. ఉ. పు. 283) < మరాఠీ-బరోబర = సదృశము, సమానము; పారసి. బర్-ఆ-బర్ = సమత; సదృశము; స్పర్థ; బర్-ఆ-బరీ = సమత్వము, సాదృశ్యము.

*67. బాఁకు*: మొలను దోపుకొను వంకీకత్తి. 'అలరాజు బాకున కవతారమొంది' (పల్నాటి. పు. 2). 'పరశువుల్ బల్లెముల్ బాకు కటార్లు-శార్ఙ్గముల్ ధనువులు శరధులు దాల్చి (వైది. పు. 28). 'బాకుల రొమ్ములు పరియలుచేసి - గదలచే శిరముల గదునుగ్గొనర్చి' (వైది. పు. 111) < మరాఠీ. బాఁక, బాక = వంకర, వంపు.

*68. బాజారు*: విపణి వీధి యందలి జనము. 'పూజారి వారికోడలు. బాజాఁబగబిందెజాఱి దబ్బునఁ బడియెన్. మైజారు కొంగుదడిసిన- బాజారేతిరిగిచూచి పక్కన నవ్వెన్. (శ్రీనా. చాటువు) < మరాఠీ.బాజా(రూ)ర అంగడి వీథి; సంత; పారసి. బాజార్ సంత; సంతరోజు; బేరము; బాజారీ = బజారునకుసంబంధించినవర్తకుడు "బాజాఱు'' శకటరేఫ ఘటితముగాతెలుఁగు నిఘంటువులు ఉట్టంకించుట పొరపాటు. ఇది ప్రసార శబ్దభవమని వైకృతదీపిక, పు. 85. పురుషోత్తమకవీయము. పు. 99

*69. బిడారము*: దండుదిగుటకనువుగా ఏర్పఱిచిన పటకుటీరాదికము.... మున్నాయితంబు సేయించిన బిడారంబుల సకలయాదవుల విడియించి...' (జై.3-118 మరాఠీ. బిడార, బిఢార = ఇల్లు; విడిది; ఉగ్రాణము.సరకులకొట్టు; దేశ్యమనికిట్టెల్ 1115.

*70. బీబీ*: తురుష్కులయంతఃపురస్త్రీ. కులీన. (... మబ్బుకురులుబ్బు నగవులు బీబీలకుఁ గొల కలవె పృథివీ స్థలిపై. (శ్రీనా. చాటువు). "బీబీగబ్బిమిటారులు'' (రాజవా. 2-60) అని అర్వాచీన ప్రయోగము < మరాఠీ. బిబి = ముస్లిము స్త్రీ. యవనకన్య; పారసి. బీబీసత్కుల ప్రసూతయగు స్త్రీ < తుర్కీ.

*71. బొందిలి*: బొందిలీజాతి, బొందిలి దేశమునకుచెందిన. వన్నెలగాగరా... కరకంజములన్ మునుఁగున్ బిగించి ప్రచ్ఛన్న ముఖాబ్జయైనడచె బొందిలి భామ గోమునన్ (శ్రీనా చాటువు). ... ఒయ్యారంబుఁజూపన్ దుకాణముపైబొందిలి దోర్తునిల్చె ముఖచంద్రస్ఫూర్తిశోభిల్లగన్ (శ్రీనా,చాటువు). జీవికనిమిత్తముబుందేల్ ఖండమునుండి పెక్కురు దక్షిణదేశమునకు తరలివచ్చిరని చరిత్ర. బహామనీసుల్తానుల పౌజులలో శత్రుజీవులను బొందిలీలు అసంఖ్యాకులుండినట్లుఁ...ఏనుగులు వేయి, బొందిలీ లెంచిచూడలక్ష. పెండారులొలక్ష లక్ష తురక లిచటిబలము...' (కృష్ణరా 3-55) అని కృష్ణరాయ విజయము నేఁడు విశాఖ మండల పరిసరముల బొందిలీజాతి వారెక్కువగాఁగలరఁట: < మరాఠీబుందేల్ వింధ్య పర్వత పరిసరములందలి ఒకదేశము.

[సశేషం]

---

53. 'ప్రెషణి హనుమంత బిరుదాంకుడగు రాచవారికి...' (శృం. నై., అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29672, 4 వఆకు, 2 వ పైపు. 6 వ పంక్తి);
'పెషిణి హనుమంత్త బిరుదాంక్కుండగు రాచవారికి' (వైది, అం. వి. గ్రం. లోని తాళపత్ర ప్రతి నెం. 29800. 4 వఆకు మొదటిపైపు, 7 వ పంక్తి).

# "కొత్త" వారి సరికొత్త రచనలు

## గ్రంథ సమీక్ష

భాషాపరంగా గాని, భావపరంగా గాని విశ్వ శ్రేయస్కరమైన విప్లవం సాహిత్యంలో సర్వదా వాంఛనీయం. విశ్వ శ్రేయస్సుకు భిన్నమైన విప్లవం ఏ రూపంలో వున్నా అవాంఛనీయమైనది. ఇటువంటి అవాంఛనీయమైన సాహిత్యంలో చేరిన గ్రంథమని చక్కగా నిరూపిస్తూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పంచశతిపై శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరిగారు వ్రాసిన ఉదాత్త విమర్శన గ్రంథమే "పంచశతీ – పరీక్ష" అన్నది. 500 పద్యాలున్న విశ్వనాథవారి పంచశతిలో ఎటువంటి అవాంఛనీయమైన భావాలు, ఏహ్యమైన భావాలు వెల్లువలై పెల్లుబికినవో అతి సులభంగా శ్రీ కొత్తవారు 55 పుటలున్న యీ చిన్న పుస్తకంలో సమ్మర్ధిగా నిరూపించారు. అర్ధసత్యాన్ని పూర్ణసత్యంగా చాటడం ఎంత బలహీనమైన విషయమో. యితరులను దూషిస్తున్నా మనుకుని తమ్ము తామే దూషించుకొంటున్నట్లు పద్యాలను వ్రాయడం అంత అపహాస్యంపాలై పోయే విషయం.

'చిన్న యుద్యోగ మిమ్మని చేరఁబోవ
బ్రాహ్మణుఁడ వని గుమ్మమ్ము పాటఁదోలె
బ్రాహ్మణుండె కలెక్టరు వచ్చినంత
నడుగు నడుగున వలిపపు మడుగు లొత్తె'

విశ్వనాధవారి పంచశతి లోనిది యీ పై పద్యం. దీనిలోని భావాన్నే తల్లక్రిందులు చేసి వ్రాసిన

'చిన్న యుద్యోగ మిమ్మని చేరఁబోవ
బ్రాహ్మణేతరుఁడ వనుచు పారద్రోలె
శూద్రుడే కలెక్టరయిన చొప్పుగాగ
నడుగు నడుగున వలిపపు మడుగు లొత్తె.'

అన్న పద్యంలో ఎంత వాస్తవికత, ఉదాత్తత వుంటుం దనుకుంటామో పై పద్యంలోనూ అంతే వుంటుందనుకుంటాము. పాక్షికమైన ఏకపక్ష వాదానికి విలువెంత వుంటుంది ?

అధమ కోకిలలెల్ల వాయసములైన
మనము పెంచెదుచోఁ బెరిఁగినవి ; వాని
కూఁత పంచమస్వరమట ; కొనకు నేఁడు
స్వరములందున మనల ప్రసక్తి లేదు.

పరనిందతో యీ పద్యాన్ని వ్రాశామనుకున్న 'పంచశతీ' కర్త యిందులో పర ప్రశంసతో ఆత్మనింద చేసుకున్న రీతిని కొత్తవారు చక్కగా వెల్లడించారు.

'సారిది భారతమును వ్రాయ సోమయాజి
యగ్నిహోత్రాలు చేసినాఁ డనుట నిజమె
అగ్నిహోత్రాలు లేకుండ నక్షరంబు
సాఁగదేకద నేఁటి మా సత్కవులకు'

విశ్వనాథవారికి అభిమాన పాత్రుడైన బహు యజ్ఞాలు చేసిన నన్నయ్యను విడచి ఆతనికంటె తర్వాతివాడైన తిక్కననే ప్రత్యేకించి పేర్కొనడం దారితప్పడం.

మొత్తం మీద అవాంఛనీయమైన భావ పుంజంతో కూడిన యీ పంచశతిలో అసభ్యత కూడా గూడుకట్టుకొనడం విచారకరమైన విషయం. ఒకరు ఒకదాన్ని మరొక రింకొక దాన్ని సత్కృతిగా పేర్కొనవచ్చునుగాని విశ్వనాథవారికి ఆంధ్రసాహిత్య చరిత్రలో ఉన్న ప్రత్యేక స్థానాన్ని తొలగించలేము. అటువంటి అసాధారణ ప్రజ్ఞగల విశ్వనాథ వారి చేతినుండి యిటువంటి రచనను ఏ సహృదయ పాఠకుడూ వాంఛించడు. ఐనా కొత్త వారికి మాత్రం ఒకమనవి. "వైదిక వాఙ్మయ చరిత్ర" మొదలు "బాలప్రౌఢ ప్రశ్నోత్తర మాల'' వరకూ 63 పుస్తకాలు వ్రాసి ఆంధ్ర సాహిత్యంలో ప్రత్యేకత సాధించుకున్న కొత్తవారు 'పంచశతి' వంటి పుస్తకాలమీద విమర్శలు వ్రాయడం రూపంగా వారికి లేని పెద్దరికాన్ని తెచ్చిపెడుతున్నా రనవచ్చును. ఏ రచయితనైనా పడపోయాలంటే ఆ రచయిత తన రచనలలో గొప్పదిగా దేన్ని భావించుకుంటాడో దానిమీదనే తులనాత్మకమైన ఉదాత్తమైన విమర్శ వ్రాసి పడపోయడంలోనే గొప్పతన ముంటుందని తప్ప యింతకంటె కొత్తవారికి కొత్తగా చెప్పవలసిం దేముంటుంది ?

పండిత కవులైన కొత్తవారు 350 పద్యాలున్న నూతన కృతి నొకదానిని వెలయించారు. తమకు వచ్చిన సంస్కృత శ్లోకాలను కొన్ని సంస్కృత చాటువులను మనోజ్ఞంగా తెలుగులో వ్రాశారు.

తంత్రీతాతలు కవులు విద్వాంసులై వ(
బుత్రులకు గర్వ మన్నదే పుట్ట(బోదు ;
ఆస్తిపాస్తులు చదువు సంధ్యలును నడుమ
నష్టె వచ్చినవా(డె పో మిట్టి పడును

ఇటువంటి భావాలతో అనేకమంది ఏకీభవించరు. ఏకీభవించకపోవడం సమంజసం కూడా. అనూదితాలే అయినా ఇటువంటి వాటిని తప్పిస్తే తక్కిన పద్యాలన్నీ భాషలో, భావంలో ఉదాత్తంగానే అవతరించాయి. పంచశతిని పరీక్షించిన శ్రీ కొత్తవారు దీన్ని "పంచశతి" పద్యాలకు పెంచి వ్రాసివుంటే బాగుండేదేమో !

సూత పురాణం వ్రాసి ఆంధ్రదేశంలో ఒకానొక సాంఘిక విప్లవాన్ని లేవదీసిన త్రిపురనేనివారూ కలి పురాణం వ్రాసి త్రిపురనేనివారి అడుగుజాడలలో నడచిన కొత్తవారూ నాస్తికులన్న భావం కొందరిలో పాతుకున్నది. సూత పురాణం అవతారిక పద్యాలను అవగాహన చేసుకుంటే కవిరాజు ఆస్తికత్వంబట్టబయలవుతుంది. ఇంక కొత్తవారి ప్రగాఢమైన ఆస్తికత్వానికి ప్రతిబింబంగా వెలసిందే 'మాస్వామి' అన్న యీ కృతి. "వేగ రావయ్య తిరుమల వెంకటేశ" అన్న మకుటంతో సప్తశతి పద్య సుమాలతో వెలసిన యీ కృతిలో ప్రతి సుమమూ గంధవంత మనలేదు. శ్రీ చౌదరిగారి అకలంకమైన భక్తి భావాలను మత శాత్త్విక భావానుభూతిని ఉదాత్తంగా వెలువరించే పద్యాలు అనేకం వున్నాయి. ఉదాహరణకు ఒక పద్యం.

క్షీరసాగర మమృత మిచ్చినది యొక్క
సారి కావచ్చు ; నీ కధాసాగరంబు
భక్తులకు నెన్నిసారులు పంచియిచ్చె ?
వేగ రావయ్య తిరుమల వెంకటేశ !

తొలుత ఆరాధన పత్రికలో అనుస్యూతంగా వెలువడి పునర్ముద్రితమైన యీ గ్రంథంలో ఆ ప్రమరణ విషయం లోపించింది. ఈ విషయం మలి ముద్రణలోనైనా స్మరించబడడం అవసర మనుకుంటాను.

[(1) పంచశతీ — పరీక్ష — 55 పుటలు - వెల : 0-75 న.పై. (2) మంజరి - పుటలు 92- వెల : 2-00 రు. (3) మాస్వామి - 180 పుటలు - వెల : మేలుప్రతి - 3-00 రు. సాదా ప్రతి రు. 2-50 న.పై. - ప్రతులకు - రచయత పేర - లెక్చరర్, పి.బి.యన్. కాలేజి, నిడుబ్రోలు,గుంటూరు జిల్లా]

* * * *

# నవరత్నాలు

మన దేశం రత్నగర్భ అని పేరు కొందడం ఎన్నెన్నో రత్నాల గనులుండడం వల్లనే జరిగింది. ఎంతో విలువగల రత్నమే సామాన్య మానవుడికి లభిస్తే ఏదో గాజు ముక్క అని అవతల పారవేస్తారు. రత్నాలలోని వైశిష్ట్య మేమిటో గుర్తించవచ్చు. కాని వాటి విలువకు మూల మేమిటో చెప్పడం కష్టం. నవరత్నాల పుట్టుపూర్వోత్తరాలు, వాటి భేదాలు, ఆకార వికారాలు, మంచిచెడ్డలు జ్యోతిశ్శాస్త్ర రీత్యా వాటిని ధరించడంవల్ల కలిగే శుభాశుభ ఫలితాలు వివరిస్తూ శ్రీమతి లీలావతీదేవి M.A.M.ED గారు వ్రాసిన చక్కని గ్రంథమే యీ "నవరత్నాలు". (నవరత్నాలు : రచయిత్రి లీలావతీదేవి. పుటలు 78. వెల రు. 1-50 న.పై. ప్రతులకు సర్వోత్తమ ప్రచురణలు, మారీసుపేట, తెనాలి, గుంటూరు జిల్లా.) మన వజ్రపు గనుల చరిత్రతో ప్రపంచంలో ప్రఖ్యాతి గాంచిన వజ్రాల పుట్టుపూర్వోత్తరాలతో శ్రీ గోలి శివరామయ్యగారు చిత్రించిన చిత్రాలతో అలరారుతున్న యీ పుస్తకం రత్నాలపట్ల ఆసక్తి వున్నవారందరూ పఠించదగింది.

—వి. యం

# రచయితలు

డా॥ నీలం సంజీవరెడ్డి, ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.
శ్రీ సి. వి. సుబ్బన్న, శతావధాని, ప్రొద్దుటూరు, కడపజిల్లా.
శ్రీ పి. వి. నరసింహారావు, న్యాయ, సమాచారశాఖ మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.
శ్రీమతి క. దివ్యజ్ఞానసరోజినీదేవి, న్యూఢిల్లీ.
శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిక్ రిలేషన్ ఆఫీసర్, సమాచార పౌరసంబంధముల శాఖ, హైదరాబాద్.
శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి, పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా.
డాక్టర్ కె. కృష్ణారావు, విదేశాంగ శాఖ మంత్రిత్వశాఖ, ఢిల్లీ.
శ్రీ కె. దేశపతిరావు, సైఫాబాద్, హైదరాబాద్.
డాక్టర్ కె. యం. జార్జి, మద్రాస్.
"రమేశ్", ముదినేపల్లి, కృష్ణాజిల్లా.
శ్రీ కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు, గోషామహల్, హైదరాబాద్.
శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, మారేడ్‌పల్లి, హైదరాబాద్.
"సత్యం", తిరుపతి, చిత్తూరుజిల్లా.
శ్రీ రావూరి భరద్వాజ, ఆల్ ఇండియారేడియో, హైదరాబాద్.
శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్, 14-అశోకారోడ్, న్యూఢిల్లీ.
డాక్టర్ వేమిరెడ్డి రాజేశ్వరమ్మ, నీలోఫర్ హాస్పిటల్, హైదరాబాద్.
శ్రీ వాసిరాజు ప్రకాశం, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్
శ్రీ జి. కోటయ్య, నరసింహారావుపేట, ఏలూరు. ప. గోదావరిజిల్లా.
శ్రీమతి టి. రత్నమాల, పంజగుట్ట, హైదరాబాద్.
శ్రీ తూమాటి దొణప్ప, లెక్చరర్-ఆంధ్ర యూనివర్సిటీ-వాల్తేరు.

ఆంధ్రప్రదేశ్ పత్రిక నూతనవోకడలలో పోతోంది. చాలా ఆకర్షణీయంగావుంటోంది. ఇది యిక్కడివా రందరిమాట కూడా —

పి. వి. రత్నం
ఏలూరు.

'ఆంధ్రప్రదేశ్' మాసపత్రిక ప్రతినెల చదివి, అందలి సాంస్కృతిక, వైజ్ఞానిక సాంఘిక, రాజకీయ, సముపేతములైన వ్యాసములు, పద్యములు, మున్నగు వాని ప్రాశస్త్యమున కమితానంద మొందుచున్నాను.

మాకెన సీతారామ పాత్రుడు.
చింతలపాలెం.

యుద్ధ సమాచారమును తెలుసుకొనుటకు ఈ పత్రిక మాకొక మార్గదర్శకముగా నున్నది. యెప్పటికప్పుడు ఈ పత్రిక క్రొత్తవార్తలతో మమ్ములను ముగ్ధులను చేయుచున్నది.

హృదయంగమమైన చిత్ర పంక్తితో ఈ పత్రిక కూర్చబడుచున్నందుకు యెంతో సంతోషము కలుగుచున్నది.

కొత్తపల్లి బి. శేషగిరిరావు.
హైద్రాబాద్ జిల్లా

ఆంధ్ర ప్రదేశ్ మాసపత్రిక ఒక నెల కంటె మరొకనెల మంచికథలు, గేయాలు వ్యాసాలు, మొదలగు కొత్త కొత్త శీర్షికలతో శోభాయమానంగా వెలువడుతూంది. గత మార్చి విద్యాసంచికలో 'విశేషాలు—వ్యాఖ్యలు, ఏరినముత్యాలు' 'అనువాద భారతి' అను శీర్షికలు మా యింటిల్లి పాదికీ ఆనందం చేకూర్చినవి. పత్రికను సర్వాంగసుందరంగా వెలువర్తిస్తున్నందుకు మీకు నా అభినందనలు.

మేము యెదురుచూడబోయే కొత్త శీర్షికలు కల సంచికలో ఆంధ్ర శిల్పకళా




"ఆంధ్ర ప్రదేశ్"మార్చినెల సంచిక చేరినది. చదివితిని. చాల సంతోషము. మన చదువరులకు ఆకర్షకములు ఆవశ్యకములు అయిన విషయములు పెక్కులు మీ పర్యవేక్షణమున దీనిలో వెలువడుచుండుట మిక్కిలి ఆనంద కరము. ఇది పలువిధముల విజ్ఞానము కలిగింప గలదు.

రామనగరం } దువ్వూరి
వాల్తేరు } వెంకటరమణశాస్త్రి
ఆంధ్రవిశ్వవిద్యాలయపండితులు.

వైభవాన్ని చాటేవ్యాసాలు అడపాదడపా ప్రచురించగోరుచున్నాను. రాష్ట్రీపురోభివృద్ధి కార్య క్రమాలతోపాటు ప్రపంచంలో యిటీవల జరిగే సంఘటనల, భారత్ పై చైనా ముష్కరుల దురాక్రమణ ఇరాక్ లో తిరుగుబాటు, ఐరోపా సమిష్టిమార్కెట్ మొ. సమస్యలను గూర్చి న్యాయసమాచార శాఖ మంత్రి బహుచక్కగా వాఖ్యానించారు. రాష్ట్రీ సమాచారమేగాక దేశీయ విదేశీయ వార్తలు తెలుసుకొనుటకు 'ఆంధ్ర ప్రదేశ్' దోహదకారి అవుతున్నది.

ఎన్. చెన్నకేశవులు,
మద్రాసు.

తమరు మార్చి నెలలో నూతనముగా ప్రవేశపెట్టిన విశేషాలు—వ్యాఖ్యలు, అనువాద భారతి, ఏరిన ముత్యాలు, లలనావనం, అనే శీర్షికలు చాలా బాగున్నవి. ఏప్రియల్ నెలలో ప్రచురించిన 'విద్యాసంచిక' అనుబంధం చాలావిషయాలను తెలిపినది.

దీక్షకుంద, టి. పుల్లయ్య
వరంగల్లు జిల్లా. ఉపాధ్యాయుడు.

నేను ఒక మిత్రునిద్వారా మీ పత్రికను గురించి విని పత్రికను కొనవలెనని తలంచి యీ సంవత్సరం జనవరినుంచి ప్రతినెలకొని చదువుచుంటిని. అందుగలవ్యాసములు, నాటికలు పద్యములు చదువుచున్నకొలది చదువవలెనని ఉత్సాహముగా నున్నది. మీరు యీ విధముగా ప్రతీనెలా వ్యాసములు, నాటికలు, కథలు, బహుసుందరముగా వెలువరించి నన్ను మరింత ఉత్సాహవంతునిగా చేయుదురని ఆశించుచున్నాను.

పొట్నూరి నరసింహ రాధాకృష్ణ
విశాఖపట్టణము.

ఇందు ప్రచురితమైన గేయములు, నాటికలు, ముఖ్యంగా చారిత్రక వ్యాసములు, ఉత్సాహవంతులను చేయుటయేగాక పూర్వ చరిత్రానుభవమును కలుగజేయుచున్న వనుటలో సందేహము లేదు.

తాండూరు పుచ్చా విఠలరావు
మహబూబునగర్ జిల్లా.

మీయొక్క ఆంధ్రప్రదేశ్ నేను మూడు నెలలనుంచి ప్రతిసంచిక చదువు చున్నాను. చక్కటి వ్యాసములు, చక్కని రచనలు, చక్కని పద్యములు ప్రకటించుచున్నందుకు చాలా సంతోషించుచున్నాను. అందుకై నా హృదయ పూర్వకమైన ధన్యవాదములు.

కొండాకల్ బి. కృష్ణమాచారి.
హైద్రాబాద్ జిల్లా.

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,05,858 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| 20 వేలు, అంతకుమించిన జనాభాగల పట్టణాలు, నగరాలు | ... | 223 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.78 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 74.90 లక్షలు |
| నికర సాగుభూమి (1959-60) | ... | 10,889,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 327 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1959) | ... | 4083 |
| విద్యుదుత్పాదన (1961) | ... | 1,026.072 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1961-62) | ... | 4084 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1960-61) | ... | 119 |
| ఉన్నత పాఠశాలలు (1960-61) | ... | 1224 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 431 |
| పంచాయతీలు (1959-60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (1-4-1962 నాటికి) | ... | 378 |
| 1960-61 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1007.51 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 90 |

